ఓ౩మ్

# ద్ధ హనుమచ్చరితము



ప్రకాశకులు

శ్రీ కోటికె లక్ష్మయ్య భాగ్యనగరము

ఓ3మ్

సహృదయ వైదిక సాహిత్య ప్రచురణల గ్రంథమాల : 83

# శుద్ధ హనుమచ్చరితము




హిందీ మూలము

శ్రీ ఈశ్వరీ ప్రసాద్ ''ప్రేమ్'' సిద్ధాన్త శాస్త్రి

తెలుగుసేత

సిద్ధాన్తాచార్య లోకామల్లారి, ఆర్యనగర్, ఇందూరు.

ప్రకాశకులు

శ్రీ కోటికె లక్ష్మయ్య

సహృదయ వైదిక సాహిత్య ప్రచురణలు

భాగ్య నగరము - 500 060

ప్రథమ ముద్రణ

మూల్యము రూ. 40=00

సహృదయ వైదిక సాహిత్య ప్రచురణల గ్రంథమాల : 83
**శుద్ధ హనుమచ్చరితము**
తెలుగు సేత :- **సిద్ధాన్తాచార్య లోకామల్లారి.**
ప్రథమ ముద్రణము
ప్రతులు ౧౦౦౦



సృష్టి సంవత్సరము :-1972949100 (ససంధి)
1960853100 (అసంధి)
క్రీ.శ. 2000
మూల్యము :40 / -

**ప్రాప్తిస్థానములు :**

**1. శ్రీ కోటికె. లక్ష్మయ్యగారు**
శ్రీ విద్యా బుక్ డిపో, సుల్తాన్ బజార్, హైద్రాబాద్-195.
ఫోన్ : 4656644

**2. శ్రీ విద్యా బుక్ పాయింట్**
రామాటాకీస్ ఎదురుగ, సి.బి.ఎమ్ కాంపౌండ్,
విశాఖపట్నము - 3, ఫోన్ : 575703

**3. ఆర్య సమాజమందిరము**, దిల్‌సుఖ్ నగర్, బాదం కాంప్లెక్స్,
చైతన్యపురి 'X' రోడ్, హైద్రాబాద్-500 060.

4. **వైదిక్ సాహిత్య భండార్**, సుల్తాన్ బజార్, హైద్రాబాద్-195.

5. **బ్రహ్మచారి మురళి గారు**, సికింద్రాబాద్

6. **భోగ సత్యనారాయణ గారు**, ఆర్యసమాజము, ఇందూరు ౫౦౩౦౦౧

7. **శ్రీ విద్యా బుక్ సిండికేట్**, కోఠి (హరిద్వార్ హోటల్ బిల్డింగ్)
హైద్రాబాద్-27. ఫోన్ : 4608795.

8. **శ్రీ విద్యా బుక్ డిస్ట్రిబ్యూటర్స్**, కుద్బిగూడ, హైద్రాబాద్.
ఫోన్: 4651824

★★★

## విషయ సూచిక



### శుద్ధ హనుమచ్చరితము
### ప్రథమ ఖండము

## శుద్ధ హనుమచ్చరితము
## ద్వితీయ ఖండము

## ఉపసంహారము



★★★

ఓ3మ్

# శుభ సందేశము

ఒకప్పుడు ఆర్యులు ఆధ్యాత్మిక క్షేత్రములో మోక్షమును పొందునంతటి యోగ్యతను సంపాదించినారు. భౌతిక క్షేత్రములో సమస్త ప్రపంచమున కోటాను కోట్ల సంవత్సరాల వరకు నిష్కంటక చక్రవర్తి రాజ్యమేలినారు. వారి జీవిత మెంత పవిత్రమో భౌతిక విజ్ఞానములో వారి యున్నతియు అంతే. జ్ఞాన విజ్ఞానములో, కళా కౌశలములో, ధన ధాన్యములలో, సదాచారములో, శరీర సౌందర్యములో, బుద్ధి బలములో, కవిత్వములో, శరీర విజ్ఞానములో, మనో విజ్ఞానములో, ఆత్మ విజ్ఞానములో, నీతి శాస్త్రములలో, శౌర్యములో, పరాక్రమములో, దూరదృష్టిలో, తర్కములో వారికి సాటి వారే. కేవలము వారే విజ్ఞానవంతులు కారు. వారి యింటి పంజరములో నుండు చిలుకలు కూడ ''ప్రపంచము నిత్యమా, అనిత్యమా'' అని శాస్త్రార్థము చేసెడివి. ఇది కథ కాదు, కల కాదు, కల్ల కాదు. నిజము నిజము. ఈ దేశీయులే కాదు, ఈ విషయములతో గ్రంథములు వ్రాసి ప్రపంచమునకు చాటినది విదేశీయులే సుమా! (ఈ విషయమును వివరముగా తెలిసికొన గోరినచో చంద్ర నగరములో న్యాయాధీశునిగా పనిచేసిన ఫ్రెంచి దేశ వాసి 'శ్రీ జైకాలియట్' రచించిన ''బైబిల్ ఇన్ ఇండియా'' అను గ్రంథమును చదువ గలరు. (వే. మీమాంసక్))

అట్టి మనము క్రమముగా దిగజారుచు పర్వత శిఖరముపై నుండి జారి పడిన రాళ్ల వలె ముక్కలు చెక్కలై, నష్ట భ్రష్టమై పోయినాము. ఆ అవకాశమును ఆంగ్లేయులు చేజిక్కించుకొన్నారు. మనలను మూర్ఖులుగా చిత్రించడమే కాదు, మనలను బుజ్జగించి మనము వలస వచ్చిన వారమని కూడా మనచే ప్రచారము చేయించినారు. ఇప్పటికి మనము అజ్ఞానపు మత్తులో అదే సత్యమని నమ్ముచున్నాము. ఆలాపించుచున్నాము. మన ప్రభుత్వము దానికి దాసోహమై పోయినది.

దివ్య ద్రష్టయైన మహర్షి దయానందుడు దేశకాల పరిస్థితిని దాటి భూత కాలపు పొరలలో కప్పబడియున్న సత్యమును వెలికి దీసి చాటినాడు. దాని ప్రభా

మము వలన ఇప్పుడు ఈ సత్యము స్వదేశీయులకు కొందరికి తెలిసి పోయినది. ఆర్యా వర్తీయులు ఇప్పుడు తమ గౌరవమును గ్రహించు చున్నారు. ప్రచారము చేయుచున్నారు. ఇప్పుడిది విదేశీ బుద్ధిమంతుల వరకు వ్యాపించు చున్నది.

కొన్ని దినముల క్రితము వ్యోమ గాముల ద్వారా కొన్ని చిత్రములు తీయబడినవి. వాటిని పరిశీలించగా భారతదేశమునుండి లంకకు ఒకప్పుడు వారధి నిర్మించ బడినటుల దాని అవశేషములు కనబడుచున్నవి. ఇది ఎవరో తెలిపిన విషయము కాదు. వ్యోమగాములు తీసిన చిత్రాల ద్వారా బయట పడిన సత్యము.

ఆర్యులు రాముని చరిత్రను నమ్మ్మదురు. వారు నమ్మ్మచున్నది 'కట్టుకథ' అని చెప్పబడుచున్నది. కాని అది చరిత్ర సత్యమే అని దీని వలన ఋజువైనది. దీనికి మన రామాయణముతో సంబంధములేదు. అవసరము లేదు. మనకిది ఒక ప్రకాశ పుంజము. దీనిద్వారా 'రామాయణము' సత్యమనియే కాదు, ప్రాచీన ఆర్య చరిత్ర నిరాధారము కాదు. కట్టుకథకాదు అని తెలియుచున్నది. 'రాముడు కాల్పనిక పురుషుడు' అను వారికి ఇదొక ఎదురు ప్రశ్న.

శ్రీ కృష్ణుని ఒక మహాపురుషునిగా నమ్మని వారిపై మహాభారత యుద్ధ మును 'కథ' అని నమ్మువారిపై ఇప్పుడిప్పుడే వజ్ర పాతము జరిగినది. ద్వారకలో సముద్రపుటొడ్డున నీటిలో ఒక నగరము మునిగి యున్నటుల తెలిసినది. దానిలో రెండు భవనము లున్నటుల, అవి కనీసము 3,500 (మూడు వేల ఐదువందల) సంవత్సరముల క్రితపు కట్టడములని కూడ తెలిసినది.

రాముడు దాదాపు తొమ్మిది లక్షల సంవత్సరముల క్రితము తన పావన జీవనముతో ఈ ఆర్యావర్తమును పావనము చేసినాడని ఒప్పుకొనవలసి వచ్చు చున్నది. ఆ మహాపురుషుని దివ్య జీవితములో ఒక అంశము హనుమంతుడు.

హనుమంతుడొక విభూతి. హనుమంతుని వంటి బ్రహ్మచారులు, వీరులు, విద్వాంసులు, త్యాగులు ఒక దేశానికి, ఒక సమయానికే కాదు, సమస్త ప్రపంచానికి, యుగ యుగాలకు అలంకారము. ఆయన తన పావన జీవనముతో ఈ దేశమును పావనము చేసినాడు, చేయుచున్నాడు. ఆయన పరిశుద్ధ చరిత్ర

భూమి పైన ఉండు నంత వరకు మానవులకు అది తన పావన సందేశమును ఇచ్చుచునే యుండ గలదు. హనుమంతుడు బ్రహ్మ చర్యమునకు అంకితుడు. బ్రహ్మచర్యములో ఆయనకు మించిన ఉదాహరణము కనబడదు. పితృభక్తిలో శ్రవణ కుమారుడు, పితృ ఆజ్ఞను పాలించుటలో శ్రీరాముడు, సత్యపాలనలో హరిశ్చంద్రుడు సాటిలేని వారు. అదే విధముగా బ్రహ్మచర్యములో హనుమంతుడు సాటిలేనివాడు. ఆయన కేవలము బ్రహ్మచారియే కాదు, మహర్షి వాల్మీకి మాటలలో 'వేద విద్వాంసుడు, జితేంద్రియుడు. దీనిని బట్టి చూడ బహుశః హనుమంతుని వంటి వాగ్విద్వాంసుడు ప్రపంచములో ఇప్పుడు లేడేమో! ఆయన చాలాకాలము వరకు శ్రీరామునితో మాట్లాడి నాడు. ఆయన వేద విజ్ఞానము, భాషా జ్ఞానము, వ్యాకరణ విజ్ఞానము, భాషా మాధుర్యము, వాక్పాటవము, భావ వ్యక్తీకరణ, వర్ణోచ్చారణాపద్ధతి మహా పండితులకు సహితము విస్మయ కారకము. ఆయన తన జీవితమును ఎన్ని విద్యలతో, ఎన్ని సద్గుణాలతో అలంకరించుకొన్నాడో దాని కొరకు ఎంత సాధన చేసినాడో మనకు ఊహాతీతము.

హనుమంతుని జీవితము సకల మానవులకు ఆదర్శము. అనుకరణీయము, ప్రేరణ దాయకము, దీనిని వాల్మీకి రామాయణములో మనము బాగుగా చూడవచ్చును. హనుమంతుని జీవితము ప్రతి మానవుడు చదువ దగినది. ప్రతి విద్యార్థి తెలిసికొన దగినది. పాఠ్య క్రమములో చేర్చ దగినది.

ఇప్పుడు హనుమంతుని జీవితమును మనము మరచి పోయినాము. మనము తెలిసికొన్న హనుమంతునికి, వాల్మీకి వర్ణించిన హనుమంతునికి చాల భేదము కన బడును. మనము హనుమంతుని గాలికి పుట్టినాడని, కోతియని అనుకొన్నాము. ఇది మన సర్వ విధ పతనానికి కారణము. మన జాతి పతనానికి కారణము. హనుమంతుని యెడ మనము చేసిన అన్యాయము కృతఘ్నతయే. రామాయణములో వాల్మీకి హనుమంతుని కోతి యని వ్రాసినటుల ఒక్క శబ్దము కూడా లేదు.

రామాయణములో అక్కడక్కడ వ్రాయబడి వున్న హనుమంతుని చరిత్ర

ఆర్య భాషలో ఒకే చోట వ్రాయబడినది. అది తెలుగులో లేదు. శ్రీ లోక మల్లారి గారు దానిని తెలుగులోనికి అనువదించినారు. నిష్ఠతో శ్రమించి ఈ పవిత్ర ఘన కార్యమును దాదాపు తొంబయిఏండ్ల వయస్సులో సాధించడము ఉత్సాహము, సాహసముతో కూడిన కార్యము. ఇప్పటికిని వారు వైదిక ధర్మ రక్షణకు కృషి చేయుచునే ఉండడము వైదిక ధర్మాభిమానులందరికి ప్రేరణా దాయకము. ఇప్పటికే వీరు ౧౦౦ (వంద) పుస్తకములకు పైగా రచించి శ్రీ కోటికెలక్ష్మయ్య గారి సహృదయ వైదిక సాహిత్య ప్రచురణల ద్వారా ప్రకాశింప జేసినారు. ఇంకను అనేక గ్రంథములను అనువదించి పాఠకులకు అందజేయ నున్నారు. ప్రత్యేకముగా యువకులకు తెలుగులో హనుమంతుని వాస్తవిక చరిత్ర లేకపోవుట ఒక కొరత. దానిని మల్లారి గారు పూర్తి చేసినారు. అందుకు ఆంధ్ర లోకము వారికి ఋణపడి యుండ గలదు. హనుమంతుని నిజమైన ఈ చరిత్రను చదివి పాఠకులు తమ జీవితమును సమున్నతము చేసికొన గలరని ఆశిస్తున్నాను. ఈ విధముగా ఈ దేశము ప్రాచీన ఆచార వైభవమును సంపాదించగలదు. అదియే మానవ జీవనము యొక్క చరమ లక్ష్య ప్రాప్తి కాగలదు. భగవంతుడు మల్లారి గారికి దీర్ఘాయుష్యము, ఉత్తమ ఆరోగ్యము, జ్ఞానము, ఆనందము నొసగి వీరి ద్వారా వైదిక ధర్మ ప్రచారము చేయించు చుండ వలయునని కోరుచున్నాను. ధర్మ ప్రియులు ఆంజనేయ భక్తులు ఈ గ్రంథమును తప్పక చదువగలరు.

శ్రీలోకా మల్లారి గారు తెలుగులోనికి మార్చి వ్రాసిన **''వేదముల యధార్థ స్వరూపము''** ముద్రితమై అమ్మకమునకు సిద్ధముగా యున్నది. అధర్వణ వేదము ముద్రించబడినది. మిగతా మూడు వేదములు కూడ తొందరగా ముద్రితమగు చున్నవి.

ఇట్లు
ఆచార్య వేదవ్రత మీమాంసక్



ఓ౩మ్

# ప్రస్తావన

ఒక దేశౌన్నత్యమునకు గౌరవ పూర్ణమును, మహిమాన్వితమునగు దాని ఇతిహాసమే యాధారము. ఈ సత్యమును గ్రహించియే చతురులగు ఆంగ్లేయులు యోజనా బద్ధముగా మనదేశము యొక్క మహత్వ పూర్ణమగు సాహిత్యమును నష్ట పరచి మలిన మొనర్చినారు.

ఇంగ్లీషు వారి యీ నికృష్ట కుటిలనీతిని గనిపెట్టి ఆర్య సమాజ సంస్థాపకులు, క్రాంతికారులు, వేదోద్ధారకులునగు మహర్షి దయానంద సరస్వతి గారు వారి యీ దుష్క్రియలను విఫలమొనర్చుటకై భారత ప్రజలను సత్యచరిత్రాజ్ఞానోన్ముఖుల నొనర్చినారు. వారి యీ మహోపకార మెంతయో భారత జాతిపై గలదు.

స్వతంత్ర భారతమున సత్యమగు ఐతిహాసిక పరిశోధన, దాని పరిరక్షణ ఆవశ్యకత ఎంతయో గలదు. కాని మన దేశ పాలకులు, నాయకులు ఈ విషయము నందేమాత్రమును శ్రద్ధ గైకొనకుండుటయే గాక ఉపేక్ష వహించి యుండుట మిగుల దుఃఖ కరము. దేశము స్వాతంత్ర్యము నొందిన ఏబది సంవత్సరములు దాటినను మన పిల్లలు వికృత పరచబడిన చరిత్రనే పాఠశాల లందు చదువుచున్నారు. అనగా:

౧. మనుష్యుల పూర్వీకులు వానరులై యుండిరి. వారితోకలు క్రమముగా అరిగిపోయి ఇప్పటి మానవులుగాయైనారు.

౨. ఆర్యులు భారతదేశమునకు మూల పురుషులు గారు.

౩. భారత దేశ ప్రాచీన సంస్కృతి ద్రావిడ సంస్కృతియే.

౪. ఆర్యులు అగ్ని, జలము, వృక్షములు మొదలగు జడపదార్థోపాసకులై యుండిరి.

౫. ఆర్యులు మద్యమాంసాదులను సేవించు చుండిరి.

౬. భారతదేశమునందలి ఆదిమ వాసులు అసభ్యులు, మరియు ఆటవికులునై యుండిరి మున్నగున్నవి.

మనము కొంత గంభీరముగా ఆలోచించినచో మనమిప్పుడు జూచుచున్న రాష్ట్రీయ సమస్యలకు మూలము కలుషిత మొనర్చబడిన మన యీ ఇతిహాసమే కారణమని తెలియును. ఇంగ్లీషువారు తమ 'కుటిల నీతి, విడదీసి పాలించు' మను దాని ఆధారముగా మన చరిత్రను భ్రష్ట మొనర్చుటకు నడిపిన కుచక్రము నందు మన మిప్పటికిని పరిభ్రమణ మొనర్చు చుండుట మహా దుఃఖకరమగు విషయము.

ఒకవైపు మన యీ చరిత్రను శ్వేతాంగులగు ఇంగ్లీషు పాలకులు భ్రష్ట మొనర్చగా మరోవైపు పౌరాణిక అంధకార యుగమున పౌరాణికులు మన చారిత్రక మహాపురుషులకు 'అవతారములు' అను పచ్చడములను గప్పి వానిని కావ్యగతాలంకారిక మడతలందు జుట్టి రామాయణము, మహాభారతము వంటి ఇతిహాస గ్రంథములను కేవలము పూజించ దగిన వస్తువులుగా నెంచు నట్టి పాపము నందు ముంచి వేసినారు. అంతటి తోనే వదలలేదు. ఈ యితిహాస గ్రంథము లందు చమత్కార వాదముల యాధారముగా యథేచ్ఛగా కల్తీ యొనర్చుట యందును మన మధ్య కాలీన ధర్మ ధ్వజులు సంకోచించ లేదు. ఈ మహా వినాశకర పరిణామములను గూర్చిన వాదనను ఇసుమంతయైనను ఆలోచించకుండుట మన దురదృష్టమే గదా !

సమస్త జాతులందును వీరపూజ Heroworship భావన గాన వచ్చును. జాత్యుత్థానము, మరియు రాష్ట్రోన్నతికిది అత్యంతావశ్యకమే. కాని యిది కూడా అతి వైపునకు కొనిపోబడినచో ఆ వీర పూజ, వారి చరిత్ర, అనుసరించ దగిన వారి పవిత్ర జీవనము నుండి ప్రేరణను పొందుటకు మారుగా వారి చిత్రములకు పూజ లొనర్చుటతోనే సరిపోవుచున్నది. ఆ చిత్రములైనను కావ్య గతాలంకారిక వర్ణనల సత్య సంఘటనల రూపమున చిత్రిత మొనర్చబడి 'అంధశ్రద్ధ' యను ఆచారమున బడిపోవునపుడు జాతి జీవనము ప్రకాశము నొందవలసిన

స్థానమున గాడాంధకారమున మునిగి పోవును.

'లాంగ్‌పేలో' యను నొక ప్రసిద్ధ ఇంగ్లీషు కవి తన 'సం ఆఫ్‌లైఫ్' అను గ్రంథము నందిట్లు వ్రాసినారు.

Lives of Great men all remind us we can make our lives sublime. And departing leave behind us, foot prints on the sands of times".

అనగా మహాపురుషుల జీవనము మనకు ప్రేరణ నిచ్చునదిగా నుండును. దాని వల్ల మనము మన జీవితమును వారి వలెనే ఉదాత్తము, మరియు ఆదర్శ వంతముగ నొనర్చు కొనవచ్చును. ప్రపంచ మార్గమున పయనించు కాలమను ఇసుక పై మన పద చిహ్నములను రాబోవు తరమునకు మార్గదర్శనమునకై విడువ వచ్చును.

మహా పురుషుల జీవనము జ్యోతి స్తంభము వంటి కార్యమొనర్చును. యుగ యుగాంతరముల వరకు మన రాబోవు తరములు వారి ప్రకాశ వంత మగు ప్రేరణను గ్రహించు చుండును. ఈ జ్యోతి స్తంభములను 'అతిశ్రద్ధా' (అంధ శ్రద్ధా) వశమున ఈశ్వరునిగా నొనర్చు ప్రయత్నము జేసి వానిని అవ తారములని చెప్పుచు అలంకారములు, మరియు చమత్కారములతో నింపుటకు ప్రయత్నించినపుడు చరిత్ర పూజ స్థానమున చిత్ర పూజల యాచారము పడి పోవును. తరువాత ఘోర పతనమున కొక క్రొత్త మార్గము తెరువబడును.

ఆ కాలమున మన జాతి శ్రద్ధ, సత్యములపై ఆధారితమై యుండి ఎంత శుభ దాయకమై యుండెడిదో ఇప్పుడు అంధశ్రద్ధ అంతయే మహా వినాశ కారకమై యున్నదను విషయమును మనము విస్మరించుచున్నాము. భగవానుడగు శ్రీరాముడు, యోగేశ్వరుడగు శ్రీ కృష్ణుడు, మహావీరుడగు హనుమంతుడు మొదలగు మహాపురుషులను ఈశ్వరులనుగా నొనర్చి వారి యనుగ్రహమును సంపాదించుటకై వారి జీవితములకు అనేకములగు బుద్ధి విరుద్ధములు, మరియు అవైజ్ఞానికములు, చమత్కార పూర్ణములు నగు కథలను గల్పించి మన పూర్వపు

రుషుల పవిత్ర జీవిత చరిత్రలను నష్టమొనర్చునట్టి పాపములను జేయుట వల్ల ఆ దివ్యపురుషులకు ఘోరమగు అన్యాయమే జరిగినది. ఇంతేగాక మన మహో వినాశమునకు మార్గము గూడ తెరువబడినది. కాకున్నచో రామాయణము, మహాభారతము వంటి ఐతిహాసిక గ్రంథములు గల ఈ దేశము రాముడు, కృష్ణుడు హనుమంతుని వంటి ఆదర్శ దివ్య పురుషులు గల దేశము, జాతి, ఈ విధ ముగా అనేక శతాబ్దముల పాటు విదేశీయులకు పాదాక్రాంతమై యుండుట, నేడు కూడా కేవలము నామావశిష్టమగు స్వాతంత్ర్యమును పొంది బౌద్ధిక భావ దాస్యమున మునిగి యుండుట ఎంత దుఃఖ కరమో ఆలోచించు చున్నామా ?

ఈ పౌరాణిక మహాశయులు మన మహా పురుషులనెంత వికృతముగా చిత్రించు చున్నారో చూడుడు. **అఖండ బ్రహ్మచర్య వ్రతధారి, మూర్తి మంతు డగు త్యాగ తపోనిధి, చతుర్వేద ప్రకాండ పండితుడు, అద్వితీయ నీతిమంతుడు, అపూర్వ శౌర్య సాహసముల ఖని, అగస్త్య మహర్షుల ఆదర్శ శిష్యుడు, శ్రీరామ చంద్రుల ఆదర్శ మిత్రుడు, సేవకుడు, అంజనా పవనుల పుత్రుడు, రామరాజ్య సంస్థాపకుడు, అమర వైదిక సంస్కృతి కేతనావాహకుడు, వజ్రాంగుడగు హను మంతుని వంటి రాష్ట్ర పురుషుని కోతిగా చిత్రించి చూపుట, ఈ భూగోళము కన్న .. లక్షల రెట్లు పెద్ద దగు సూర్య గోళమును పసితనముననే మ్రింగి వేసి నాడను అభూత కల్పనల నాతని మహత్త్వ జీవనమునకు జోడించి ఆ మహా పురుషుని చరిత్రనే సందిగ్ధముగా జేసి వేసినారు. ఇది మహా ఘోరమగు దేశ ద్రోహము గాక మరేమగును?**

మహావీరులు, మానవ కుల భూషణులు, క్షాత్ర ధర్మమూర్తులు, రాష్ట్ర **పురుషులునైన శ్రీరాముని, శ్రీకృష్ణుని, హనుమంతుని అవతార పురుషులుగా చిత్రించుట దేశద్రోహమే గాక ఇది సిద్ధాంతతః తప్పు. వేద విరుద్ధము, బుద్ధికి, విజ్ఞానమునకు సృష్టి నియమమునకు, తర్కమునకు విరుద్ధము. ఇంతేగాక ఇట్టి మహానీయులగు మన పూర్వజులను కాల్పనికులు, అనైతిహాసికులుగా జూపు టకు జేసిన యీ ప్రయత్నముల జాడగా చేజేతులా మనమే మన దేశము యొక్క**

**ఉజ్వల చరిత్రను తుడిచి వేయు ఘోర పాపమున కొడిగట్టినట్లు తోచును.**

మనము మనకు తర్కము, బుద్ధి మాంద్యముచే మన ఐతిహాసిక మహా ఆదర్శములను నష్టపరచు కొనుచున్నాము. తత్ఫలితముగా మన గృహములందు విదేశ ధర్మములు వృద్ధి పొందు చున్నవి. మమ్మీ, డాడీ స్వరములు మనకు విని పించు చున్నవి. మన పిల్లలకు మన మాతృ భాషయందు పత్ర వ్యవహారమొనర్చుట లజ్జా జనకముగా నున్నది. మన ఆహ్వాన పత్రికలు ఇంగ్లీషులో ముద్రించ బడు చున్నవి. గోమాంసాదులను దినుటకు ఉదాహరణము లీయ బడుచున్నవి. యోజనా బద్ధముగా 'విదేశీయ సభ్యత' లనబడు దాడులు మన సంస్కృతిపై జరుగుచున్నవి. ఈ యాత్మ పతనమున కాశ్రయ మిచ్చుట రాష్ట్ర ద్రోహము కాదా !

దేశముపై దురాక్రమణ మొనర్చు వారికి మార్గమును ప్రశస్త మొనర్చు నట్టి కమ్యూనిస్టు విదేశీ ఈసాయీ ఫాదరీ, ముస్లిం లీగ్ తత్త్వములు పెరుగుచున్నవి. సావధానులగుడు. శ్రీరామ, శ్రీకృష్ణ, హనుమంతుల జయ ఘోషయొనర్చు సోదరులారా, మీరు వైదిక సాహిత్యము నధ్యయన మొనర్చుచు సాధ్యమైనంత వరకు మానవ సేవ, మరియు దేశ సేవ నొనర్చుచుండుడు. శ్రీరామ, హను మాన్ భక్తులారా ! దేశమును విస్మరించకుడు. రాష్ట్రీయత, సంస్కృతి యను నవి అభిన్నమైనవి. ధర్మము, రాజనీతి వేరుగాదు. సదాచారమే సర్వోత్తమ మగు పూజ. స్వధర్మము, రాష్ట్ర ధర్మముల సమన్వయమే వర్ణాశ్రమ, మరియు వైదిక ధర్మము. భోగ త్యాగముల, ఇహపరలోకముల సమన్వయమే వ్యక్తి, మరియు రాష్ట్ర జీవన కల్యాణ తీర్థములు.

సమయము మిమ్మాహ్వానించుచున్నది. హనుమంతుని భక్తులెల్లరును హనుమంతుని వలెనే "**ఓం రాష్ట్రాయ స్వాహా' ఇదం రాష్ట్రాయ ఇదం నమమ**" అను మంత్రము ద్వారా వ్యష్టిని సమష్టి చరణములందర్పించి నిజమైన యాజ్ఞి కులు గావలెను. ఆత్మ ద్రోహ జన్యమగు అశాంతి కబంధ హస్తములందు జిక్కు బడుచున్న ఈ విశ్వమునకు వైదిక సంస్కృతి యను పవిత్ర పీయూషమును

ద్రాగించవలెను. మరల నొకసారి ధరామండలమంతట రాముని, హనుమంతుని జయ జయ నినాదములు దశ దిశలందు మార్మ్రోగవలెను. ఇదియే స్వామి దయా నందుల ప్రగాఢ వాంఛ.

ఈ వాంఛా పూర్తికి ఐతిహాసిక శుద్ధి యవసరము. సాధ్యమైనంత శీఘ్రముగ మన చారిత్రక మహాపురుషుల యథార్థ జీవన చరిత్రలను ప్రవేశ పెట్ట వలెను. ఇందుకై మేము కొన్ని శుద్ధ ధార్మిక, ఐతిహాసిక గ్రంథములను ప్రచురణ మొనర్చి ఒక ఉత్తమ కార్యమును నిర్వహించి యున్నాము. ఈ శుద్ధ సాహిత్య మార్గము నందు ''శుద్ధ రామాయణము, శుద్ధ మహాభారతము, శుద్ధ కృష్ణా యణము, శుద్ధ గీత, శుద్ధ మనుస్మృతి, శుద్ధ తులసీ రామాయణము (మానస పీయూషము) వీని తరువాత ఈ శుద్ధ హనుమచ్చరితము ఏడవ పుష్పమై యున్నది. ఇంతవరకు మాచే సంపాదితములు, ప్రకటితములునగు నీ యారు పుష్పములు త్వరత్వరగా అనేక తడవలు ముద్రితమగుట జూడ ప్రజలకు తమ జీవనము, మరియు రాష్ట్ర పునర్నిర్మాణము లందు సత్య పథగాములగుట కెంత గాఢ వాంఛ గలదో తెలియుచున్నది. (పై ఆరు పుస్తకములును హిందీ భాష యందే యున్నవి).

మహావీరుడగు హనుమంతుని ఈ శుద్ధ ఐతిహాసిక యితివృత్తము, దేశోన్నతి కొక దివ్య సూత్రమై సత్యరూపమున ప్రకాశమునకు వచ్చియున్న దన వచ్చును. ఎట్లన **''వయం రాష్ట్రే జాగృయామ పురోహితాః''** (వేదము).

భారత భాగ్య నిర్మాణమున మన పురోహితులు, ఉపదేశకులు, వైజ్ఞా నికులు, చిత్రకారులు, కళాకారులు, ఆచార్యులు, కవులు, అధ్యాపకులు, ప్రాధ్యా పకులు మున్నగు వారు అత్యధిక మహత్త్వ పూర్ణమగు భూమికను నిర్వహింప గలుగుదురు. మన విద్యాలయములే మనరాష్ట్రీయ మందిరములు, శ్రేష్ఠ పూజా గృహములు. రాబోవు క్రొత్త తరము విద్యార్థుల చరిత్ర నిర్మాణమునకు అగస్త్య, వశిష్ఠ, విశ్వామిత్ర మహర్షుల వంటి దీక్షా భావముతో మన ఆచార్యులు, అధ్యా పకులు విద్యాలయ తరగతులందు ప్రవేశింప వలెను.

ఒకప్పుడు వానర రాష్ట్రమున స్వరాజ్యముండెను. కాని సురాజ్యము లేకుండెను. రాక్షస సభ్యత చే గలిగిన బౌద్ధిక దాసత్వమున రాజ్యము చిక్కు కొని యుండెను. ఋషులు, మునులు, కష్టముల ననుభవించు చుండిరి. అపూజ్యులు పూజింప బడుచుండిరి. వైదిక సంస్కృతి క్షీణించ సాగినది. అట్టి సమయమున పతనమగుచున్న రాష్ట్ర సంస్కృతి నుద్ధరించుటకు అగస్త్య మహర్షి దీక్ష గైకొనినాడు. మహావీరుడగు హనుమంతుడీ క్రొత్త తరమునకు జెందిన ప్రతినిధియే. ఇప్పుడు కూడ మన దేశమున స్వరాజ్యమున్నది కాని సురాజ్య మేది ? బౌద్ధిక దాసత్వమున దేశము బలహీన మగుచున్నది. దీని నుద్ధరించు టకు అగస్త్య మహర్షి, వజ్రాంగ హనుమంతుని వంటి వారి అవసరమున్నది. మళ్లీ ఒకసారి జగమంతా ఏకస్వరమున ''ఆ వృద్ధ భారతదేశమే మా గురువు'' అని యెలుగెత్తి చాట వలసి యున్నది.

## ఆశ్రయము, కృతజ్ఞత

ఈ శుద్ధ హనుమచ్చరితము ప్రథమ ఖండమున మేము ఉపన్యాస శైలిని స్వీకరించినాము. వాల్మీకి మహర్షి విరచిత రామాయణ మహా కావ్యము నుండి లభించిన సూత్రముల యాధారముపైననే దీని నిర్మాణము జరిగినది. ఐనను దీని యందు ఐతిహాసిక సత్యముల సంపుష్ట భావనయే ప్రముఖమై యున్నది. వాల్మీకి మహర్షి దృష్టి యందు ఉదయోన్ముఖ రాష్ట్ర ముండెను. ప్రజలందు రాష్ట్ర నిర్మాణోద్దేశమే ఆయన ధ్యేయమై యుండెను. ఆ మహర్షి యొక్క భూమి కనే గైకొని ఆతని దృష్టి కోణమునే ప్రజల సమక్షము నందుంచుచున్నాము. ఇక ద్వితీయ ఖండమున ఆధ్యాత్మ రామాయణము, రామచరిత మానసమును గూడ ''హంసక్షీర' న్యాయమున గైకొనినాము. శ్రీ సుఖరాంసింహ చౌహాన్ గారి రచిత 'హనుమాన్ చరిత్ర, శ్రీ పం. దుర్గా ప్రసాద్‌గారి రచిత ''హనుమంతుడు కోతియా? మనుష్యుడా?'' రామాయణ పాత్రలు, మరియు శ్రీ సాత్వలేకర్ గారి 'రామాయణము' ను గూడ యథోచితముగా ఆశ్రయించినాము. ఈ గ్రంథ

రచయిత లెల్లరకు కృతజ్ఞత లర్పించుకొను చున్నాము. ఓంకార నాముడగు పర
మేశ్వరునకు అత్యధిక కృతజ్ఞులమై యున్నాము. ఆతని కృపా ప్రసాదమే మా క్రియా
కలాపము లన్నింటికిని చిహ్నము. ఓమ్, శమ్.

మానవతా వినమ్ర సేవకులు
ఈశ్వరీ ప్రసాద్ 'ప్రేమ్' మరియు,
సిద్ధాన్తా చార్య లోకామల్లరి
ఆర్యనగర్ ఇందూరు -౫౦౩౦౦౧

★★★

# ఓ౩మ్

# మనం చరితార్థుల మవుదాం

**డా॥ మసన చెన్నప్ప**
ఎం.ఏ., ఎం.ఫిల్., పి.హెచ్.డి.
అసోసియేట్ ప్రొఫెసర్, తెలుగుశాఖ,
ఉస్మానియా విశ్వవిద్యాలయం

త్రాగే నీటిలో ఫ్లోరిన్, పీల్చే గాలిలో బొగ్గు పులుసు వాయువు, సాహి
త్యంలో అనారోగ్యకరమైన విషయాలు క్షమించరానివి. చారిత్రక గ్రంథాలే ప్రక్షి
ప్తాలకు లోనై కేవలం కట్టు కథలుగా మారినప్పుడు ఇక చెప్పవలసిన పనేముంది?
ఈ రోజు మనం ఏ వాఙ్మయ ప్రక్రియను స్పృశించినా ఆకర్షణీయమైన అబద్ధా
లతో గుబాళిస్తుందే తప్ప సత్య సమాచారాన్ని అందించడం లేదు. ''మాటకు
ప్రాణం సత్యం'' అని మన పెద్దలు చెప్పిన మాటలను ఏ రచయితా పట్టించు
కోవడం లేదు. ఇష్టం వచ్చినట్లు వ్రాసి ఇది పాఠకుల ఇష్టం అని ఆ తప్పును ఇత
రుల మీద తోస్తున్నారు. చారిత్రక గ్రంథాలైన రామాయణ భారతాలే ప్రక్షిప్తాలకు
లోనై సత్యాన్ని తేటపరచని స్థితిలో ఉన్నప్పుడు అర్వాచీన రచనల గురించి ఇంక
చెప్పవలసిన పనే లేదు.

మన అదృష్టవశాత్తు వేదాలు ప్రక్షిప్తాలకు లోను కాలేదు. బహుశా ఆ

సాహసం మానవుడు చేయలేక పోయాడు. కాని వేదాంగాలను చదవకుండానే, వేదోపాంగాలను చూడకుండానే భాష్యాలు వ్రాస్తున్నారు. విపరీతమైన వ్యాఖ్యా న్నాలతో వేదాల్లోని యథార్థస్వరూపాన్ని తెలియనీయకుండా చేస్తున్నారు.

ఒకవైపు వేదాల యథార్థ స్వరూపాన్ని తెలుసు కోవడంతో పాటు మరో వైపు మన పూర్వుల చరిత్రను యథాతథంగా తెలుసుకోవలసిన బాధ్యత బుద్ధిమంతులైన వారి మీద ఉంది.

''**శుద్ధ హనుమచ్చరిత్రం**'' అధ్యయనం చేసినప్పుడు ఇంత వరకు మనం సాహిత్యం ద్వారా పొందవలసిన దాన్ని పొందలేక పోయామే అని బాధ కలుగుతుంది. ఆంజనేయస్వామి భక్తులను అడిగి చూడండి - వారి దృష్టితో హనుమంతుడు ఒక కోతి అంతే. కాని జాతికి స్ఫూర్తిని ప్రసాదించడంలో రాముని పాత్ర ఎంతో హనుమంతుని పాత్ర కూడా అంతే. మనవాళ్ళు వీరాధివీరుడు, ధర్మ ప్రభువైన శ్రీరాముణ్ణి దేవుణ్ణి చేశారు కాని, వేదవేదాంగవేత్త, బ్రహ్మచారి, మృదుభాషి ఐన హనుమంతుణ్ణి కోతిని చేశారు. ఇదెంత అసంగతం! ఉన్నది ఉన్నట్లు తెలుసుకొనే అలవాటు మన దేశవాసులకు తక్కువేమో అనిపిస్తుంది. తెలుగు సాహిత్యం ఉత్తమ మానవుని నిర్మాణానికి కృషి చేయవలసిన సమయం ఆసన్నమైంది. రచయితలు, కవులు భాషను, సంస్కృతిని, చరిత్రను పరిరక్షించే దిశలో రచనలు చేపట్టవలసిన అవసరం ఉంది. అందుకు అవసరమైతే తమ దృష్టిని ఇతర భాషలలో ఉన్న సాహిత్యం వైపు కూడా సారించాలి. అది తప్పదు.

శతాధిక గ్రంథ కర్త శ్రీ లోకామలహరిగారు ఈ ''**శుద్ధ హనుమచ్చరితం**'' ద్వారా మనకు అపారమైన చారిత్రక సంపద ఉన్నదని గుర్తుకు తెస్తున్నారు. హిందీలో ఈశ్వరీప్రసాద్ రచించిన గ్రంథానికి ఇది తెలుగు సేత.

శ్రీరాముడు తొమ్మిది లక్షల సంవత్సరాల క్రితం ఆర్యావర్తాన్ని పాలనం చేసిన మహాపురుషుడు. ఆ మహనీయుని దివ్య జీవితంలో హనుమంతుడు ఒక అంశంగా నిలిచాడు. సత్య పాలనలో హరిశ్చంద్రుణ్ణి, పితృభక్తిలో శ్రవణకుమారుణ్ణి పితృవాక్య పరిపాలనలో శ్రీరాముణ్ణి గుర్తు పెట్టుకొన్నట్లే బ్రహ్మచర్య దీక్షలో హనుమంతుణ్ణి గుర్తు పెట్టుకోవాలి. హనుమంతుడు కేవలం బ్రహ్మచారికాదు. అతడు రాష్ట్ర భక్తికి ప్రతీక. ఉత్సాహానికి సంకేతం. కర్తవ్యపాలనకు

మారుపేరు. మానవత్వానికి గుర్తు.

రాష్ట్ర నిర్మాణోద్దేశం కల్గిన వారు హనుమంతుని చరిత్రను తప్పక తెలుసుకొని స్ఫూర్తిని పొందవలసింది. విశ్వామిత్రుడు శ్రీరాముణ్ణి మహావీరునిగా తీర్చి దిద్దినట్లే అగస్త్యుడు హనుమంతుణ్ణి వీరాధివీరునిగా తీర్చిదిద్దినాడు. హనుమంతుడు ఆశ్రమంలో శిక్షణ పొందాడు. అగ్నికి వాయువు తోడైనట్లు ఇద్దరు వీరులు కలిసినారు కనుకనే రావణుణ్ణి, అతని సైన్యాన్ని మట్టుపెట్టగలిగారు. లోకరక్షణార్థమై ఋషులు చేసింది ఎంతో ఉంది. వారి ఆజ్ఞను శిరసావహించిన చక్రవర్తులే మహత్కార్యాలు చేసి కీర్తిమంతులైనారు. రామాయణం ద్వారా మానవ సంస్కృతికి ఋషులు చేసిన తపస్సుతో పాటు రామాదులు ధర్మరక్షణ విషయంలో చూపిన శ్రద్ధాభక్తులు స్పష్టమవుతాయి. రామాయణం అనే రత్నహారానికి మణి హనుమంతుడు. అతడు క్షత్రియ వంశ సంజాతుడు. క్షత్రియోచితమైన విద్యలతోపాటు వేద విద్యలను అభ్యసించిన ధీశాలి.

మహావీరుడు, ఆదర్శమానవుడు, అఖండ బ్రహ్మచర్యవ్రతుడు, నీతిమంతుడు, మహామనీషి ఐన హనుమంతుని చరిత్ర ఏనాటికైనా భారత దేశ చరిత్రను పునీతం చేయగలిగింది. ఆర్యావర్తంలో జన్మించిన అద్భుత చారిత్రక మహాపురుషుడు హనుమంతుడు. అతనిని కేవలం బొమ్మల రూపంలో పూజించడానికి బదులు, అతని నుంచి కావలసిన స్ఫూర్తిని పొంది మనం మన దేశాన్ని రక్షించుకొందాం. మన సంస్కృతిని కాపాడుకొందాం. మన చరిత్రను పటిష్టపరచుకొందాం. చరితార్థులమవుదాం.

చివరగా ఒక మాట. ఇంతకాలానికి ఈ గ్రంథం ప్రకాశం పొందడానికి కారణం **శ్రీ కోటికె లక్ష్మయ్య** గారు. వారు వైదిక జీవన తత్పరులు. త్యాగశీలురు. శ్రీ లోకామ్మఝరి గారి శతాధిక గ్రంథాలను ఫలాపేక్షలేకుండా ప్రచురించినారు. శ్రీ లక్ష్మయ్యగారి వల్ల ఈ **''శుద్ధ హనుమచ్చరిత్రం''** ముద్రింపబడి నిద్రావస్థలో ఉన్న ఆంధ్రజాతికి ఉత్తేజాన్ని, ఉత్సాహాన్ని కల్గిస్తుందని ఆశిస్తున్నాను. అనువాదకర్తతో పాటు ప్రకాశకులను ఇంతమంచి పని చేస్తున్నందుకు అభినందిస్తున్నాను.

ఓ౩మ్ తత్ సత్

**- డా॥ మసన్న చెన్నప్ప -**

## పదిలక్షల సంవత్సరములకు పూర్వము

త్రేతా ద్వాపర సంధికాలమున "**గాయన్తిదేవా ఉఖిల గీతికాని, ధన్యా స్తుయే భారత భూమి భాగే**" అను నీ భావనా యుక్తమగు కవి ఉక్తి అప్పుడు చరితార్థమగు చుండెను. జ్ఞాన విజ్ఞాన దృష్టిలో ప్రియమైన మన భారతమాత 'విశ్వగురు' పీఠము నలంకరించి యుండెను. బలపరాక్రమ పౌరుష దృష్టితో మన మప్పుడు చక్రవర్తి సామ్రాట్టుల మై యుంటిమి. భౌతిక సమృద్ధి విషయ మున పావనమైన యీ పుణ్య భారత భూమి "బంగారు పిచ్చుక" యని కీర్తింప బడుచుండెడిది.

భారతేతిహాసమున ఈ యుగము 'ప్రాగైతిహాసిక యుగ' మను పేరుతో పరిచయమై యున్నది, కాని యథార్థముగా దీనికి వైదిక యుగ మను నామమే ఉపయుక్తమై యుండును.

## ధార్మిక స్థితి

ఒక భారతదేశముననే యేమి, ఆ కాలమున ప్రపంచ మంతటను వైదిక ధర్మము, దాని ప్రత్యామ్నాయ నామము 'మానవ ధర్మము' లేక విశ్వ ధర్మము. ఆ కాలము నందనేక మత మతాంతరములు, వివిధ పంథాలు లేకుండెను. ప్రపంచ మంతటికిని ఒకే ధర్మ గ్రంథముండెడిది. అదియే వేదము. వేదానుకూలాచర ణమే ధర్మము. వేద విరుద్ధమగు ఆచరణము అధర్మమై యుండెను. దాని యందు అంధ విశ్వాసము, వ్యక్తి పూజ, గురుడం, పంథా విధానమున కేలాంటి స్థానము లేకుండెను. ఆ కాలమున ధర్మము, శ్రద్ధ, వివేకము, తర్కములు హృదయ మస్తిష్కముల సమన్వయమై యుండెను. జ్ఞాన విజ్ఞానములు, సత్య ధర్మములు, ఇహ పరలోకములు, భాగ్య, పురుషార్థములు, వ్యష్టి సమష్టి, భౌతిక ఆధ్యాత్మిక మార్గమున పయనించుచు సమస్త ప్రజలు సుఖ శాంతి సౌఖ్యముల ననుభవించు చుండిరి.

అనేకేశ్వరుల ( బహుదేవతా వాదముల) ఛాయలు కూడా ఆ కాల మున లేకుండెను. ప్రపంచమునందప్పుడు సచ్చిదానంద స్వరూపుడు, నిరాక

రుడు, నిర్వికారుడు, నిత్య నిరంజనుడు, అజన్ముడు, న్యాయ నియంత, సర్వ వ్యాపకుడగు ఒకే యీశ్వరుడుపాసింపబడుచుండెను. '' **ఏకం సద్విప్రా బహుధావదన్తి** '' ననుసరించి ఒకే పరబ్రహ్మ పరమేశ్వరుని గుణకర్మ స్వభావానుసారముగా బ్రహ్మ, విష్ణు, శివుడు, రుద్రుడు, మహాదేవుడు, నారాయణుడు మున్నగు అనేకానేక నామములతో జ్ఞానులు స్తుతించు చుండిరి. ఒకే పరమేశ్వరుడనియు, ఆతని ముఖ్య నామము 'ఓ౩మ్' అనెడి సత్య జ్ఞానము సర్వజనుల కుండెడిది. సకల ప్రజలు గురుమంత్ర రూపమున 'గాయత్రీ' మహామంత్రానుష్ఠాన జపముల నొనర్చు చుండిరి.

అనేకానేక పూజా పద్ధతులు నాటికాలమున నామమాత్రమునకైనా లేకుండెను. పంచమహాయజ్ఞములు, అనగా, బ్రహ్మయజ్ఞము, దేవ యజ్ఞము, పితృ యజ్ఞము, అతిథి యజ్ఞము, మరియు భూతయజ్ఞముల అనుష్ఠానముల ద్వారా వ్యక్తి, కుటుంబము, సంఘము, రాష్ట్రము, మరియు విశ్వమందుండు సర్వ ప్రాణుల యెడ కర్తవ్య పాలన మొనర్చుటయే ఆ కాలమున ఈశ్వర భక్తికి పర్యాయ వాచకమను రహస్యము సర్వజనులకు దెలిసి యుండెడిది.

మానవుల మధ్య ఎట్టి వర్ణ భేదముగాని, వర్గ భేదముగాని, దేశ, జాతి భేదములు గాని, ఉచ్ఛ నీచ భేదములుగాని మచ్చునకు గూడ లేని స్వర్ణయుగ కాలమది. ''**విజానీహ్యార్యా యాన్యే చ దస్యవః**'' ఇట్టి వేద వ్యవస్థ కనుగుణ్యమైన ఆచార వ్యవహార దృష్టితో శ్రేష్ఠులు, సదాచారులు, వేదాను యాయులు, ధర్మాత్ములు నగు వారు ఆర్యులుగను, ఇందుకు విపరీతముగా నున్నవారు అనార్యులు గను గుర్తింప బడు చుండిరి. సగర్వముగా మనమప్పుడు ముక్త కంఠముతో నిట్లను చుంటిమి.

**ఆర్య హమారా నాంహై వేద్ హమారా ధర్మ్‌హై ।**
**ఓం హమారా దేవ్ హై సత్య హమారా కర్మ్‌హై ॥**

తెలుగు అనువాదము

**ఆర్యులని మాపేరు వేదములు మా ధర్మం ।**
**ఓం మా యీశ్వరుడు సత్యమే మా కర్మ ॥**

# సామాజిక స్థితి

ఇట్టి స్వర్ణయుగమున మన సామాజిక స్థితి, వ్యవస్థకు మూలాధారము వర్ణాశ్రమ ధర్మమే యై యుండెను. వర్ణాశ్రమ ధర్మమే వైదిక ధర్మము యొక్క సమగ్ర, మరియు వ్యావహారిక స్వరూపమై యుండెను. రాష్ట్రము (సమాజము)న అజ్ఞానము, అన్యాయము, అభావమను మూడు శత్రు గుణములను తొలగించుటకై క్రమముగా బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణముల సంచయ గుణ కర్మ స్వభావములకు అనుగుణ్యముగా గురుకులములందు ఆచార్యుల ద్వారా శిక్షణ నీయబడు చుండెడిది. ఈ మూడు యోగ్యతల యందొక్కటి యైనను లేనివారు నాల్గవదగు చతుర్థ (శూద్ర) వర్ణమునకు చెందినవారుగా గుర్తించ బడుచుండెడిది. అట్టివారు శారీరక సేవా సాధనముల ద్వారా పై నుల్లేఖించిన మూడు వర్ణముల వారికి సహకరించుచు పై బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణములకు అర్హతను సంపాదించుటకు సఫల ప్రయత్నమొనర్చుచుండిరి. ఇదియే రాష్ట్ర జీవనమునకు పరమ కల్యాణ కారి, మరియు సరళమగు వైదిక వర్ణ విభాగము. దీనియందేవిధమగు ఉచ్చనీచమను భావన లేశ మాత్రమైనా ఉండెడిది గాదు. జన్మముతో ఈ వర్ణ వ్యవస్థల సంబంధ మేమాత్రమును లేకుండెడిది. అభిరుచి, మరియు యోగ్యతలను బట్టి ఈ వ్యవస్థ యందు పరివర్తనము గూడ యగు చుండెడిది.

వర్ణ సంచయ కాలమున 'యజ్ఞోపవీతధారణము' యజ్ఞీయ, లేక సామాజిక జీవన స్వీకృతికి చిహ్నముగ నుండెడిది. వ్యక్తి సంపూర్ణ జీవనము, సమాజీకరణము, లేక రాష్ట్రీయ కరణమునకిది చిహ్నముగా నుండెడిది

వర్ణ వ్యవస్థ, ఆశ్రమ వ్యవస్థ యనునవి సమాజ సమ్యక్ జీవన సాఫల్యమునకు పేర్లు. బ్రహ్మచర్యము, గార్హస్త్యము, వానప్రస్థము, సన్యాసాశ్రమమను నాలుగు ఆశ్రమ ధర్మముల సమ్యక్ (చక్కని) పాలన మొనర్చుచు వ్యక్తి దీనిని వర్ణ వ్యవస్థ, లేక రాష్ట్ర ధర్మముతో జతపరచినపుడు ఆతడు వర్ణాశ్రమ ధర్మావలంబి, లేక వైదిక ధర్మాను యాయి అని యెంచబడు చుండెను. ఈ విధముగ వైదిక ధర్మము, మానవ ధర్మము, లేక రాష్ట్ర ధర్మమునకు మూలాధారమై యుండెడిది.

**''పురంధిర్యోషా''** రూపమున స్త్రీలను రాష్ట్రీయ, లేక సామాజిక జీవ నాధారముగా సన్మానించు చుండిరి. ఆ కాలమున ఋషులవలెనే ఋష్యాంగ నలు వేద విదుషీమణులు, మరియు వీరాంగనలునై యుండిరి. మహిళామణులు చులకన దృష్టితో చూడబడక పురుషులకన్న అనేక రెట్లు గౌరవ పూర్ణ దృష్టితో జూడ బడుచుండెడివారు. **''ధన్యోగృహస్థాశ్రమః''** **జ్యేష్ఠో గృహస్థాశ్రమః, గృహిణీ గృహముచ్యతే, మాతానిర్మాతాభవతి, గౌరవే నాతిరుచ్యతే, యత్రనార్యస్తు పూజ్యన్తే రమన్తే తత్ర దేవతా** ''మున్నగు సూక్తులందిట్టి గౌరవమే నిండి యున్నది.

వైదిక సంస్కారముల ద్వారా జీవితము సుసంస్కృత మొనర్చుటకు, వ్యక్తిని అధికాధికముగా రాష్ట్ర జీవనముతో జతపరచుటకు కుల గురువులు, లేక పురోహితుల వ్యవస్థ యుండెడిది. **వయం రాష్ట్ర జాగృయామ పురోహితాః''** అని వారు ఉద్ఘోషించు చుండిరి.

ఈ పురోహితుల సంరక్షణమున శిక్షాప్రాప్తి నొందు బాల బాలికలను, యువజనులను వృద్ధులు తమ యాశీర్వాదము, అనుభవ పూర్ణమగు మార్గదర్శ కత్వమున పురోగాముల నొనర్చు చుండెడివారు.

మానవేతరమగు సమస్త ప్రాణుల యెడ శ్రేష్ఠమగు ప్రాతినిధ్య రూపమున గోవు 'గా, 'గోమాత' యని పిలువ బడచుండెడిది. అది ప్రతి కుటుంబము నకు అవిభాజ్యాంగమై యుండెడిది. వైదిక జనులు పరమేశ్వరునితో స వినయ ముగా **''శన్నో అస్తు ద్విపదేశం చతుష్పదే''** యని కాంక్షించు చుండిరి. సర్వ జనులు గోక్షీరములు, మరియు సాత్విక భోజ్య పదార్థముల సేవన మొనర్చు చుండిరి. సకల జనులు నిరామిష భోజనులై యుండిరి. మాదక పదార్థ సేవనము సుచ్ఛునైనను యుండెడిది గాదు.

## రాజనైతిక స్థితి

నేటి ఇంగ్లాండు శాసన ప్రణాళికకు కొంత సామ్యము గల రాజ్య తంత్ర, ప్రజాతంత్ర సమన్విత రూపము వంటి శాసన మా కాలమున నుండెడిది. సభ

రాజాధీనమై, రాజు సభాధీనమై యుండెడివారు. సదాచారులగు వేద విద్వాంసులు మరియు వేదజ్ఞులగు సన్న్యాసుల స్థానము సర్వోన్నతముగనుండెడిది. "**త్రీణి రాజానా విదథేపురూణి, పరివిశ్వాని భూషథః సదాంసి ॥ఋ॥** ఇట్టి వైదిక వ్యవస్థాను సారము రాజ్య పాలనమునకు ధర్మసభ, విద్యాసభ, రాజ్య సభ వ్యవస్థ లుండెడివి. రాజు తన కాలమున సాటిలేని మేటియగు మహావీరుడై యుండుటతో బాటు వేద వేదాంగ పండితుడు, న్యాయ ధురీణుడు, ధర్మాత్ముడై యుండెడివాడు. "**మా అఘ శం స ఈశత**" ఈ వైదిక సూక్తియందు పాపాత్ముడు, అధర్మాత్ముడు మా శాసకుడుగా నుండకుండుగాక' అన ప్రార్థన గలదు. ప్రజారంజకము, ప్రజా కల్యాణకర కార్యము లొనర్చుటయే రాజునకు ముఖ్య ధర్మమై యుండెడిది.

"**ఏ రాజు ప్రజలను వేదించు చుండు । నారేడు నరకమ్మునకు చక్కబోవు**"

ఈ శబ్దములందు రాజు యొక్క ప్రజాహిత నిష్ఠయే చిత్రితమై యున్నది. ప్రజలు మరియు రాజు, రాజ్య హితమునకై తమ సర్వస్వమును ధార బోయుటకై సముద్యుక్తులై యుండెడి వారు.

దుష్టులు దుర్మార్గులకు కఠినతరమగు శిక్ష, ధర్మాత్ములకు సర్వ విధ సంరక్షణముండెడిది. ధర్మాభివృద్ధియే వైదిక రాజనీతి యొక్క ముఖ్య సూత్రమై యుండెడిది. "**దణ్డః శాస్తిః ప్రజాసర్వా, దణ్డః ధర్మ విదుర్బుదః**" ననుసరించి రాజ దండము కాలుని రూపము దాల్చి దుష్టుల ప్రాణములు హరించు చుండెడిది. మహర్షి వాల్మీకి శబ్దములందు "**క్షత్రియైర్ధార్యతే చాపే, నార్తా శబ్దో భవేదితి**" క్షత్రియుడు ధనుర్ధారియైన పిదప ఏలాంటి ఆర్తుల, దుఃఖితుల కరుణాక్రందనములు వినరాకుండెడివి.

చిన్న చిన్న మాండలిక రాజులు ఒకే సర్వోత్కృష్ట శక్తియగు చక్రవర్తి సమ్రాట్టునకు 'సంధి విగ్రహము' వంటి కొన్ని విషయము లందు మాత్రమే

అధీనులై యుండెడివారు. ఆంతరంగికముగా వారు సంపూర్ణ స్వతంత్రులై యుండిరి. అశ్వమేధ యజ్ఞ రూపమున చక్రవర్తి సామ్రాజ్య సంస్థాపన కుపక్రమింప బడుచుండెడిది. ఇట్టి వైదిక సామ్రాజ్యమే యథార్థమగు సాంస్కృతిక ధర్మ సామ్రాజ్యమై యుండి, ఆధునిక సామ్రాజ్య వాదనకు గాని, వలస వాదమునకు గాని అది పూర్తిగా భిన్నమై యుండెడిది. శాసిత, శాసకులందు అన్యోన్య శ్రేయోభిలాషులుండెడివారు. ఆ కాలమున రాజ శాసనము ధర్మమునకొక అంగమై రాజనీతికి ప్రతినామమై రాజ ధర్మమై యుండెడిది. ధర్మమనగా, ఇప్పటికాలము వలె ఏదో యొక ప్రత్యేక రకమగు పూజా పురస్కారము, అవతారముల, లేక గ్రంథ విశేషముల పూజల వంటివి ఆ కాలమున మచ్చుకైనను లేకుండెడివి. ఏదో యొక మతము, పంథా, లేక సాంప్రదాయ వాదము నందు చిక్కుకొనక వ్యక్తి, కుటుంబము, సమాజము, రాష్ట్రము (దేశము) నెడ కర్తవ్య పాలనము విశ్వమానవతా పూజా రూపమున ప్రతిష్ఠితమై యుండెడిది.

విశ్వమానవేతిహాసమున 'స్వర్ణయుగ' మనదగు వైదిక యుగ మట్లుండెను. విద్య, కళాకౌశలము, కృషి, వాణిజ్యముల యొక్క పరమోన్నత మగు సరళ, సరస, శాంత జీవనమది.

## రామాయణ కాలము

తొమ్మిది లక్షల సంవత్సరములకు పూర్వము భగవానుడగు శ్రీరామ చంద్రుడు భూమాతా హృదయ రూపమగు ఈ భారత భూమిపై వెలసి యుండెను. వైదిక కాల ధర్మములు, సామాజిక విశేషములు ఆ కాలము వరకు అవిచ్ఛిన్న రూపమున నడచుచుండెను. కొన్ని రాజనైతిక ఒడుదొడుకులు గూడా ఆకాలమున లేవని యనలేము. రామాయణ కాలమున దేవతలు, ఆర్యులు, వానరులు, రాక్షసులు అను నాలుగు మానవ వంశముల వర్ణన లభించు చున్నది. ఇవి యన్నియును ఆర్య జాతి విభాగములే. హిమవత్పర్వతముల కుత్తరమున దేవరాజ్య ముండెడిది. దేవతలకు రాజు ఇంద్రుడు. సభాపతి విష్ణువు, సేనానాయకుడు శివుడు, లేక రుద్రుడు. అను నామములు గలిగి యుండిరి. గంగా యమునా

మైదానము, మరియు పంచ నది (పంజాబు) ప్రదేశములందు ఆర్య రాజ్యమును, దక్షిణమున వానర మరియు రాక్షస రాజ్యములు నుండెడివి. కేంద్రీయ శాసనము (చక్రవర్తి శాసనములు) ఆ కాలమున కొంత శక్తి హీనముగా నున్నందున మాండలిక రాజు లెల్లరును దాదాపు నిరంకుశులై యుండిరి. బలగర్వమున వారు ఋషులను, మునులను, మహాత్ములను, విద్వాంసులను పలు విధములుగా బాధించు చుండిరి. వారి యాశ్రమములను విధ్వంస మొనర్చు చుండిరి. ఈ కారణముననే మహావీరుడగు పరశురాముడు యోగ సాధనమును వదలి ధనుర్ధారి గావలసి వచ్చినది. ఇరువదొక్క మారులు ఇట్టి ఉచ్ఛృంఖల క్షత్రియ శాసకుల మదమర్దన మొనర్చినాడు. దానివల్ల అత్యాచారమైతె అడుగంటినది, గాని క్షత్రియ రాజుల శక్తి క్షీణించినది. ఈ యవకాశము లభించగనే వానర, అసుర రాజ్యములు పరస్పరము మైత్రి జేసుకొని అత్యధికముగా ప్రబలిపోయినవి. వీరిలో లంక రాక్షస రాజగు రావణుని అత్యాచారములు మితిమీరి పోసాగినవి. అట్టి అరాచకము నణచుటకు శక్తి మంతుడు, కేంద్రీయ శాసకుడు, ఆర్య సామ్రాజ్య పునరుద్ధారకుడగు సమ్రాట్టు ఎంతయో అవసరమై యుండెను.

ఋషులు తమ కర్తవ్యము నాలోచించినారు. చక్కని ఆర్యవీరుని జన్మింప జేసి ఆతనికనేక రీతులగు శిక్షాదీక్షల నొసంగి సర్వలక్షణ సంపన్నునిగా నొనర్ప సంకల్పించినారు. ఋష్య శృంగుని ద్వారా నిర్వహింపబడిన 'పుత్రకామేష్టి' యజ్ఞము నుండి మొదలుకొని మహర్షి వశిష్ఠుని, మహాముని విశ్వామిత్రుని ప్రశిక్షణము, మరియు అగస్త్యమహర్షి ఆశ్రమమునకు జేరు వరకు ఆర్య వీరుడగు శ్రీరాముని నిర్మాణ ప్రక్రియ యంతయు సంపూర్ణ రహస్యముగా నడచినది. అగస్త్యమునివర్యులు యోజనా (plan) బద్ధముగా వానర జాతి యువతరమునకు జ్ఞాన విజ్ఞాన కేంద్రమగు తనయాశ్రమమున శిక్షా దీక్షల నిచ్చినారు. రాక్షసుల పట్ల విద్వేషము, దేవతలు, మరియు ఆర్యుల విషయమున ప్రేమ భావములు గలుగునట్లు వారిని సంస్కరించినారు. **ఈ యువతరపు వానరజాతికి నాయకుడు మహావీరుడగు హనుమంతుడు.** ఆతడాజన్మ బ్రహ్మచర్య వ్రత

**దీక్షుడై శ్రీరాముని యీ రాష్ట్రోద్ధార కార్యమునను, చక్రవర్తి ఆర్య సామ్రాజ్య సంస్థాపనా కార్యమునను తన సహాయ సహకారముల నందించినందుననే రామరాజ్య స్థాపన జరిగి రామాయణము, లేక రామచరితమునకు అట్టి రూప మేర్పడినది. ఆదిత్య బ్రహ్మచారి, మహావీరుడునగు హనుమంతుని నాయ కత్వమున వానర వీరుల బలదర్పములు, మరియు శౌర్య సాహసముల వల్ల మరల యొకసారి ఈ భూమండలముపై వైదిక యుగము సాకారము నొందినది.**

రామరాజ్యమును గూర్చి గోస్వామి తులసీదాసుగారిట్లు వ్రాసినారు. ఆ కాలమున ప్రజలు తమ తమ వర్ణాశ్రమ ధర్మములందు తత్పరులై సదా వేద మార్గమున నడచు చుండిరి. కావుననే వారెల్లరును సౌఖ్యవంతులై యుండిరి. రాష్ట్ర ప్రజలకు వ్యాధులుగాని, ఇతరులవల్ల భయముగాని లేకుండెను.

ఇట్టి వైదిక రామరాజ్యమున దైహిక, దైవిక, భౌతిక తాపములు దరి జేర కుండెడివి. సకల మానవులు పరస్పర ప్రేమను గలిగియుండిరి. పవిత్ర వేదములందుపదేశించబడిన మర్యాదల యందు తత్పరులై యుండి వర్ణాశ్రమ వ్యవస్థాను సారముగ తమ తమ కర్తవ్య (ధర్మ) ములను పాలించు చుండిరి. రామరాజ్యమున వర్ణాశ్రమ ధర్మపాలనము వల్ల అల్పాయుష్యముగాని, అన్య పీడలు గాని లేక అందరి శరీరములు సుందరముగా రోగ రహితముగా నుండెడివి. వైది క ధర్మమును పాటించు కారణమున దరిద్రులు, దీనులు, దుఃఖితులు, మూర్ఖులు, దుర్లక్షణములు గలవారెవ్వరును లేకుండిరి.

అశ్వపతి మహారాజు రాజ్యమువలెనే శ్రీరాముని వైదిక రాజ్యము సుఖ పంతమై యుండెడిది. అత్యంత ఆత్మవిశ్వాసముతో వైదిక రాష్ట్రపతి యగు అశ్వపతి మహారాజు ఇట్లను చుండిరి.

**"నమే౽స్తేనో జనపదే నకదర్యో న చ మద్యపాః ।**

**నానాహితాగ్నిర్నా౽విద్వాన్ నస్వైరీ స్వైరిణీకుతః॥**

రాష్ట్రము నందు చోరులుగాని, పిసినారులుగాని, మాదక వస్తువులు (కల్లు, సారాయి, గంజాయి, నల్లమందు, భంగు, పొగాకు, బీడీ, సిగిరెట్లు)

మున్నగునవి సేవించు వారు గాని లేకుండిరి. అగ్నిహోత్రము ( యజ్ఞము) చేయని ఒక్క గృహము కూడా లేకుండెను. అవిద్వాంసులు, మూర్ఖులు లేరు. వ్యభిచారులే లేనప్పుడిక వ్యభిచారిణులెచ్చట నుండ గలరు ? ఇదియే వైదిక శాసనము, లేక రామ రాజ్యము.

రాముని పరిపాలనమున సకల ప్రజలు దంభరహితులు, ధర్మ పరాయణులు, పుణ్యాత్ములు, చతురులు, గుణవంతులు, పండితులు, జ్ఞానులు, కృతజ్ఞులు, కపట రహితులునై యుండిరి. మరియు నా రాజ్యమున జనులెల్లరును ఉదార వంతులు, పరోపకారులు, విద్వజ్జన సేవకులు, ఏకనారీ వ్రతులై యుండి మనోవాక్కాయ కర్మణా సదాచారులై యుండిరి.

శ్రీరాముని ఆదర్శ వైదిక పరిపాలనమున అపరాధులు, చోరులు, హంతకులు, శత్రువులు మున్నగు వారు లేనందున సామ దాన భేద దండనములను చతుర్విధోపాయములు కేవలము నామ మాత్రమునకే యుండెను.

వనములందు వృక్షములు సదా పుష్పించి ఫలించు చుండెను. వన్య మృగములు పరస్పర భీతి రహితముగా గలిసి యుండెడివి. పశు పక్ష్యాదులు నిర్భయముగా వనములందు విహరించుచు మధురస్వరముల నొనర్చు చుండెడివి.

లతాగుల్మవృక్షములు, పుష్ప ఫల, మధు ఓషధులతో, గోవులు వలసినంత క్షీరసంప దతో, ధరణి అన్నముతో సమృద్ధమై యుండెను. రే రాజు తన శీతకిరణములతో పృథివిని పూర్ణమొనర్చును. సూర్యుడు ఆవశ్యకతానుసారము తపనము నిచ్చు చుండెను. అవసరమని కోరినపుడు మేఘములు వర్షించు చుండెను. అతి వృష్టి, అనావృష్టి బాధలు లేకుండెను.

మహామహిమ గల రామాయణ కాల మిట్లుండెను. వేద ప్రచార మాగిపోయిన కాలమున ఆర్య (హిందూ) జాతిని జీవించి యుండునట్లు జేసిన రసాయనము కేవలము రామాయణమే.

ఆర్య వంశము యొక్క ధర్మ కర్మ సంస్కృతుల ప్రబల ప్రవాహము ఒకనాడు ప్రపంచ సన్మార్గ నిరోధకములై యున్న భూధరముల దర్పదలన మొనర్చి చూర్ణము నొనర్చి నట్టియు, ప్రపంచమందలి అంధకారమును నామ రూపములు

గూడ లేకుండ జేసి నట్టి పరమ పవిత్రమైన ఆర్య జాతి విశ్వవ్యాపక ప్రకాశమిప్పు డేది ? నిగూఢ మర్మ స్పర్శమగు ఈ ప్రశ్నకు సమాధానమేది ? అదంతయు మహాకాల భగవానుని మహోదరమున జీర్ణమై పోయినది.

తన వ్యాపక కారణమున గౌరవ సంస్కృతులను విశ్వమంతట విరజి మ్ముట యందు ప్రసిద్ధి వహించిన ఆ వైదిక ప్రకాశము భారతదేశమందిప్పుడు కొరత పడినది. బృహద్భారత దేశపు ఆర్య సామ్రాజ్య చక్రవర్తిత్వ శబ్దము కాల చక్రమున లీనమై పోయినది. శక్తి, విద్య, తేజస్సు, ప్రతాపము మున్నగున వెల్లి యును నామమాత్రావశిష్టములైనవి. ఐనను మునిగి పోవుచున్న ఆ మహత్తర ఖ్యాతి ఏమైన మిగిలి యున్నదనిన అది రామాయణము వల్లనే.

ఒకప్పుడు మనము సౌఖ్యములతో తుల తూగుచుంటిమి. భూమండ లమున మనము విద్వాంసులు, మహావీరులని పిలువ బడుచుంటిమి. మన కీర్తి దిగ్దిగంతము లందు వ్యాప్తమైయుండెను. మన జయజయ నినాదములతో నభో మండలము మార్మోగుచుండెను. గొప్ప గొప్ప సామ్రాట్టులు మన కృపా కటా క్షముల నాశించు చుండిరి. మన దేశములో స్వదేశ భక్తులు ఉత్పన్నమగుచుండిరి. మన యందు సౌభ్రాతృత్వము, సౌహార్దతలకు కొదువలేకుండెడిది. గురుభక్తి, పితృభక్తి మన నిత్య కర్మగా నుండెడిది. మనయందాజన్మ, అఖండ బ్రహ్మచర్య మహావ్రతుల కేమాత్రము కొదువ లేకుండెను. దుష్ట శిక్షణ, శిష్టరక్షణ మన కర్త వ్యమై యుండెడిది. అట్టి మన మహోత్కృష్ట గుణముల నెంతయని వర్ణించ గలము ? క్లుప్తముగా చెప్పవలయు నన్న ప్రాపంచిక లోభమోహములు మనను కర్తవ్య విముఖులను చేయ జాలకుండెడివి.

దశరథ మహారాజు పుత్ర స్నేహము, శ్రీరామచంద్రుని పితృభక్తి, లక్ష్మణ శత్రుఘ్నుల భ్రాతృభక్తి, భరతుని స్వార్థ త్యాగము, వశిష్ఠుని ఆదరము, విశ్వామిత్రుని ప్రతాపము, ఋష్యశృంగుని తపోబలము, జానకీదేవి పాతివ్రత్యము, ఆంజనేయుని అఖండ బ్రహ్మచర్య వ్రతము, మరియు ఆదర్శ సేవాభావము, విభీషణుని శరణాగతి, రఘునాథుని కఠోర కర్తవ్య పాలనము నెవరు విస్మరించె

దరు ? రామ చంద్రునెరుగువారు అయోధ్య మరియు మిథిలా నగరముల నెట్లు మరువగలరు? రాక్షసుల అత్యాచారములు, ఋషిమునుల తపోబలము, మరియు క్షత్రియుల ధనుర్బాణశక్తుల నెవ్వరును మరవలేరు.

ఇట్టి శిక్షణలను లక్ష్యము నందుంచుకొనుటవల్లనే మన సమాజమున రామనామ మహోత్మ్యము యొక్క ఆదరణ పెరిగినది. ఇంతటి పావనమైన, శిక్షా ప్రదమైన చరిత్ర పునీత భారతావనియందు దప్ప అన్యత్ర లభించుట దుర్లభ మనునది నగ్నసత్యము.

## హనుమచ్చరిత్ర గౌరవము

ఏ రామ నామమున కింతటి మహిమగలదో ఏ రామ రాజ్యమున కిట్టి ప్రతాపము గలదో, ఏ రామ చరిత్ర కింతటి గరిమ గలదో వాని మూలమున మహావీరుడగు హనుమంతుని అఖండ బ్రహ్మచర్య, అపూర్వ తపస్సు, మరియు దీక్ష, అనుపమ శౌర్యము, అపార సాహసము, అద్భుత రాజనీతి, అన్నిటికన్న మిన్నయైన నిరభిమానత, మరియు సేవానిరతి యొక్క అద్భుత గాథను మనము మరచి పోజాలము.

హర్షించ దగిన విషయమేమన, మర్యాదా పురుషోత్తముడగు శ్రీరామ చంద్రుడు తన కార్య సాఫల్యమునకు మూలాధార ప్రతిమూర్తియగు ఆంజనేయుని విలువను (పాత్రను) కొరత పరచలేదు. కృతజ్ఞతా స్వభావముగల భారతీయ ప్రజ లైనను మహావీరుడగు పవనసూనుని మరువలేదు. కాలచక్ర ఘాత ప్రతిఘా తముల మధ్య భారతీయ కవికుమారులు ఆతని గౌరవమును ఏ మాత్రము తరుగ నీయలేదు. శ్రీరామునికి మహావీరుడగు హనుమంతుడు, లక్ష్మణ భరతుల కన్న ప్రజలిచ్చిన మహత్వ పూర్ణమగు గౌరవమునందు హనుమంతుని చరిత్ర యొక్క ఉత్తమ గరిమయే స్పష్టముగా గాన్పించు చున్నది. ఇక మనమిపుడు రామరాజ్యము, మరియు ఆర్య సాంస్కృతిక చక్రవర్తి సామ్రాజ్య సంస్థాపకుడగు మహావీర హనుమంతుని సుందరమగు చరిత్రము అవగాహన మొనర్చుకొని ధన్యు లమగుదము.



ఓ౩మ్

# శుద్ధ హనుమచ్చరితము

## పూర్వ ఖండము

### ౧. మహావీరుడు హనుమంతుడు

**ఓం యత్ర బ్రహ్మచ క్షత్రఞ్చ సమ్యఞ్చౌ చరతః సహ ।**
**తం లోకం పుణ్యం ప్రజ్ఞేషం యత్రదేవాః సహాగ్ని నా ॥యజు. ౨౦-౨౫**

సామాన్యముగా మానవులందు బ్రాహ్మణబలము, క్షాత్రబలము లం దేదో యొక బల విశేషముండును. కొందరు విద్యాధనులై యున్నచో శారీరక బల శూన్యులు, మరికొందరు శారీరక బలయుక్తులై యున్నచో విద్యా శూన్యులై యుందురు. ఏ యొక్కరో విద్యా శక్తి సంపన్నులై యుందురు. వారే పుణ్యా పురుషులు, ఆదర్శ మానవులు. దేవత్వ (బ్రహ్మ) అగ్నిత్వ (క్షాత్ర) బలములను రెండు భాగ్యములున్న వారే దేశ సౌభాగ్యోన్నతి నొనర్చుటకు అధిక సామర్థ్యము గలవారై యుందురు. భగవాన్ శ్రీరాముడు, యోగేశ్వరుడైన శ్రీకృష్ణుడు మరియు నీ యుగమున మహర్షి దయానందులు మున్నగు వారి వలెనే **మహావీరుడగు హనుమంతుడు గూడ దేవపురుషుడే. ఆతడు శౌర్య బల పరాక్రమ క్షేత్రమునందాదర్శ వంతుడై యున్నట్లే యోగ విద్య, ప్రాణ విద్య, వేద విద్య యందు గూడ మహాధని, వ్యాకరణము నందు అద్వితీయ పండితుడునై యుండెను. మహామానవుడు, ఆదర్శ వీరుడగు హనుమంతునికి ఈ దైవగుణములు వారసత్వమున లభించినవి. ఈతని పూర్వజులు గూడ మహనీయులై యుండిరి.**

### ౨. హనుమంతుని పూర్వజులు

దాదాపు ౯½ తొమ్మిదిన్నర లక్షల సంవత్సరములకు పూర్వము ఆర్యా

---

**నిన్ను నీవు పూర్తిగా మరిచిపోయి పనిచేస్తే నీవు విజయం పొందడం నిశ్చయం**

వర్త (భారతదేశ) మున దేవ, ఆర్య, వానర, అసురు (రాక్షసు) లను నాలుగు విధములైన మానవ వంశములు రాజ్యము చేయుచుండెడివి. వానర రాష్ట్ర వ్యాపకము ఇప్పటి ఆంధ్ర ప్రదేశ్, మధ్యప్రదేశ్ లోని కొంత భాగము, మదరాసు, మరియు ఉత్కల ప్రదేశమై యుండెను. వానర రాష్ట్ర శాసకుడగు వాలి ప్రబల ప్రతాపశాలి. అద్వితీయ శూరుడై యుండెను. ఆతడొక మారు రాక్షస రాజగు రావణు నోడించి ఆరు నెలల వరకు చెరసాల యందుంచెను. రావణుడు వాలితో సఖ్యము జేసికొని కొన్ని స్థానములందు తన రాణువ (సేనా నివేశము) లను స్థాపించెను. వానర రాజ్యముతో నెరపుకొనిన సంధి వల్ల రావణుని బలము ఎంతయో పెరిగిపోయెను. వాలి సహాయము వల్లనే రావణుడు దేవరాజ్య కోశాధ్యక్షుడగు కుబేరుని చెరబట్టి యాతని 'పుష్పక' మను విమానమును లాగుకొనెను.

వానర జాతియంతయు నొక యున్నత క్షత్రియ జాతి. దాని యందు గొప్ప గొప్ప పరాక్రమ వంతులు, మహారాజులు, మహాశిల్పులు, ( ఇంజినీర్లు) మహా బలవంతులు, శూరులు, వీరులు, వేద వ్యాకరణ మహా విద్వాంసులు, వాయు సేన చాలకులు, యోగులు గూడ వెలయు చుండిరి.

ఈ జాతి భారత దేశమందే గాక ప్రపంచమందలి అనేక దేశములు, బర్మా, శ్యామ్, మలాయా, బోర్నియా, సింగాపూర్, బ్రహ్మపుత్రా, మరియు బ్రహ్మబాలి, రష్యా, గాంధార (కంధారము), ఆర్యన్ (ఈరాన్) మున్నగు ప్రదేశములందును నివసించియుండెను.

వానర రాష్ట్ర రాజధాని కిష్కింధ (ఇప్పటి కర్నాటకము) మహాబలి యగు వాలి యొక్క మహారాణి 'తార'. ఆమె అతి సౌందర్యవతియే గాక గొప్ప విదుషీమణియు, ఆకాలపు రాజనీతిజ్ఞులందు పండితురాలునై యుండెను.

వానరవీరులు గొప్ప పరాక్రమ వంతులు, మహాసాహసులు, దుముకుట, గంతులు వేయుటలో గొప్ప ప్రవీణత గలవారు. నిరాడంబరత్వము, సత్ప్రవర్తనములు వారి యాభూషణములై యుండెను. ఇట్టి యశోవంతమగు వానర రాష్ట్రమునందు చిన్న చిన్న మాండలిక రాజ్యములెన్నియో నుండెను. రత్న

పురము, మహేంద్ర పుర మనునవి ఇట్టి మాండలిక రాజ్యములే. మన మహా వీరుడగు హనుమంతుని పితా మహుడైన ప్రహ్లాద విద్యాధరుడు తన శూర వీరత్వము, ధర్మప్రేమ, విద్యా ప్రేమలందు ఖ్యాతి పడొంది యుండెను. ఈ ప్రహ్లాదునికి అపరిమిత విద్యా ప్రేమ వల్లనే 'విద్యాధరు' డను బిరుదము లభించి యుండెను. శ్రీ ప్రహ్లాద విద్యా ధరుడు న్యాయ ప్రియుడు, ఉదారవంతుడు, ప్రజారంజకుడు నై యుండెను. కృష్ణా, కావేరీ, నదుల మధ్య నున్న ఈ మాండలిక వానర రాజ్యము విద్య కళాకౌశలము, మరియు సిరిసంపదలతో సమృద్ధమై యుండెను. ప్రహ్లాద విద్యాధర మహారాజు గారి భార్య 'కేతుమతి' విదుషీ మణి, పతిపరాయణు రాలై యుండెడిది.

మహారాణి కేతుమతి గర్భము నుండి ఒక శుభముహూర్తమున పరమ సుందరుడగు కుమారుడుద్భవించినాడు. బాలకుని వదనము సుందరము, మనోహరము, తేజోవంతము, దర్శనీయమై యుండెను. యోగ్య పురోహితుని ద్వార వేద విధిగా బాలుని నామకరణ సంస్కారము చేయించబడినది. వాని గుణ రూపముల కనుగుణముగా ఆ బాలునికి, పవనుడను నామకరణము జరిగినది. ఆ బాలకుడు పవనుని (వాయువు) వలెనే మహా బలశాలి. తేజస్వియై వృద్ధి నొంద సాగినారు. వాని వీరత్వ మును గాంచి లోకులు వానిని 'కేసరి' యనియు పిలువ సాగినారు.

## 3. కేసరి పవనకుమారుడు

రాజకుమారుడగు పవనుడు కిషోరుడుగా నెదిగి తన నమ్రతా మిళిత వీరత్వముచే ప్రజల హృదయములను గెలిచికొనెను. ప్రతిముఖము నుండి పవనుని నామమే ఉచ్చరించబడుచుండెడిది. చురుకుదనమున నిజముగా పవనుడే. వాయువు సమస్త జీవులకాధారమైనట్లే ప్రజలకు పవనుడు ప్రియమై యుండెను.

అగస్త్య మహర్షి యాశ్రమమున విధివిధానముగా వేద వేదాంగముల నధ్యయన మొనర్చి క్షాత్ర ధర్మోచిత విద్యా కౌశలము నందసమానుడైన యువకరత్నమగు పవనుడు కర్మక్షేత్రమున ప్రవేశించెను. అశ్వ చాలనము నందద్వితీయుడు,

రణ క్షేత్రమునందాతని ఘనగర్జనము శత్రువుల హృదయములను కంపింప జేయు చుండెడిది. ఆతని కత్తిసాము వీరులకు భ్రాంతి గలిగించును. నక్షత్రముల మధ్య చంద్రుని వలె ఆతడు సభా మధ్యమున దేదీప్యమానుడై సభాసదులెల్లరను తన వైపు ఆకర్షించు నైపుణ్యము గలవాడై యుండెను. సహజ సుందరుడగు నా వీర పవన కుమారుడు బ్రహ్మ చర్య సాధనచే ప్రదీప్త మానుడై రత్నపుర ప్రజలకు ఆశాజ్యోతి, శాంతి దాతయు నై యుండెను.

ఒకనాడు మహేంద్ర పుర రాజగు మహేంద్ర రాయుని మంత్రి రత్న పుర రాజ్య సభ యందు ప్రవేశించి కుశల ప్రశ్నల యనంతరము మహేంద్ర రాజ కూతురగు అంజనాకుమారి చిత్ర పటము నందించినాడు. ఇది వరకే తెప్పించి కొనిన పవన కుమారుని చిత్ర పటమును తిరిగి యిచ్చుచు రాజకుమారి అంజన సౌందర్యము, సౌశీల్యము, సహిష్ణుత్వము, ఉదారత్వము, పరదుఃఖ హరణత్వము మున్నగు ( నారీ సహజ ) గుణములతో బాటు ఆమె యనుపమ పాండిత్యము, వీరత్వ గుణ విస్తారములను పొందుపరచి వ్రాసినట్టి మహేంద్ర రాయని పత్రము గూడా సమర్పించెను.

విద్యా వినయ శౌర్య సంపన్నుడగు ప్రహ్లాద విద్యాధరుడు తన మంత్రి పరిషత్తు సమ్మతి, మహారాణి కేతుమతి స్వీకృతియు లభించిన తరువాత రూప గుణ శీలాది సకల లక్షణ యుక్త యగు అంజనాదేవి పవనకుమారునికి సర్వ విధ ములుగా తగిన కన్యయని నిశ్చయించి అంతిమ స్వీకారమునకై అంజనాదేవి చిత్ర పటమును పవన కుమారునకొసగెను. అంజనా రాజకుమారి సౌందర్య సరోవ రమున పవనుడు ఓలలాడ సాగెను. ఒకప్పుడు తాను ఆచార్యుడగు అగస్త్య మహర్షి చరణములందు అసుర రాజ్య పాపకృత్యముల నుండి వానర రాష్ట్ర స్వామియగు వాలి భీతి నుండి జన సమూహమునకు ముక్తి కలిగించుటకు ఆజన్మ బ్రహ్మ చర్య వ్రతదీక్షస్వీకరించిన విషయమునే మరచిపోయెను. చిత్రపటమును తండ్రికి తిరిగియొసగుచు **'మౌనం స్వీకృత లక్షణమ్'** ద్వారా తన స్వీకృతిని ప్రకటిం చెను. అంగీకృతిని పొందిన మహేంద్ర రాయుని మంత్రి హర్షవదనము లో మహేంద్ర పురమును జేరెను. మహేంద్ర పురమున వివాహ సంరంభము లారంభమాయెను.

## ౮. పవన కుమారుని శివ సంకల్పము

మహావీరుడగు పవనకుమారు డొక దినమున వేటకు బయలు దేరినాడు. దైవ యోగమున ఒక క్రూర మృగమును తరుముకొని అరణ్యమున చాల దూరమేగినాడు. అచ్చట నాతనికి విధ్వంస పరచబడియున్న కొన్ని ఋష్యాశ్రమావశేషములు గాన వచ్చినవి. సమీపముననే మహర్షి అగస్త్యుని గురుకుల విజ్ఞానాశ్రమము గూడా గానవచ్చినది. అప్పుడాతనికి తానా జన్మ బ్రహ్మచర్య వ్రత దీక్షను గొనిన విషయము జ్ఞప్తికి వచ్చినది. తాను గురుకులమున విద్యా సముపార్జన కాలమున రావణుడు, మరియు నాతని అనుయాయుల ద్వారా విధ్వంస పరచబడిన ఋషివాటికలు, తపస్సు నందు సంలీనమై యున్న ఋషుల తలలను నరికి బంతులాడిన విషయము, ఋష్యా శ్రమములందు చెలరేగిన హాహాకారములు, ఛీత్కారములు, గురుకుల వాతావరణము బీభత్సముగా నొనర్చి వేసిన విషయము. అట్టి సమయమున ఆచార్య ప్రవరులగు అగస్త్య మహాముని ఈ పాపకృత్యములను సమూలముగా నంత మొందించుటకు ఏకాంతమున తనకు ఆజన్మ బ్రహ్మచర్య వ్రత దీక్ష నిచ్చుచు ఉపదేశించుట తాను సహర్షముగ వ్రతమును స్వీకరించుట మున్నగునవన్నియును అప్పుడు జ్ఞాపకమునకు వచ్చినవి.

ఆశ్రమము వైపు సాగుచున్న అడుగు లాగిపోయినవి. అతని కన్నులు తెరచి యుండియు శూన్యము నందు దేనినో వెదకుచున్నట్లుండెను. ముఖము వివర్ణమై నోరెండి పోయినది. ఆచార్యులను దర్శించుకొని జరిగిన విషయమంతయును దాచకుండా నివేదించ వలయునని నిశ్చయించుకొని గురుకులమున ప్రవేశించి మహర్షి చరణములపై వ్రాలినాడు. ఋషియాతని నెత్తి గాఢ పరిష్వంగ (ఆలింగన) మొనర్చి తన హృదయమందున్న ప్రేమ రసమంతయును నాతని పై గ్రుమ్మరించి ''వత్సా'' సర్వమును కుశలమే గదా !'' అని యడిగినాడు.

కాని రాజకుమారుని అశ్రు ప్రవాహ ముఖమును గాంచి 'కుమారా ! ఏమైనది? ఈ కన్నీరేమిటి ? నీ దినచర్య చక్కగా నడచు చున్నదిగదా ? దైనిక వేదాధ్యయనము, సంధ్యోపాసన, అగ్ని హోత్రములతో బాటు అతిథి పూజ,

బలివైశ్వ దేవ కర్మ యజ్ఞము మున్నగునవి నియమ పూర్వకముగా నాచరించు చుంటివా ? అనాథ రక్షణము, దారిద్ర్య దుఃఖ భంజన, రూపముగు ఆ పరమేశ్వ రుని పూజలందేమైన విఘాతము సంభవించలేదు గదా ? మీ జననీ జనకులతో బాటు రత్నపుర ప్రజ లెల్లరును సుఖులేనా? రాజ్య పాలనము, గో సంరక్షణ ధర్మయుక్తముగా నడచు చున్నదా ? మరి యీ కన్నీరేల ?'' అని యడిగి రాజ కుమారుని మరింత దగ్గరకు దీసికొని చెవిలో అతి నెమ్మదిగా ''వత్సా! అసుర వినాశ విషయమున నీవు గైకొనిన జీవన సంకల్ప రహస్యము ఎట్లో వాలికి గాని, రావణునికి గాని దెలిసినచో, వారి అనుచరులు మీకు కష్టములు గలిగించుట లేదు గదా ? సదా వికసిత పుష్పము వలె నుండు నా ముద్దుల పవన కుమారుని ముఖ మండలము పై ఈ విషాద రేఖ లేమి''? అనియడుగుచునే అగస్త్య మహర్షి మరియొకసారి రాజకుమారుని హృదయమునకు హత్తుకొనినాడు.

ఇప్పుడు పవనుడు కొంత కుదుట పడి కడు వినయముతో ''నా జీవన నిర్మాతవగు ఓ గురుదేవా ! నే నేముఖముతో ఏమని నివేదింతును ? పర మేశ్వరుని కృప, మరియు మంగళమయమగు మీ శుభాశీర్వాదమువల్ల నా దిన చర్య వేదాను కూలముగ సవ్యముగనే జరుగుచున్నది. పూజ్యులగు నా జనకులు సదావేద విహిత విధిగా ప్రజాపాలన మొనర్చుచున్నారు. ప్రజలు, పశువులన్నియు కుశలమే. రాక్షస రాజగు రావణునితో వాలి మహారాజుకు మైత్రి యున్న కార ణమున వారి ద్వారా మాండలిక రాజ్యములపై ఏ విధముగను ఉపద్రవములు జరుగు ప్రశ్నయే లేదు. ఏలన; మా తండ్రి గారు వానరాధి పతియగు వాలి నను సరించు వాడగుటచే రాక్షస శాసకుల సహాయక శ్రేణి యందే యున్నారు గదా! కాని.... కాని నేడు నేనొక క్రూర వన్య మృగమును దరుముకొని అరణ్యమున ప్రవేశించుచు రాక్షసులచే విధ్వంసితమైన ఋషి వాటికలను గాంచిన తోడనే నా జీవన వ్రత దీక్ష స్ఫురణకు వచ్చినది. అయితే... అయితే ఆ పిదప పవన కుమా రుడు ఏమియును తెలుసు లేక పోయినాడు.

మహర్షి అగస్త్యుడు పవనకుమారు నుని ఓదార్చుచు కుమారా ! ఆఁ అయితే.. ఏమైనది? అని యడిగినాడు. అప్పుడు పవన కుమారుడు మిగుల

భయార్త స్వరమున "ప్రభూ! నేను తమకు ఘోరమగు అపరాధమునే యొనర్చి నాను. గురు ద్రోహిని. తాము నాకు రాక్షస వినాశమును దైవ కార్యమునకై ఆజన్మ బ్రహ్మచర్య వ్రత దీక్షను ప్రసాదించినారు. కాని.... గురుదేవా! మహేంద్ర రాజ కూతురగు అంజనాదేవి సౌందర్య వర్ణను, ఆమె గుణగణములను విని, ఆమె చిత్రపటమును గాంచిన తరువాత నా జీవన వ్రతమునే మరచిపోయినాను. ఆమెతో వివాహ సంబంధమునకు నా స్వీకృతి నిచ్చినాను. దైవ యోగమున నే నిటకు వచ్చి ధ్వస్త ఋష్యాశ్రమముల భయంకర దృశ్యములను గాంచుటతోనే నాకు నా శివ సంకల్ప స్మృతి గలిగినది. ఆ క్షణము నుండియే నా యంతరాత్మ నన్ను ధిక్కరించు చున్నది". అని జెప్పుచు యువరాజు మిక్కిలి అధీరుడై పోయినాడు.

ఈ విషయమునంతయును వినిన తోడనే మహర్షి స్తంభితుడై, కొంత తడవు ధ్యానస్థుడై ఆలోచించి మందహాస వదనములో 'సౌమ్యుడవగు నో పుత్రా! నీ విట్లు కలతచెంద నవసరము లేదు. నీ వచన పాలనము మరొక విధముగా, ఇంతకన్న ఉత్తమ విధిగా నొనర్చ గలవు" అని యనినాడు.

"భగవాన్" ఒకవేళ అది సంభవమగుచో తక్షణమే శలవిండు. ఏ విధ ముగా నైనను నన్ను యీవచన భంగ దోషము నుండి గాపాడుడు" అని విన్న వించినాడు. తోడనే మహాత్ముడగు ఆచార్యుడు శ్రద్ధాళువగు శిష్యుని కన్నులలో కన్నులు గలిపి కడు స్నేహ స్వరమున "కుమారా! ఈశ్వరుడేది జేసినను మన మేలు కొరకే యగును. నీ సాధన తపస్సు మరియు క్షమత యందు నాకిప్పు డును సంపూర్ణ విశ్వాసము గలదు. కుమారా! నీ యీ వ్రతానుష్ఠానముల వెనుక ఆచార్యుల ప్రేరణ, మరియు ఇచ్ఛా శక్తి యే కార్య నిర్వహణ మొనర్చును. **'మాతృమాన్, పితృమాన్, ఆచార్యవాన్ పురుషోవేద'**. అనగా ఏదేని ఒక విశిష్ట వ్యక్తి నిర్మాణమునకు మాతా పితరులు, మరియు ఆచార్యుని సాధన అత్యావస రము. నీ వ్రత దీక్ష యందు 'మాతా పితరుల మనోభావన' యను ప్రశ్నయే లేదు. దీనియందు దీక్షాధికారి ఎప్పటినో, ఎప్పుడో యొకప్పుడు జారి పడుట యనునది ఆశ్చర్యమేమి గాదు. నీవు నీ వ్రతమును విస్మరించుటకు అదే కార

ణము గావచ్చును. జరిగినదంతయును మంచికే యనవచ్చును. కుమారి అంజనా దేవి సౌశీల్య సద్గుణముల విషయము నాకు గూడ తెలియును. ఇక ఇప్పుడు నీవు నీ వ్రత పూర్తికి ప్రతిజ్ఞా పూర్తికి ఒక అభినవ, అత్యధిక తపస్సాధ్యమగు అనుష్ఠాన మొనర్చ గలుగుదువు'' అని తెలిపినాడు.

పవన కుమారుని జిజ్ఞాసను దృష్టియందుంచుకొని అగస్త్య మహాముని ఇట్లు చెప్పసాగినాడు. ''సౌమ్యుడా ! నీ సౌభాగ్య వశమున నీ వివాహ సంబంధ ము సకల సద్గుణ సంపన్నయగు అంజనాకుమారితో జరుగబోవుచున్నది. నా కోరిక ననుసరించి నీవు యీ అవకాశమును రాష్ట్ర సౌభాగ్యమునకు వినియో గించుము. వివాహానంతరము మీ యిరువురును పండ్రెండు సంవత్సరముల వరకు కఠిన బ్రహ్మచర్య వ్రత పాలన మొనర్చుడు. ఈ ఘోర తపశ్చర్యానంత రమే సంతానోత్పత్తికి మీకు అనుమతి లభించగలదు. వత్సా ! మీ వివాహ సంస్కా రము నేను స్వయముగా సంపన్న మొనర్చెదను. ఆ సమయముననే అంజనా కుమారికి నీ యను వ్రత యగుటకు ప్రేరణ లభించగలదు. ఆమె నిశ్చిత రూప మున సకల విధములుగ నీకు యోగ్యమగు సహధర్మచారిణి యని ఋజువు పరచు కొనగలదు. ఈ విధముగా మీ యిరువురి దైవిక సాధనానంతరము అంజనా దేవి గర్భము నుండి జనన మొందు సంతానము నీకన్న అధిక ఉత్తమ పద్ధతితో నీ ఆజన్మ బ్రహ్మచర్య వ్రతమును పాలన మొనర్చి రాష్ట్రము నెడ తన కర్తవ్యము నెర వేర్చ గలుగును. కుమారా ! ఈ ప్రాయశ్చిత్త విధానము నీ కంగీకారమేనా? '' అని యడిగినాడు.

ఈ యుపదేశమును వినిన తోడనే పవన కుమారుడు సంతోషముతో ఎగిరి గంతులు వేసినాడు. మహర్షి యొక్క ప్రస్తావనను విని 'దేవా ! తాము మునిగి పోవుచున్న నన్నుద్ధరించినారు. ప్రభూ ! మీరు ధన్యులు!! నా యంత రాత్మ మరియు పరమాత్మ సాక్షిగ ప్రమాణ మొనర్చు చున్నాను. గృహ స్థాశ్రమ మున ప్రవేశించిన తరువాత ద్వాదశ వర్షముల ఘోర తపశ్చర్యానంతరమే సంతా

నోత్పత్తి క్రియ కుపక్రమించెదను. అంతవరకు పూర్ణ బ్రహ్మ చర్యమును పాలింతును''. అని యువరాజు ప్రతిజ్ఞ యొనర్చగానే ఆ వనప్రాంతమంతయును ధన్య ధన్య శబ్దములతో మార్మ్రోగినది★.

మహర్షి కొంతతడవు ధ్యాన నిమగ్నుడై ఆలోచించి సుదూర కాలపు ఉజ్వల భవిష్యత్తును దలచుకొని తృప్తి పడి యిట్లనినాడు. ''వత్సా! అయోధ్యా మహారాజగు శ్రీ దశరథ సమ్రాట్టు ఇప్పుడశ్వమేధ యజ్ఞము నిర్వర్తించు యత్నమున నున్నాడను విషయము బహుశః నీకు దెలిసియే యుండును. నే నిప్పుడిప్పుడే అట్టి కార్యక్రమమునుండి తిరిగి వచ్చినాను. రాక్షసుల వల్ల సంతప్తులైన దేవతలు, ఋషులు, మునులు అచ్చట నొక సభ నేర్పాటు చేసినారు. ఈ యత్యాచారమును సమాప్త మొనర్చి ధరణీ భారమును తగ్గించుటకు ఋషులు దేవతలు ఒక పథకమును సిద్ధపరచినారు. వశిష్ఠ మహాముని యధ్వర్యమున పుత్రేష్టి యజ్ఞ విశేషజ్ఞుడగు ఋష్యశృంగుని తత్వావధానమున దశరథ మహారాజు అయోధ్యా నగరమున పుత్ర కామేష్టి యజ్ఞము జరుప గలడు. దాని ఫల స్వరూపమున మహారాణి కౌసల్య గర్భము నుండి ఒక మహా పురుషుడు జన్మించ గలడు. మిగతా రాణులు కూడా వీరపుత్రులను గనెదరు.

ఇకనిచ్చట వానర రాజ్యమున క్రొత్త యువతరమును నిర్మించు బాధ్యతను నాపై నుంచినారు.★★ అని కొంతతడవు మౌనముగా నుండి మహర్షి

---

★ యోగిరాజగు శ్రీకృష్ణుని పైతమ సహధర్మిణియగు రుక్మిణీ దేవి గూడ గృహస్థాశ్రమమున ప్రవేశించిన పిదప పండ్రెండు సంవత్సరముల వరకు సంపూర్ణ బ్రహ్మచర్య వ్రత పాలనమునకై మహా ఘోర తపమొనర్చి యుండెనని మహా భారతకారుడు వ్రాసి యున్నాడు.

**బ్రహ్మచర్య మహద్ఘోరం చీర్త్వాద్వాదశవార్షికమ్ ।**
**హిమవత్పార్శ్వమభ్యేత్య యోమయాతపసార్జితా ॥ మ. భా. సౌప్తిక ౧౨-౩౦॥**
**సమాన వ్రతచారిణ్యాం రుక్మిణ్యాం యోఽ న్వజాయత ।**
**సనత్కుమారస్తేజస్వీ ప్రద్యుమ్నో నామమే సుత: ॥ మ.భా. సౌప్తిక. ౧౨-౩౧॥**

★★ దశరథ మహారాజు నిర్వహించిన అశ్వమేధ యాగమున రావణుని పాశవిక బలము పైనాధారపడియున్న సామ్రాజ్యములను ఋషులు, మునులు, దేవతలు గలసి నాశన మొనర్చుటకు

గంభీర స్వరమున నిట్లనినాడు. ''ప్రియ కుమారా ! వశిష్ఠ విశ్వా మిత్ర మహర్షుల నేతృత్వమున నిర్మింపబడనున్న కౌసల్యాతనయుడును, నా సంరక్షణమున అభివర్ధితుడుగా నున్న అంజనా సుతుడును సహచారయోగమున ఒకే శక్తిగా మారి ఆర్య రాష్ట్ర, వానరరాష్ట్ర శక్తుల నొకే మహాశక్తిగా నొనర్చి ఈ యసుర లీలలను సమాప్త మొనర్చి కిష్కింధ, మరియు లంకా నగరములందు ధర్మ రాజ్య సంస్థాపన మొనర్చు దినములను నా కన్నులతో గాంచవలయునను కోరిక గలిగి యున్నాను'' అని పలికినాడు.

---

నిశ్చయించినారు. ఈ కార్య నిర్వహణకై, స్వతంత్ర రాజ్య పరిషత్తు నొక దానిని నేర్పరచినారు. దాని వర్ణన మీ విధముగనున్నది.

**తతోదేవాః సగన్ధర్వాః సిద్ధాశ్చ పరమర్షయః ।**
**తాః సమేత్య యథాన్యాయం తస్మిన్ సదసి దేవతాః ॥**
**అబ్రువన్ లోకకర్తారం బ్రహ్మాణం వచనం తతః ।**
**భగవన్త్వత్ప్రసాదేన రావణో నామ రాక్షసః॥**
**సర్వాన్నో బాధతే వీర్యా చ్ఛాసితుం తం న శక్నుమః ।**
**ఉద్వేజయతిలోకాంస్త్రీనుచ్ఛ్రితాన్ద్వేష్టి దుర్మతిః ॥**
**శక్రం త్రిదశరాజానం ప్రధర్షయితు మిచ్ఛతి ॥**
**ఋషీన్ యక్షాన్ సగంధర్వాన్ బ్రాహ్మణా నసురాంస్తథా ।**
**అతిక్రామతి దుర్ధర్షో వరదానేన మోహితః ॥**
**తన్మహన్నో భయం తస్మాద్రాక్షసాద్ఘోరదర్శనాత్।**
**వధార్థం తస్య భగవన్నుపాయం కర్తుమర్హసి ॥ వా.రా.బాల. ౧౫-౪-౧౧॥**

దేవతలు, గంధర్వులు, సిద్ధులు, చారణులు, ఋషులు, మహర్షులు మున్నగు వారెల్లరును అచ్చటనొక పరిషత్తు నేర్పరచినారు. అందెల్లరును సమావేశమై ''రావణుడు మహా ప్రబలుడు. బలగర్వోన్మత్తుడై అనేకులను నానా కష్టముల పాలు జేయుచున్నాడు. వాని గర్వము నణచు సమర్థుడిప్పుడెవ్వడును లేడు. ఆతడింద్రుని గూడా భయకంపితునిగా జేయుచున్నాడు. ఋషి మునులను, యక్ష గంధర్వులను, బ్రాహ్మణులు మున్నగు వారిని బాధించు చున్నాడు. ఇట్టి భయంకరుడగు రావణుని వధకు మనమేమి చేయవలయు''నను విషయము ఈపరిషత్తునందు చర్చించబడినది.

వారెల్లరును ఏకమై సంఘటిత శక్తితో రావణుని పరిమార్చినచో ముల్లోకములందలి సంక్షోభము తగ్గి సుఖశాంతులు వర్ధిల్ల గలవనియును, ఈ కార్యసిద్ధి కొరకు ఎవ్వరెవ్వ రెట్టి బాధ్యతలను నిర్వహింప వలయునో ఈ సమావేశమున నిర్ణయింపబడినది.

అశ్వమేధము వంటి రాష్ట్రీయ యజ్ఞములందు రాజకీయ సమస్యల నాకాలమునందెట్లు పరిష్కరించుకొన బడుచుండెడివో ప్రత్యక్ష పరిచయమునకై ఈ ప్రసంగ మత్యంత ఉపయుక్తముగనున్నది.



అంజనా పవనుల పరిణయము -

అగస్త్య మహర్షి ఈ విధముగ పలికి ధ్యానావస్థయందు చాల సేపు గడిపి కన్నులు దెరచి చూచినాడు. అంతకుమునుపు తన చరణములందే వినమ్రుడై యున్న పవనకుమారుని గాంచి పులకిత గాత్రుడైన మహర్షి యువరాజు నాశీర్వదించి పుత్తెంచినాడు.

## ౫. అంజనా పవనుల పరిణయము

నేడు మహేంద్ర పురమున మహాకోలాహలముగా నున్నది. యువరాజగు పవనుడు రాజకుమారి అంజన వివాహ వేదికపై సుశోభితులై యున్నారు. వేద మంత్ర చిత్రణ ములతో, ఆదర్శ మహాపురుషుల చిత్ర పటములతో అలంకృతమై యున్న విశాల యజ్ఞమంటపము మధ్య భాగమున యజ్ఞ వేదిక శోభాయమానముగ నున్నది. గురుకులములందలి వందలాది ఆచార్యులు, పురోహితులు, బ్రహ్మచారు లెల్లరును సమ స్థాయిలో పఠించు చున్నట్టి వేద ధ్వని ఒక అభినవ వాతావరణమును సృష్టించినది. ఇందరు సహాయకులున్నను నేడు ఆచార్య ప్రవరులగు అగస్త్య మహర్షుల వారే స్వయముగా పౌరోహిత్య పదవి నలంకరించి యుండిరి. దర్శకుల కిది యొక అపూర్వ కుతూహల పూర్ణ విశేషమై యుండెను.

ఈశ్వర ప్రార్థనానంతరము మహేంద్ర లీలావతుల ద్వార మధుపర్కము, గోదాన విధి, మరియు 'కన్యాదాన' మను విధులు పూర్తి జేయబడిన పిదప వేదిక పై వధూవరులు ఏక కంఠమున,

**ఓం సమంజన్తు విశ్వేదేవాః సమాపో హృదయాని నౌ ।**
**సం మాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీ దధాతునౌ ॥ఋ.౧౦-౮౫-౪౭॥**

''సభా మండపమునందు ఉపస్థితులై యున్న ఉభయ పక్ష మహానుభావులారా ! మీరు మమ్ము వివాహ సూత్రమున ఆబద్ధులగుటకు అనుమతి నీయుడు. ఏలన

౧. మా యిరువురి హృదయములు రెండు విభిన్న స్థానములందలి జలముల వలె ఏకమై పోయినవి. ప్రపంచమందలి ఏ శక్తియు ఇక మమ్ము విడదీయ జాలదు.

౨. ప్రాణ వాయువువలె మే మిరువురము పరస్పరము అత్యావశ్యకమై పోయి నాము. మే మొండొరులము పరస్పరము ప్రేమించుకొందుము.

3. విశ్వవిధాతయగు పరమేశ్వరుడు సమస్త ప్రాణులకు ఆధారమైయున్నాడు. అట్లే మే మిరువురమును ఒండొరుల ప్రాణాధారమై యున్నాము.

౪. సదుపదేశకులు శ్రోతలకు శుభముల గలిగించునట్లే మే మిరువురము కల్యాణమునందు సంలగ్నమగు సంకల్పమును గైకొనినాము అని సభికు లకు మనవి యొనర్చినారు. ఆ పిదప యజ్ఞమహిమార్థము ఒక ప్రదక్షిణ మొనర్చి అనంతరప్రసంగమున అంజనాదేవి ఇట్లుచ్చరించినది.

**ఓం ప్రమే పతియానః పన్థాః కల్పతాగ్ం।**

**శివా అరిష్టా పతిలోకం గమేయమ్ ॥ మన్త్ర.బ్రాహ్మ.౧-౧-౮॥**

మహాముని అగస్త్యులు ముఖముపై చిరునగవుదోప "పుత్రీ! అంజనా!! శ్రద్ధగా వినుము. ప్రతి ఆర్యశ్రేష్ఠుడు వ్రతధారియై యజ్ఞముతో ఉపవీతు (సమాజ సేవావ్రతమున దీక్షితు) డగుచున్నాడు. అవ్రతు(వ్రతహీను) డగు మనుష్యుడు పశుతుల్యుడు. అతడు ఆర్యుడుగాక 'దస్యు' డనబడును. అజ్ఞాననాశము, అన్యాయనాశము, అభావనాశమను నీమూడింటి యందేదేని ఒక వ్రతమును శ్రేష్ఠమానవుడు ధరించును. ఈ వ్రతమే యాతని ధర్మము. పత్ని పతి యొక్క ఈ వ్రతపూర్తి యందు సహాయకురాలై యుండుకారణమున 'సహధర్మిణి' యనబడుచున్నది. సౌభాగ్యవతి అంజనా! నీ విప్పుడు పరమేశ్వరుని చరణము లందు భక్తితో హే ప్రభూ! నీవు నా ప్రియపతియొక్క జీవనవ్రతమున 'అను వ్రత' యగునటుల, పతిలోకము అనగా; పతి వ్రతము ననుసరించునట్టి శక్తి, భక్తి, నిమ్మని ప్రార్థించినావు. పతియాచరించు వ్రతమున సహాయ కారులగు స్త్రీలే 'పతివ్రత' లని యనిపించుకొనెదరు. పుత్రీ! నీవు నిష్కల్మష హృదయముతో పరమేశ్వరుని ప్రార్థించుము. ఆయన నీ కవశ్యముగా కర్తవ్య పాలనా శక్తిని ప్రసా దించగల" డని ఉపదేశించినాడు.

మరొక మంత్రము యొక్క చివరి చరణము "**వీరసూఃదేవృకామా**"

అను దాని వ్యాఖ్య నొనర్చుచు మహర్షి మళ్లీ అంజనాదేవిని సంబోధించుచు "పుత్రుడు వీరపుత్రుడగునప్పుడే మాత యొక్క మాతృత్వము సఫలమగుచున్నది. వీరత్వ మనునది అనేక రకములుగ నుండును. ధర్మ వీరత్వము, కర్మవీరత్వము, సత్య వీరత్వము, శూర వీరత్వము, దాన వీరత్వము, మున్నగు అనేక వీరత్వము లుండును. రాష్ట్ర నిర్మాణము నందు ప్రతిదానికి విశిష్ట మహత్త్వము గలదు. కాని దేశము అన్యాయ పీడితమగునపుడు జాతి, దేశము, కర్మవీరుడు, శూర వీరుడగు పుత్రుని ప్రసాదించుమని నిజమగు మాతృదేవితో అభిలషించును. అట్లు గాకున్న స్త్రీ సంతాన వతి యగుటకన్న గొడ్రాలై యుండుటయే చాల మంచిది" అని తెలిపినాడు.

రాష్ట్రభృత్ హోమము, జయాహోమము, మరియు లాజాహోమ విధులు నిర్వర్తించిన యనంతరము మహత్వ పూర్ణమగు సప్తపది★. విధి యందు మహర్షి '**ప్రజాభ్యః పంచపదీభవ**' అను వ్యాఖ్య యందు వధూవరుల నిరువు రునుగూర్చి యిట్లు తెలిపినాడు. ఇచ్చట సంతానమునకు 'ప్రజా' శబ్దము ప్రయోగించబడినది. "**ప్రకర్షతా పూర్వకం జాయతే ఇతి ప్రజాః**" దేశ సమృద్ధి, శ్రేయస్సును దృష్టి యందుంచుకొని రాష్ట్రమునకేలాటి వీరులవసరమో ఆ లోటును పూర్తి చేయుటకు సంపూర్ణ మనోబలము, సాధన తపస్సుల యనంతరము, తగిన సంతానము నుత్పన్న మొనర్చు తల్లిదండ్రులే 'ప్రజా' అని యనిపించు కొనగలరు. మీరుభయులు వ్రత పూర్ణమగు గృహస్థ జీవన ధర్మము నీ విధము గనే దృఢ సంకల్పులై నెరవేదరని ఆశిస్తున్నాను. అప్రయోజకులగు అనేక సంతా నము గనుట కన్న గుణవంతుడు, సుయోగ్యుడునగు ఒకే పుత్రుని గనుట అనేక రెట్లు శ్రేయస్కరము. సద్ గృహస్థుని ద్వార దేశమున కిదియొక సర్వోత్కృష్ట మగు సేవయే యగును.

---

★ ఈ విధియందు గృహస్థ జీవన సాఫల్యము కొరకు ఏడు సూత్రములు తెలుప బడినవి. వివరముగ తెలిసికొనుటకు 'సంస్కారచంద్రిక లేక సుమంగళి' ని చదువుడు. వైదిక వివాహ సంస్కారములను చూడుడు.

ఏకోఽపి గుణవాన్ పుత్రో నిర్గుణైశ్చ శతైర్వరః ।
ఏకశ్చన్ద్రస్తమోహన్తి న చ తారాః సహస్రశః ॥ చాణక్యనీతి ౪-౬ ॥

ఆశీర్వాదమునకు గూడ ఋషిమునులు ఈ విధముగనే మహత్వపూర్ణమగు సందేశము నిచ్చినారు. సంస్కారము యొక్క సకల విధులను ఇట్టి తన్మయత్వము, సాత్వికత భావ గర్భితశైలిలో నుపదేశించినారు. ఇది జరుగుచున్నంత కాలము సమస్త జనులు చిత్రప్రతిమలవలె తల్లీనమై యుండిరి. వధూవరులతో బాటు అన్య స్త్రీ పురుషులెల్లర ఆత్మలును సుసంస్కారితము మరియు సువాసిత (సౌగంధిత) ములగు చుండెను. సంస్కారము పరిసమాప్తి యగుటతోడనే నలు దిశల నుండి ధన్య ధన్య యను శబ్దములు మార్మ్రోగినవి.

## ౬. ఆశ్వాసనము

ప్రహ్లాద విద్యాధర మహారాజు తన బంధు మిత్రులు, పురజనులు, పరిజనులు సహితముగా కొడుకు కోడలిని దీసికొని రత్నపురి ప్రవేశించినాడు. రత్నపుర వీధులందెల్లెడలను మంగళ గీతములు, విజయ వాద్యములతో కోలాహలముగా నుండెను. వధూ స్వాగత శుభ సమయమున విద్వాంసులు, బ్రాహ్మణులు, ముత్తైదువులు పుష్పవర్షములతో వధూవరుల నాశీర్వదించినారు. సర్వ సద్గుణ సంపన్న. అతిలోక సౌందర్యరాశి యగు కోడలిని వడసి మహారాణి కేతుమతి ఆనందమున మునుకలువేసినది.

క్రమ క్రమముగా దినములు, వారములు, మాసములు గడచి పోవు చుండెను. కాని అంజనాదేవికి పవనకుమారుని దర్శనము దుర్లభమైనది. తనతో నేమైన అపరాధము జరిగనదేమోనని అంజనాదేవి చింతాసముద్రమున మునిగినది. పితృ గృహము నుండి తనతో వచ్చిన తన ప్రియసఖియగు 'వాసంతి' తో ఈవిషయము ప్రస్తావించినది. కారణమడిగినది. అదే సమయమున మరొక దాసి ఒక జాబును (లేఖ) దెచ్చి యిచ్చినది. కంపిత హస్తములతో అంజనా దేవి దాని దెరచి చూచినది. అందిట్లు వ్రాయబడి యున్నది.

''దేవీ ! స స్నేహప్రియా........ !! మొట్టమొదటనే నేను నా కఠోర

వ్యవహారమును క్షమింపగోరుచున్నాను. నిశ్చయముగా నాయీ వ్యవహారము వల్ల నీకు వర్ణింప రాని కష్టము గలిగి యుండును. దీని వెనుకనున్న సంపూర్ణ విషయములు సమయానుకూలముగ స్వయముగ నీవే తెలిసికొనగలవు. మన మిప్పుడు పండ్రెండు సంవత్సరముల కఠిన బ్రహ్మచర్య వ్రతమును పాలించి ఆదర్శ వంతమగు నొక జాతి రత్నము (సంతానము) ను దేశమున కర్పించ వలసియున్నది. నేనీ వ్రతమున దీక్షితుడనై యున్నాను. పూజ్య అగస్త్య మహర్షులు మన వివాహ సమయమున నీకును ఈ వ్రతాచారమునకై సంకేత రూపమున ప్రేరణ నిచ్చినారను విషయమును నీవు విస్మరించ లేదని తలతును.

దేవీ ! నా సాధన స్ఖలితము గారాదు. పండ్రెండు సంవత్సరముల వరకు మనము గలిసికొనరాదు. కావున నే నిట్టి సరళ మార్గము ననుసరించినాను. నాకు నీపై పూర్ణ విశ్వాసముగలదు. దేవీ! ఈ ధర్మ సాధనమున ప్రసన్న హృద యముతో నీవు నా నిజమగు సహధర్మచారిణివిగా రాణించుదువు గాక. – ఇట్లు: కఠోర హృదయుడగు నీ పవనుడు.

పత్రమును జదివిన తోడనే అంజనాదేవి చేతనారహితమై పోయినది. ఆమెకు భూమి కంపించు చున్నట్లు తోచినది. కన్నులు చీకటులు గ్రమ్మినవి. సఖియగు వాసంతి గబాలున పట్టుకొనకున్నచో పడిపోయెడిదే. కాని ఈ స్థితి యెంతో కాలముండలేదు. ధైర్యము, కర్తవ్యతా పాలన బుద్ధి ఆమెకు సహాకరించి నవి. పత్రమున కీ విధముగా ప్రతివ్రాసినది.

ప్రాణాధిక్యుడవగు నా జీవన సారమా ! పాదాభివందనములు. తాము స్వయముగా తమనే 'కఠోర హృదయుడ' ననుచు క్షమాయాచన శబ్దములను వ్రాయుచు స్వయముగా తమ జీవన సహచారిణిని దోషిణిగా ఏల చేసి వేయు చున్నారు ? నా హృదయనిధీ ! నేను మీ ఛాయామాత్రమునే తమ వ్రతాను వర్త నమే నా సర్వోత్తమ ధర్మము. ఇందుకు మహర్షి మననే పాత్రులుగా నెన్నుకొ నుట సుకృతము. ద్వాదశ వర్షములు ఈ కఠిన వ్రతమున సఫలుర మై గురు

మేవుల గీటు రాయిపై నీట దేలి ఆయన రాష్ట్రయజ్ఞమున సహభాగులమైనచో నిశ్చితముగా మనకిది పరమ సౌభాగ్యమే గాగలదు. తాము నా విషయమున నిశ్చింతగా నుండుడు. పరమ పితా పరమేశ్వరుడు తమ సాధనను సఫల మొనర్చు గాక. ఐనను, పండ్రెండు సంవత్సరముల మరుదినమే తమ దర్శన భాగ్యము లభించని స్థితి నాకు దుస్సహనమే యగునను విషయమును మరువ కుందురు గాక. ఇట్లు : తమ ఛాయాగామిని అంజన.

సమయమనునది ఎవ్వరి విషయమునను ఆగి యుండునది గాదు. ఒక్కొక్కటిగా పదకొండు సంవత్సరములు గడచి పండ్రెండవ వత్సరము గూడ సమాప్త మగుటకు కేవలము రెండు మూడు నెలలు మాత్రమే మిగిలి యుండెను. ఇంతలోనే రాజ్యమునందొక భాగమున విద్రోహము ( తిరుగుబాటు) చెలరేగిన సూచన లందినది. స్వయముగా మహరాజే దాని నణచుటకు బయలు దేర నుండగా యువరాజు పవనుడు నమ్ర స్వరమున ''మహరాజా'' నేనుండగా తామీ తిరుగుబాటు నణచుటకు బయలుదేరు అవసరమేమి ? తామాజ్ఞాపించిన తక్ష ణమే బయలు దేరి విద్రోహ కారుల నాశనమొనర్చి తిరిగి వచ్చెదనని'' మనవి జేసుకొనినాడు.

శత్రు దమన మొనర్చి నెల పది పూటలలో తిరిగి రావచ్చునని తలచిన పవన కుమారునకు అది సాధ్యము గాలేదు. ఈ విద్రోహము జరిపినది మరె వరో గాదు. వానరజాతి యువతరమే. ఇది వారి ఆంతరంగిక విప్లవము. మనస్సు నందు పవన కుమారుడు గూడా యువతరము పక్షముననే యుండెను. కాని మహరాజున కిపుడే ఈ విషయము దెలియగూడదు. కావున నాతడు ద్వంద్వ మున నిరుకు కొనినాడు. దండించుటకు మారుగ వారిని సమాధాన పరచు ప్రయత్నము నొనర్చు చుండెను. కావుననే యాతని కెంతో సమయము పట్టినది.

పవనకుమారుని వివాహమై నేటికి పండ్రెండు సంవత్సరములు పూర్తియై వ్రత సాధన కూడా పూర్తియైనది. కాని నేడు కూడా అంజనాదేవి వద్దకి చేర జాలకపోయినాడు. సూర్యుడు తన [illegible]నాధికారమును చంద్ర దేవునిపరమొనర్చి

అస్తాద్రి చాటునకనుమరుగైనాడు. రాత్రియైనది. సైనికులెల్లరును నిద్రించు చుండిరి. రాజకుమారునికి కునుకు వచ్చుట లేదు. ఆతడింకను మంత్రితో మంతనము లాడుచునే యుండెను. ఇంతలో ఒక దిశనుండి ఏదో యొక విచిత్ర మగు శబ్దము వినిపించినది. రాకుమారుడు కోరగా మంత్రి ''మహారాజ కుమారా! దీనిని చక్రవాక (జక్కన) పక్షియందురు. ఇది విశేషముగానీటి యం దేయుండును. పగలంతా పెంటి, పోతు ( ఆడ, మగ) పక్షులు కలిసి యుండును. కాని రాత్రులందివి వేరై పోవును. ఇది ఆడ పక్షి ధ్వని భర్త (మగపక్షి) వియోగ మును సహించలేక పిలుచు చున్నది. ఇవి రాత్రులందు ఒండొంటిలో కలువ గూడదని ప్రకృతి నియమము గలదు'' అని తెలిపినాడు.

ఇది వినగానే పవనుని హృదయము కంపించి పోయినది. రోమాంచ మైనది. కేవలము ఒక్క రాత్రి వియోగముచే చక్రవాకి ఈ దశననుభవించు చుండిననిక అంజనాదేవి గతి యేమగును? ''పండ్రెండు సంవత్సరముల తరు వాత మరునాటి ఒక్క దినమైనను అసహ్యమేయగు'' నను అలనాటి పత్రము సంగతి జ్ఞప్తికి రాగా పవనకుమారుండు కంపించిపోయినాడు. వ్యాకులుడైనాడు. కాని యేమి చేయ గలడు? చివరకు తన మనోవ్యాకులతను మంత్రి కెరిగించి నాడు. మంత్రి తక్షణమే ఆతని అంజనా భవనమునకు జేర్చు ఏర్పాట్లు నొనర్చి నాడు.

కాని పవనకుమారుడు ''నే నిపుడు గృహమున కేగినచో జనకులేమి తలచెదరు ? మిత్రవర్గము నన్ను గాంచి నవ్వుదురు గదా '' అని తన యభ్యంత రమును దెలిపినాడు. అందుకు సుబుద్ధి యగు మంత్రి ''మీరెవ్వరినీ గలసి కొను నవసరము లేదు. రెండు మూడు దినములు అంజనాదేవితో గడిపి నేరుగా ఇచ్చటికి చేర రండు. నే నంతవరకు పరిస్థితులను అదుపు నందుంచు కొందును''. అని తెలిపి పంపించి నాడు.

## ౭. అంజనాదేవి అగ్ని పరీక్ష

అంజనాదేవి నిరీక్ష ణ ఘడియలు చిత్తము నుత్తల పరచి భరింప రాని

విగ నుండెను. రాత్రి మూడవ యామమున నామె సంపూర్ణ నిరాశాపరురాలై యున్నంతలో అకస్మాత్తుగా తన సమీపమున పవనకుమారుని గాంచి అపరిమితము హర్షాతిరేకము నొందినది. పవనుడు అచ్చట రెండు దినములు గడిపి తిరిగి పోవునపుడు తనకు గర్భస్థితి నిశ్చయమని తలచిన అంజనాదేవి అతి భయావహ స్వరమున ''స్వామీ'' మీరు మీ మాతాపితరుల నవశ్యముగా దర్శించుకొని పొండు. సమర క్షేత్రమున మీ కింకెంత కాలము పట్టునో ఎట్లు చెప్పగలము'' ? అని విన్నవించినది. కాని సంకోచ వశమున పవనకుమారుడీ విషయము నందంతగా ధ్యానము నీయలేదు. దాని భయంకర పరిణామము నెడ ఆతని చిత్తము చేరనే లేదు. త్వరలోనే తాను తిరిగి రాగలనని తలచినాడు. తన వ్రేలి యుంగరమును అంజనాదేవికిచ్చుచు ' ఎవ్వరైన నేమైన యడిగినచో ఈ యంగుళీయకమును జూపి తాను వచ్చిన విషయమును తెలుప వలయును'' అని చెప్పి వెళ్ళిపోయినాడు.

పవనుడచ్చటికి వెళ్లిన పిదప యుద్ధ కార్యములందు అధికముగా చిక్కుకొని పోయినాడు. శత్రు విజృంభణము అధికమైనది. వారిని సంపూర్ణముగ దమన మొనర్చుట యందు సంలీనము గావలసి వచ్చినది. అచ్చట అంజనాదేవికి గర్భ చిహ్నములు పొడసూప సాగినవి. మహారాణి కేతుమతి కీ సూచన యందగానే అంజనాభవనమునకు వచ్చినది. అంజన తన యత్తగారికి సర్వ సంగతులు నివేదించి పవనుని యంగుళీయమును జూపినది. కాని తన పుత్రుడు ఈవిధముగా చోరునివలె వచ్చి ఎవ్వరికిని దెలియకుండా వెళ్ళిన విషయము పై నామెకు విశ్వాసము గలుగలేదు. **''ఈశ్వరేచ్ఛా బలీయసీ''** నిరపరాధియగు అంజనాదేవి అవమాన పూర్వకముగా నిర్వాసిత మొనర్చ బడిన నిండు దుఃఖముతో నామె మాతా పితరుల గృహము జేరినది. కాని అచ్చటనూ 'ప్రవేశ వర్జిత' ప్రకటనయే యెదురైనది.

**''రాష్ట్రే వయం జాగృయామ పురోహితాః''** ఈ పవిత్ర వేద వచన విజ్ఞాని యగు మహర్షి అగస్త్యున కీ విషయము దెలియగనే అంజనాదేవి సంర

షణ విషయమున చక్కని యేర్పాట్లను జేసినాడు. అపరిచిత మార్గమున అంజనాదేవి తన ప్రియ సఖి యగు వాసంతిక తోడుగా కన్నీటితో జలకమాడుచు నడుచు చుండెను. కొంత దూరము ముందుకు ఏగగనే మార్గ మధ్యమున ఒక వృద్ధ ఋషి కలిసినాడు. ఆతని ద్వార స్వాంతన వచనములు విని కొంత ఓర్పుతో ధైర్యము దెచ్చికొనినది. ఇది యంతయును అగస్త్య మహర్షి వ్యవస్థయే' అని తెలిసిన పిదప ఆమె సంపూర్ణ నిశ్చింతతో ఆ వృద్ధపురుషుని వెంటనేగినది. అనతి దూరమునందే ఆ యరణ్యమున వారి నివాసమునకై సకలవ్యవస్థలతో చక్కని యాశ్రమ మొకటి నిర్మించి యుంచబడినది. ఇచ్చట అంజన తన ప్రియసఖియగు వాసంతికతో నిశ్చింతగా, సుఖముగా కాలము గడుపసాగినది. మహర్షి యనుగ్రహమున తన దుఃఖనిలయమగు కాళరాత్రి గడచిపోయినట్లు అనుభూతి నొందసాగినది.

యువరాజు పవనకుమారుడు కార్యసిద్ధినొంది రాజధానికి తిరిగివచ్చిన యనంతరము ఆతనికి అంజనాదేవి నిర్వాసిత సమాచారము దెలియవచ్చినది. తనపై ఆశనిపాతమైనట్లు తోచినది. తక్షణమే మహేంద్రపురమున కేగినాడు. అచ్చటినుండియు నిరాశాపరుడై తిరుగుముఖ మగునపుడాతనిస్థితి సంపూర్ణముగా పిచ్చివానివలె నుండెను. రాజ్యమందలి ప్రతి మూల అంజనాదేవి యన్వేషణ మొనర్చినాడు.

## ౮. హనుమజ్జననము

మహర్షి అగస్త్యులు నేడాశ్రమమునకు వచ్చినారు. స్వర్ణ ప్రతిమవలె ప్రకాశించు నిష్కళంక చంద్రుని వలె జ్యోత్స్నలు విరజిమ్ముచు శిరమును వంచి చింతానిమగ్నముద్రలో నున్న అంజనాదేవిని జూచినారు. సమీపముననే ఉదాసీనయై కూర్చుండి యున్న ఆమె ప్రియసఖియగు వాసంతికను గూడ గాంచినారు. ఆ దృశ్యమును గాంచిన మహర్షికిని కొంత బాధఅనుభూతి నొందక తప్పినది గాదు. తరువాత అతి ప్రశాంతము గా మధుర స్వరమున ''పుత్రీ ! నీ వేమాత్రమును చింతించ వలదు. నీ యీ కష్టము లన్నియును నా యోజన యందే

యొక భాగమే. మీ ద్వాదశ వర్ష కఠిన బ్రహ్మచర్య వ్రతము నా నిర్దేశము ప్రకారమే జరిగినది. దీని రహస్యము నీ వేమైన నెరుగుదువా''? అని ప్రశ్నించినాడు.

అంజనాదేవి తన పతిదేవుని ద్వారా పంపించబడి, అతి జాగ్రత్తగా దాచి యుంచిన పత్రమును ఋషివర్యుల చేతనుంచినది. మునివర్యులు చిరునగవుతో బిడ్డా ! ఆ సమయమిపుడు వచ్చినది. పవనకుమారుడు పత్రమున విషయములు వివరముగా వ్రాయకుండ యుండి మంచిపనిచేసినాడు. పొరపాటుననది అన్యుల చేతబడినచో ప్రమాదమే గదా ! తరువాత వాసంతిక వైపు సంకేత మొన ర్చుచు వాసంతి కుమారిని నేను చక్కగా నెరుగుదును. మీ యిరువురి శరీరములు వేరు గాని ఒకే ప్రాణముగ నున్నారు. ఆమె యెదుట ఎట్టి రహస్యములు చర్చించుట యందును నాకెట్టి యభ్యంతరము గాన్పించదు. నిజమే గదా అంజనా!!.

గురుదేవా ! తాము సెలవీయ దలచిన దెల్లయును నిస్సంకోచముగా దెలుపుడు. మా యిరువురి యందెట్టి భేదము లేదని అంజనాదేవి అభయ మిచ్చి నది. తరువాత మహర్షి పుత్రీ ! ఇది ఇరువది ఐదు సంవత్సరములకు పూర్వ విషయము. పవన కుమారుని వయస్సపుడు దాదాపు ౧౪, ౧౫ సంవత్సరము లదై యుండును. ఆనాటి సంధ్యాసమయమున నేనేకాంత స్థలమున గూర్చుండి ఒక వైజ్ఞానిక క్రియాన్వేషణము గూర్చి ఆలోచించు చుంటిని. ఇంతలో నొక వైపు నుండి అతి బాధాకరమైన ఆక్రందనములు విన రాసాగినవి. అంతకంతకు ఆ కోలాహలము పెరిగి పోయినది. హతులగుచున్న వ్యక్తుల యాక్రందనలు ఆశ్రమ వాతావరణమును బీభత్స మొనర్చి వేసినది. నాకిట్టి విషయములు క్రొత్తవి గావు. కాని పవన కిశోరుని లే హృదయము దానిని సహించ లేకపోయినది. విద్రోహ ప్రేరణ విజృంభించినది. ఆశ్రమ నియమములకు విరుద్ధమగు విషయమును సైతము మరచి యాతడు తక్షణమే నా యేకాంత స్థలమునకు పరుగెత్తుకొని వచ్చినాడు. భయాందోళనల దోపు నాతని ముఖమును గాంచి ధైర్యమును గలిగించి కారణమడిగినాను. కొంత తేరుకొని యాతడు ''గురు దేవా! ఈ యార్తనాదము లేమి ? నా చెవుల పొరలు పగిలి పోవుచున్నవి.'' అని యడిగినాడు.

పుత్రి అంజనా ! పవనకుమారుని ఈ భావోద్రేక జిజ్ఞాసను గాంచి
తోడనే ఈశ్వరు డింత కాలమునకు నా యాత్మ వేదనను వినినాడు. నాకు గా
లసిన క్షాత్ర శక్తి నేడు లభ్యమైన'' దని తోచినది. అప్పుడు నేను పవనునితో
''బిడ్డా ! మాకిది క్రొత్త విషయమేమి గాదు. నీ విచటికి వచ్చిన పిదప ఈ క్షేత్రము
లందిది మొదటి సంఘటననే యని యనవచ్చును. ఆ యాక్రందనలు వచ్చు
ప్రాంతములందే చిన్న చిన్న ముని ఆశ్రమములు గలవు. వారచ్చట కందమూ
ఫలాదుల భుజించుచు వాన ప్రస్థ జీవనమున స్వాధ్యాయము, సత్సంగము, యోగా
భ్యాసము మున్నగు సాధనల నొనర్చు చుందురు. అచ్చటికి కొంత దవ్వున
రాక్షస రాజు లంకాధీశుడగు రావణుని సైనిక స్కంధావారములున్నవి. వాన
మహారాజగు వాలితో రావణుడొనర్చి కొనిన సంధి ననుసరించియే యా సే
నివేశము లచ్చట నున్నవి. రాక్షసులప్పుడప్పుడు పన్నులు రాబట్టుకొను మిష
ఈ ఋష్యాశ్రమములపై బడి వానిని ధ్వంసమొనర్చుచు వారిని అనేక రీతు
పీడించు చుందురు. నేడట్టి దుర్దినమే సంప్రాప్తమైనదని తోచుచున్నది. అ
విన్నంతనే ఆతని లేత హృదయమున 'భావావేశ' మను ఒక తుఫాను చెలరే
నది''. అని తెలిపినాడు.

ఇది వినిన తోడనే అంజనాదేవి హృదయమున గూడ భావోద్రేకము
ఉప్పొంగినది. అప్పుడామె ''గురుదేవా ! క్షంతవ్యురాలను, ఐతే మీ యీ వైజ్ఞా
నిక సంశోధనలు, పరీక్షలు, మున్నగు వాని వల్ల నేమి లాభము? విజ్ఞానోద్దేశము
వేదజ్ఞాన సంరక్షణమే యని తామే సెలవిచ్చితిరిగదా ! కాని యది ఈ వేద జ్ఞా
సంవాహకులు, సంరక్షకులునగు, ఋషులకే నష్టము గలిగించు చున్నది గదా
ఐతే ఈ సద్ జ్ఞానమును గాపాడలేని విజ్ఞాన పరిశ్రమల ఉపయోగమేమి ? అ
యడిగినది.

అందులకు మహర్షి ''బిడ్డా, మేము బ్రాహ్మణ ధర్మదీక్షను గొనినాము
జ్ఞాన విజ్ఞానముల సమున్నతి, దాని వికాసమే మా ధ్యేయము. మా వైజ్ఞానిక ఉ
లబ్ధియొక్క ఉపయోగమునకై మేమొక క్షత్రియాత్మకై వెదకు చుంటిమి'' అ

తెలిపినాడు. పవనుడా క్షణముననే "గురుదేవా! మీ యీ బృహద్యజ్ఞమున నే నాహుతి యగుటకు సంసిద్ధముగా నున్నాను. ఆజ్ఞాపించు" డని యనినాడు.

కుమారీ! ఇది వినగానే నా యానందము అవధులు దాటినది. నేను మరింత గంభీర స్వరమున పవనునితో "ప్రియ పుత్రా" నాకీ మహత్కార్యము నకై ఒక మహావీరుడు అవసరమై యున్నాడు. ఈ మహావీరుడన నెట్టివాడో తెలియునా!

**"మత్తేభ కుంభదలనే భువిసన్తి శూరా, కేచిత్ప్రచండ మృగరాజ వధో ఉపిదక్షాః**

**కిన్తు బ్రవీమి బలినాం పురతః ప్రసహ్య కందర్ప దర్పదలనే విరజామనుష్యాః**
॥ భర్తృహరి॥

" ఒక రాజు, మహారాజు, లేక సామ్రాట్టుపై విజయము సాధించుట కేవలము వీరత్వమే యగును. కాని కామదేవుని శతాధికాకర్షణలపై విజయము సాధించుట యనునదే యథార్థమగు మహావీరత్వము". అని నేను దెలుపుట తోడనే పవన కుమారుడు తాను వివాహమునే జేసికొనననియు, ఆజన్మ బ్రహ్మ చారిగ నుండి అసుర నాశన మొనర్తుననియు మహావ్రత దీక్షను గైకొనినాడు. కాల ప్రభావమును కొనుము, లేదా మరో విధముగానే యనుకొనుము. పవనుని యీ దీక్షా సంకల్పము భావావేశమే అధికముగా నుండెను. నీ చిత్ర పటమును గాంచిన పిదప నీ సౌందర్య, సద్గుణ ప్రభావ మాతని వ్రతదీక్షను మరపింప జేసినది. కావుననే అతడు నీతో వివాహ మాడుటకు తన సమ్మతిని ప్రకటించినాడు. విధ్వంసమైయున్న ఋష్యాశ్రమముల గాంచగనే తన వ్రతదీక్ష స్ఫురణకు రాగా తత్తర పాటున తక్షణమే యతడు ప్రాయశ్చిత్తమునకై నా వద్ద కేతెంచినాడు. విష యము వినిన తరువాత నాకేమియు తోచలేదు. కాని దేవుని కృప వల్ల కొంత సేపటికి నాకొక ప్రేరణ లభించినది. మీ రుభయులు ద్వాదశ వత్సరములు కఠిన బ్రహ్మచర్య వ్రతమును పూర్తి జేసిన యనంతరము ఒక మహా వీరునికి జన్మ నిచ్చునట్టి విధానమును దెలియ పరచినాను.

''కుమారీ ! ఇదియే మీ సంయమ సాధన యొక్క సంక్షిప్త రహస్యము. నీ యీ నిర్వాసితము (ఎడబాటు) వెనుక గూడ నా యోజనయే గలదు. నా సంకేతము వల్లనే వానర యువక వీరులు కొందరు విద్రోహమునకు పూను కొనినారు. ఈ విద్రోహము నణచు కార్యమున పవన కుమారుడు కొంతకాలము నీకు దూరముగా నుండు నట్లు జేసితిని. ఈ నీ నిర్వాసితము వల్ల రెండు మహా లాభములు గలవు. మొదటిది : గర్భగత బాలకుడు పారివారిక (కుటుంబ) జీవనమునకు మారుగ వ్యామోహ, మమతారహిత సంస్కారములను పొందగలు గును. రెండవది : కఠోర శ్రమ సాధ్య ఆశ్రమ జీవన సంస్కారములతో సంస్క రింప బడగలడు. గర్భావస్థ, దాని యనంతర మొక సంవత్సర కాలమునందలి సంస్కారములు గర్భస్థ బాలకుని జీవనము నందు చెరగనివిగా నిలిచిపోవును. ఆ పిదప అనతి కాలములోనే పవనునితో నీ సంయోగము జరుగ గలదు''. అని మహర్షి తెలుపగనే అంజనాదేవి ప్రసన్న హృదయురాలై నిశ్చింతతో మహర్షికి అనేక ధన్యవాదము లర్పించినది.

అంజనాదేవి ప్రసవ సమయ మాసన్నమైనది. కొన్ని దినములలోనే మహర్షి అగస్త్యుని వ్యవస్థలో ఆ పవిత్రాశ్రమమున మన చరిత్ర నాయకుడు, పవిత్ర భారత మాత యశస్వి పుత్రుడు, ఆర్య సంస్కృతి కీర్తిస్తంభమగు మహావీర హనుమంతు డొక పుణ్య దినమున జన్మించినాడు. **జనన సమయమునందే మంచి దృఢకా యుడు, మేధావిగా దోచుచుండెను.** ఆ బాలకుని గాంచిన మహర్షి ఆనంద ముతో నిండి పరమేశ్వరునకు కోటి కోటి ధన్యవాదములర్పించినాడు. తన ప్రయోగము, ఫలవంతమై లక్ష్యము వైపు పురోగామి యగుచున్నందుకు మురిసి పోయినాడు.

**చైత్ర బహుళ పుష్య నక్షత్రయుక్త మంగళ వారమున ప్రభాత సమయ మున హనుమంతుడు జనన మొందినాడు.** బాలకుని దీర్ఘ హనువు (గడ్డము, గదువ) ఒక విశేషాకర్షణ కేంద్రముగా **యా**తని మహావీరత్వమునకు, స్వాత్మాభి మానమున కొక చక్కని చిహ్నముగా **నుం**డెను. దీని యాధారముననే మహర్షి యీ బాలకుని నామకరణము హనుమంతుడు (గదువ గలవాడు) అని నిశ్చ యించినాడు.

## ౯. మాతా నిర్మాతాభవతి

బాలకుడు జననీ జనకులగు అంజనాపవనుల ద్వాదశ వర్షముల ఘోర తపస్సు, మరియు ఎడతెగని సాధనలకు ప్రతి మూర్తిగా నుండెను. మహర్షి యభిమతముగనే బాలకుడు సంస్కరింప బడవలయుననునదే అంజనాదేవి ప్రగాఢ వాంఛ. ఆమె తన సాధనాస్థలమున త్యాగులు తపోధనులు, బ్రహ్మచర్య వ్రతులు మొదలగు ఆదర్శ వీరుల చిత్రముల తన శయన స్థలమందును నుంచు చుండెడిది.

**''మమ పుత్రా శ్శత్రుహణా'' వయంజయేమ''**

**''బ్రహ్మచర్యేణ తపసాదేవా మృత్యుముపాఘ్నత''**

**'' వయం తుభ్యం బలహృతః స్యామ''**

**''మాతాభూమిః పుత్రోఽహం పృథివ్యా''**

**'' ఉపసర్పమాతరం భూమిమ్''.**

మొదలగు మాతృదేశభక్తి, బ్రహ్మచర్య మహిమ, మరియు కర్తవ్య ప్రేరకములగు వాక్యములను సుందరమగు చక్కని యక్షరములలో వ్రాసి యుంచుకొనుచుండెడిది. గర్భవతిగా నున్న కష్టకాలమందును, అవమానము, మోసము, మానసికాందోళనముల స్మరణనైనను దరిజేరనీయక గర్భస్థ బాలకునికి ఆత్మప్రశంస ద్వారా వీరత్వ భావములతో సంస్కరించుటను మరువలేదు. ఒక మహావీరుని మహామూర్తియే యామె మనోక్షేత్ర విషయమై యుండెను. తన కుమారుడు సకల సద్గుణ రాశి, వీర ప్రవరుడు గావలయుననియే ఆమె సదా తలపోయుచుండెను. అగస్త్య మహర్షి ఆశ్రమమునకు ఎపుడైన వచ్చుట తటస్థించిన అంజనాదేవిని సమీపమున గూర్చుండ బెట్టుకొని 'వైదిక వీరగర్జన' మను పవిత్ర వేద మంత్రములతో నభిమంత్రించు చుండెను. దైనిక యజ్ఞమునందు సామాన్య ఆహుతులతో బాటు ఈ మంత్రములతో విశేషాహుతలును అంజనాదేవితో నిప్పించు ఏర్పాటు గూడ జేసియుండెను.

గర్భస్థ శిశువు పుంసవన, సీమంతోన్నయన సంస్కార విధులు ఆశ్రమమునందే నిర్వహింపబడియుండెను. అంజనామాత భోజనాదులు పరమ సాత్వి

కము. దినచర్య అతి నియమపూర్వకము. నివాస స్థలము పరమ స్వచ్ఛము, నిరాడంబరముగా నుండెను. పరిస్థితియే ఆమెకు భూ శయనము, కఠోర జీవనము నభ్య సింప జేసినది. ఈ కష్టములన్నియు అంజనాదేవి గర్భగత బాలకుని జీవన వికాసమునకు వరదానమే యైనవి.

అంజనాదేవి వైదిక ధర్మమున సుశిక్షిత మహిళ. ఆమెకు తన కర్తవ్య బాధ్యతల జ్ఞానము చక్కగ నుండెను. ఆమె కేవలమొక కన్నతల్లియే గాక సకల మాతృత్వా దర్శములను సఫల రూపమున ప్రవేశ పెట్ట దలచినది. "**మాతా నిర్మాతా భవతి**" అను వైదికా దర్శము నామె సదా మనస్సు నందుంచుకొనినది. సుసంతాన నిర్మాణము గార్హస్థ్య ధర్మమున సర్వోత్తమోపలబ్ధిగా పరిగణింపబడుచున్నది. తమ సంతతిని ఉత్తమ నాగరికులతో జన్మభూమి ప్రియులుగా నిర్మించుటయే సర్వోత్తమ సేవగా నెంచి ఇట్టి పవిత్ర కర్తవ్య పాలనము నామె భగవదారాధన, ఈశ్వర భక్తికి పర్యాయముగా నెంచు చుండెను. శిశు జననానంతరము తన కర్తవ్యముల నామె ద్విగుణీకృత శ్రద్ధా సక్తులతో నెరవేర్చు చుండెను. బాలకునికి పాలుగుడుపునపుడు జోల పాడుచు నిద్రపుచ్చు నపుడు, ఇట్టి ప్రతి యవకాశమునందును వానిని ఉత్తమ భావములతో ప్రభావితు నొనర్చు చుండెడిది. మాతృ దేశ భక్తి, మానవత్వమను మహా ఆదర్శములతో ప్రేరితునొనర్చుటకు ప్రయత్నించు చుండెడిది. అనావశ్యకమగు గారాబము గాని, అనుచితమైన గద్దరింపులుగాని జేయక ఒక మహనీయమగు కర్తవ్యరూపమున వానినామె యాచరించుచుండెడిది. సామాన్య స్త్రీల వలె బాలకునికి కేవలము మనోరంజన మాత్రగ నెంచి అసత్యమగు అనవసరమగు బూచి, భూతము, దయ్యములను భయములు జెప్పి మనో దౌర్బల్యము గాని, ఆత్మకు సంస్కారములు గాని గలిగించు పాపములను గొని తెచ్చుకొనెడిది గాదు. ఇట్టి అవైదికములు, సంతతి నాశక మహా నర్థకములు ఆ కాలమునందుండెడివే గావు. ఒకే ఈశ్వరుడను విశ్వాసము ఆస్తికతా క్షేత్రమున సంపూర్ణ క్రియాకలాపములకు మూలాధారమై యుండెడిది. ఈ విధముగా అంజనామాత ఒక ఆదర్శ మాతృమూర్తిగా పవిత్రమగు తన బాధ్యతలను చక్కగా నిర్వహించు చుండెను.



బాల హనుమంతుడు శిలపై బడుట

# ౧౦. పెరుగుచున్న మొలక
## (మారుతున్న బాల్యదశ)

జనన సమయమునునే బాలాంజనేయుడు ఒక సంవత్సరము వయస్సు గల బాలునిగా దోచు చుండెను. దాదాపు మూడు, నాల్గు మాసముల వాడై యుండ నోపు. ఒక నాటి ప్రాతః సమయమునందలి ఘటన యిది. సాంద్రా రణ్యమున ఒక చిన్న పర్వత భాగమున నిర్మితమై యున్న ఆ యాశ్రమ ప్రాంగణ మున ఊయల గట్ట బడి యుండెను. అంజనామాత బాలునికి పాలనుగుడిపి తొట్టియందు బరుండ బెట్టి నిద్రగరపు ప్రయత్నమున నుండెను. ప్రశాంత వదనము, అచంచల చేష్టలుగల నా బాలకుని వేదమంత్రములతో జోలలు పాడు చుండెను. వేదమంత్రముల బాడుచు పాడుచు వాని యర్థ సమాలోచనమున భావమగ్నురాలైన యవస్థలో తనకు తెలియకుండనే ఊయల నొక విసరుగా నూపినది. ఆ యూపుతో బాలకుడు ఊయల నుండి కొంతదూరము నొక శిలపై బడినాడు. అంజన నిశ్చల ధ్యానము వీడినది. భయముతో వెంటనే బాలకుని వద్దకు పరుగు తీసినది. బాలుడు ప్రసన్న ముద్రలో సురక్షితముగ నుండుట గాంచి ఎంతో ఆనందించినది. ఆమె చూచిన అత్యంతాశ్చర్యకర మగు విషయమే మనగా శిశువు పడినట్టి శిల అతని శరీరాఘాతము వల్ల ఒక మూల విరిగిపోయినది. అంజనాదేవి ఆనందముతో ఈశ్వరునికి శతకోటి కృతజ్ఞతాభివందనము లర్పించినది. మహర్షి అగస్త్యులీ సంఘటనమును గాంచి పరవశుడై పోయినాడు. అత్యంత ప్రేమతో నాతడాబాలకుని దీసికొని ముద్దిడి ''నా హనుమంతుడు 'వజ్రాంగు' డనియని నాడు. ఒక కవి యీ సంఘటన నీవిధముగా పద్య బద్ధ మొనర్చినాడు.

**ఎక్ దిన్ కుషీమె అంజనా హనుమాన్ బాల్‌కో,**
**ఫల్నార్ఝులాకె లోరియాం దేతీథిలాల్‌కో**
**గఫలత్ హువీకి జోర్‌సే ఝోటాజొలగ్ గయా**
**హనుమాన్ వీరకోటికే ఖందక్ మె గిర్గయా।**
**ఝట్ దౌడ్ అంజనానె ఉసే ఉర్‌సేలగాయా**

బైర్ ఝూడ్ పోంచ్‌కర్ ఉసె బహుభాంతిచుమాయా ।
భయగ్రస్తహో కుఛ్ కాల్ వహబైరీ రహీ వహీం
బోలీకిమెరే లాల్ లగీతో కహీం నహీం?
మాతామెరే లగీనహీం యహఝూట్ నహీం హై ।
హాం చోట్ శిలాకోలగిజో టూట్ గయీ హై।
ఐసే థెయహాం పృష్టవీర్ జిన్ కమాన్ హై
హనుమాన్ బలీ వీరవరోంమేం ప్రధాన్ హై॥

దీని తెలుగు అనువాదమిట్లొనర్చబడినది.

అంజనయొక దినమున కడు ఆనందము మనసు నిండ
ఊయలలో హనుమంతుని ఊపు చుండె జోలలతో ।
మాతా అంజనమనస్సు మనోనాథుపై నుండుట
గట్టిగ నూపగ బాలుడు అట్టె క్రింది శిలపై బడె ।
అంజన పరుగిడి బాలుని అదిమె యురమునకు గోముగ
దుమ్ము ధూళి తన చెరగున దులిపివేసి చుంబించియు ।
భయభ్రాంతయై యంజన బాలునెంతొ లాలించుచు
తండ్రీ! నీకెటనెక్కడ తగిలె ? ననగ హనుమానుడు
అమ్మా! నాకేమి ? గాని అదిగొముక్కలైనది శిల
నినగ జూచి యబ్బుర పడి అంజన పరమేశువేడె
అందుకె వజ్రాంగబలీ యను ఖ్యాతిని వడసెను హను.
మానుడు వీరులలో కడు మాన్యత గలవాడయ్యెను ॥

ఋష్యాశ్రమమున అంజనాదేవి కే విధమగు కష్టములు లేవు. తోడుగా ఆమె ప్రియ సఖియగు వాసంతి గూడ నుండెను. పవిత్రమగు నామె యెడి యందు వజ్రాంగ హనుమానుడను కాంతి పుంజ రత్నము గలదు. ఐనను ఆమె యంతరంగ మెంతో యుదాసీనముగా నుండెడిది. మనస్సు పవనుని కొరకు నిరీక్షించు చుండెడిది. యువ రాజ పవనుడు యుద్ధ రంగము నుండి తిరిగి

---

వచ్చి తన జాడలో వ్యాకులుడై తిరుగు చున్నాడను వార్త ఆమెకు సూక్ష్మముగా దెలిసినందున ఆమె చిత్తమాతని కొరకు ఆరాట పడుచుండెను.

నేటికి బాలవీరుడగు హనుమంతుని వయస్సు ఒక సంవత్సరము పూర్తియైనది. అంజనాదేవి పుత్రుని జన్మ దినోత్సవము జరుపు కొనినది. యజ్ఞము పూర్తి యైన పిదప అగస్త్య మహర్షి బాలకునాశీర్వదించి త్వరలోనే కష్టములు అంతరించి సౌఖ్యములు పొందగల వని అంజనాదేవి నాశ్వాసించి తన గురుకులమునకు వెళ్ళిపోయినాడు.

వర్ధంత్యుత్సవానంతరము అంజనాదేవి దుఃఖము అధికమే యైనది, పతిని జ్ఞాపకము పదే పదే బాధింప సాగినది. ''అభాగ్యురాలనగు నాకొరకై నా జీవన నిధియగు పతిదేవుడెచ్చటెచ్చట దిరుగుచు ఎన్నెన్ని బాధలకు గురియగు చున్నాడో, నా ప్రాణాధారమగు ఆర్యపుత్రుని దర్శన భాగ్యమెప్పుడబ్బునో'' యని నిరంతరమాతని ధ్యాసయందే ఉదాసీనయై యుండెడిది. అట్టి యుదాసీనావస్థ యందే ఆమె యాశ్రమ ప్రాంగణమునందొక నాడు తలవంచుకొని కూర్చుండియుండెను. ఇంతలో ఆకస్మికముగా సూర్యునివలె మెరయుచున్న తేజోపుంజమొక్కటి ఆకాశము నుండి తన వైపునకు వచ్చు చుండుటను ఆశ్చర్యకరముగ చూచినది. తరువాత నది ఏదో యొక విమానము అని తలచి అంజనాదేవి పునః విచారముద్రయందు మునిగి పోయినది. కాని వీర బాలకుడు మాత్రమా విమానము వైపునకు చేతులు జాచుచు పెద్ద ధ్వని తో నేడ్వసాగినాడు.

ఆ విమానము నందొక తెల్లని గడ్డము గల శతవృద్ధుడు విలువైన దుస్తులను ధరించియుండి ఒక వృద్ధ స్త్రీతో మాట్లాడుచు వచ్చుచుండెను. ఆకస్మికముగా నాతని దృష్టి అంజనాదేవిపై, ఆ యేడ్చుచున్న బాలకునిపై బడెను. ఆరోదన ధ్వని చెవుల బడగానే ఆతని హృదయమునందేలనో కరుణ జనింపగా ఆ విమానము నా సమీపము ననే దింపి యా నిర్జనాశ్రమమునకు వచ్చి సౌందర్యమూర్తియగు అంజనను ఆ విచిత్ర బాలకుని జూడగనే ఆతనికేలనో వారిని గూర్చి తెలిసికొనవలె నను జిజ్ఞాస కలిగినది. కష్టపరంపరలో వున్న అంజనాదేవి నా వృద్ధ దంపతులు గుర్తించ లేక పోయినారు. కాని అంజనాదేవి వారిని పోల్చు

కొనుటలో విలంబనము చేయలేదు. వారు మరెవరో కారు. ఆ వృద్ధుడు అంజనాదేవి మేనమామయగు 'ప్రతి సూర్య మహారాజు' ఆ స్త్రీ యాతని భార్య రవి సుందరి' యై యుండిరి. వారిని గాంచిన తోడనే అంజనాదేవి కంటికి మంటికి ఏకధారగా నేడ్వసాగినది. హృదయము నందలి శోకావేగమంతయు కన్నుల ద్వారా వెలువడినది. అంజన శోకము, వెక్కిల మధ్యనే తన దుఃఖ గాధను సవిస్తరముగా ఆ వృద్ధులకు తెలియబరచినది. ఈ విపత్కర గాధను వినిన తోడనే ఆ వృద్ధ రాజు రాణియును దుఃఖ పడినారు. చివరకు ఆ మహరాజే ఎట్లో దుఃఖము నాపుకొని అంజనాదేవినోదార్చినారు. అతి శీఘ్రముగనే యువరాజ పవనుడు తన బలగముతో సహా వచ్చి కలియుదురని ఆశ్వాసించినారు.

వారి విమానము నౌకాకారముగ నుండి సువర్ణమణి ఖచ్చితమై బంగారు బంతులు, ఆణిముత్తెపు సరులు వ్రేలాడదీయబడియుండెను. కళాకారుడనేక అమూల్య రత్నములను బంగారము నందు పొదిగి నుండిననది ప్రయాణ వేగము నందున్నప్పుడు సూర్యకిరణములు తాకిడివల్ల దాని ప్రకాశము కన్నులకు మిరుమిట్లు గొలుపు చుండును.

అంజన తన మేనమామ, మేనత్తలను సాగనంపుటకు లేచినది. బాలకుడైన హనుమంతుని దృష్టి విమానమునకు వ్రేలాడ గట్టబడిప్రకాశించుచున్న బంగారు బంతులపై బడినది.★ వాని నందు కొనవలెనని ఆ విమానముపై

---

★ ''హనుమంతుడు తన బాల్యావస్థయందే సూర్యుడుదయించు చుండగా అదియొక తినదగిన యెర్రని పండని యెంచి చెంగున నెగిరి సూర్యుని బట్టి నోటిలో వేసికొనినాడను గాథయొకటి ప్రసిద్ధమై యున్నది. దీనికి ఆధార మీ సంఘటనయే గావచ్చును. నిజమునకది యొక ఫలముగాని, సూర్యుడు గాని గాకుండెను. అది యీ విమానము యొక్క తలకు మనుచున్న బంగారు బంతియే, కవులు దాని యుపమానముగా సూర్యునితో పోల్చినారు. తరువాత వ్యాఖ్యాకారులు యథార్థ విషయమును వదలి దానిని నిజముగు సూర్యుని జేసినారు. ఈ ప్రసంగమునందాలోచింప దగిన విషయమేమన, పవిత్ర వేద మంత్రములందు ప్రయుక్తమై యున్న అలంకారిక వర్ణన లనేకములను గాథాకారులు, పురాణ కారులు తమ వ్యక్తిత్వ ప్రధానమునకై వానిని సత్య సంఘటనలుగా చేసి వేసినారు. ఉదా: బలి,మరియు వామనుని కథ, విష్ణుమూర్తి శేషశయ్యా శయనము, శంఖ చక్రగదా పద్మధారియగు విష్ణువు, అహల్యోద్ధారక గాథ మున్నగునవి వేదములందలి అలంకారికములే. వానికి వీరు సత్య సంఘటన రూపము నిచ్చినారు. ''**కపిర్విష్ణుంబాధతి**'' అనునది వేదమంత్రాంశము. కపియనగా కంపనము గలది. మేఘములు తమ గర్జన

నాతడు బలముకొలది బంతివలె నెగిరి దానినందుఁ కొనవలెనను కొనినాడు కాని యది సాధ్యముగా లేదు. ఈ యెగురుటయందు మళ్ళీ ఒక మారు పర్వ ముపై క్రిందికి పడిపోయినాడు. ఈ సంఘటనకు అంజనాదేవి, వాసంతిక ఏమం ఆతురుత నొందలేదు. కాని 'రవి సుందరి' మాత్రము స్తంభిత యై, భయ గ్ర యై శోకమగ్నురాలైనది. వృద్ధరాజు వాని నెత్తుకొని, ''అంజనా, నీ కుమారుని శరీరము వజ్రము వలె నున్నది. నేను వాని వద్ద కేగువరకు ఎప్పటి వలెనే కూర్చుండి ఏమియు జరుగనట్లే వ్రేలు చప్పరించు చున్నాడు. నన్ను జూచి చెంగలించినాడు. ఈశ్వరున కనేక ధన్యవాదము''లని యనినాడు. రవిసుందరి బాలుని రాజు వద్ద నుండి తీసికొని యురమునకు హత్తుకొని, శిరమును చుంబించుచు'' కుమారా! వజ్రాంగా'' ఎచ్చట పర్యటించి వచ్చితివి ? అని యనినది. అంజనా దేవి చిరునగవుతో'' ఇంతకు పూర్వము బాబు నాల్గు నెలల వాడై యున్నప్పుడు కూడా ఈ విధముగానే ఊయల నుండి క్రిందికి దొరలి పోయినాడు. పూజ్య గురుదేవులు కూడా అచ్చముగా నిట్లే ''వజ్రాంగ'' యని సంబోధించినారు. అప్పటి నుండియే వీనికి 'వజ్రాంగబలి' (బజరంగబలి) అను మరొక నామము కూడా విఖ్యాతమై పోయినది'' అని యనినది.

## ౧౧. మధుర సందర్శనము

పవనకుమారుడు అంజనాదేవికై సమస్త ప్రదేశములు గాలించినారు. ఒక సంవత్సరము నుండి ఆ యన్వేషణము నందే పిచ్చివానిగా దిరుగుచుండెను. తన

లందు కంపనము గలిగించును. కావున మేఘమును గూడ కపి యందురు. విష్ణు యను పదమునకు ప్రసిద్ధ వైదికార్థము. సూర్యుడు. మేఘములు సూర్యుని మ్రింగును. అనగా ''సూర్యుని కప్పివేయు'' ననునది ఈ అలంకార ప్రయోగము న కర్థమని ఒక వేద పండితుని వ్యాఖ్య. ఇట్టి యలంకారిక ప్రయో గములకు చమత్కారముగ నొనర్చుట సృష్టి విరుద్ధము. ఇట్టి బుద్ధి, విజ్ఞాన విరుద్ధములగు వానికి సం ఘటన రూపము నిచ్చి హనుమంతుని దవడ యందు సూర్యునిరికించివేసినారు. వానర జాతి వారు కూడా తమ గర్జనముల ద్వాగా ఎగురుట దుముకుట ద్వారా కంపనము నుత్పన్నమొనర్చు చుండిరి. కావుననే సాహిత్యక ప్రయోగ. ందు వారిని గూడ 'కపి' అని యనినారు. దీనివల్లనే ఈ భ్రాంతి కలిగియుండ వచ్చును

చిన్న పొరపాటు వల్ల అంజనాదేవి ఇన్ని కష్టముల, సంకటముల, అవమాన ముల పాలైనది. ఇందుకు ప్రాయశ్చిత్తముగ '' ఒక నెలరోజులలో అంజనాదేవి జాడ దెలియనిచో అగ్ని ప్రవేశమొనర్చెద'' నని సంకల్పించికొనినాడు. కుమారుని యీ దీన దశను గాంచి ప్రహ్లాద మహారాజు, కేతుమతి మహారాణి తల మోదుకొనుచు నేడ్వ సాగినారు. రాజ్య మందంతటను ఏడ్పు లార్పులతో కల్లోలముగా నుండెను. **అంజన** తల్లిదండ్రులు గూడ తమ తెలివి లేమితనముపై కంటికి మంటికి నేక ధారగా నేడ్వ సాగినారు.

అనుకూల సమయము వచ్చినదని తలచి అగస్త్య మహర్షి రాజధానికి వచ్చినాడు గురుదేవుని గాంచినంతనే పవనుడాతని పాదములపై బడి బోరున నేడ్వ సాగినాడు. ఆ సన్నివేశము అచ్చటి వారినందరను దుఃఖమున ముంచివేసినది. అప్పుడు మహర్షి పవనకుమారుని లేవనెత్తి హృదయమునకు హత్తుకొని ''కుమారా! చింతించకుము. మీ యకుంఠిత వ్రతదీక్ష నిర్విఘ్నముగా సఫలమైనది. ఉత్తమ కార్య సాధన యందిట్టి బాధలెన్నియైన రావచ్చును. పరమేశ్వరుని అపార కృపవల్ల నీ యంజనాదేవి ఆబాల వీరుని సహితముగా సురక్షితముగా నున్నది''. అని యనగానే రత్నపురి నగరమందతటను ఆనందోత్సాహములు నిండిపోయినవి. దిగ్దిగంతములందు 'వైదిక పురోహితులకు జయ జయ' నినాదములు మార్మ్రోగినవి. ఆ సమయము నందే ప్రతి సూర్య మహారాజు, రవి సుందరి రాణి తమ విమానముపై మహేంద్ర పురి జేరి సమస్త వృత్తాంతము దెలిపినారు. ఈ సువార్త వినినవెంటనే అంజన జననీ జనకులగు మహేంద్ర పాలుడు, లీలావతి రాణి తమ పరివారముతో హుటా హుటిగా రత్నపురి జేరినారు. వీరెల్లరును గలిసి మహానదీ ప్రవాహము వలె ఆశ్రమమునకు జేరినారు. ఇదియంతయును గాంచిన అంజనాదేవి పరమేశ్వరున కనేక ధన్యవాదము లర్పించినది.

మహారాణి కేతుమతి, అంజన జననియగు లీలావతి అంజనను సమాశ్వాసిత మొనర్చినారు. ఆశ్రమము నందొక అపూర్వ దృశ్యము గానవచ్చుచుండెను. వీరబాలకుని తేజోవంతమగు ముఖ మండలమును గాంచి, కౌతుక



హనుమంతుని ఉపనయన సంస్కారము

నంతమగు లీలలను విని అచ్చట జేరిన వారెల్లరును సమ్మోహితులైనారు.

అంజనా పవనుల యీ మధుర సంయోగము వారి పరస్పర జీవిత
లందత్యంతా భినవానుభూతి యై యుండగా మహర్షి అగస్త్యునకు ఈ సంఘ
టనము రాష్ట్రోద్ధారకమునకు సంబంధించిన మహా యోజన యొక్క ఫలవం
మగు ప్రథమ ప్రకరణ రూపమున అత్యధిక హర్షదాయక విషయమై యుండెను.

## ౧౨. హనుమంతుని బాల్యము

హనుమంతుడు శుక్ల పక్షచంద్రుని వలె వృద్ధియగుచు క్రమముగ రెండు
మూడు, నాలుగైదు సంవత్సరముల వాడైనాడు. చూచువారలకు తొమ్మిది సం
వత్సరముల వాడుగా దోచుచుండెను. అతని అలౌకిక బాల్యక్రీడలు, అద్భు
ప్రకాశము, కుటుంబజనమును, మరియు ప్రజానీకమును మంత్రముగ్ధులనుగ
జేయు చుండెను. తనకన్న అధిక వయో వంతులు, ఉద్దండులు, ఉచ్ఛృంఖలురగ
బాలకుల నెల్లరను ఒకే యొక ముష్టి ఘాతమున చక్క బరచు చుండెను. దుర్బ
లురు, పీడితులగు బాలురెల్లరకును ఆతడు సహాయ కారిగా నుండెను. అ
వేగముగా పరుగెత్తుట చెంగుచెంగున దుముకుటను గాంచి సకల జనులు ఆశ్చర
మగ్నులగుచుండిరి. ఐనను ఆ బాలుని వినయ సంపత్తి, సౌశీల్యము అత్యధి
సమ్మోహనకరముగ నుండెను.

ఋషి నిర్దేశానుసారము ఒక పరమ పవిత్ర కర్తవ్య రూపమున బాలు
సద్గుణ రాశిగానొన ర్చుటకు తమ సర్వ శక్తులను వినియోగ పరచుచుండిరి
ప్రాతః కాలము ననే వ్యాయామ స్నానాంతరము సంధ్య, ఈశ్వరస్తుతి, ప్రార్థ
పాసనలకు సంబంధించిన పవిత్ర వేద మంత్రములే గాక సుందరమగు అనేక సుభా
తములను నేర్పు చుండిరి. పిన్న పెద్దల యెడ వ్యవహరించవలసిన శిక్షణ ని
చుండిరి. నిద్రించు సమయమున అంజనామాత వీరులగు పూర్వజుల గాథల
బాలునికి చెప్పుచుండెను. దేశమునకై తమ సర్వస్వము నర్పించిన వీర పురుష
చిత్రములను, వీర సాహిత్యమును శయన మందిరమున దగిలించబడి యుండె

ప్రాతః సమయమున నిద్ర నుండి మేల్కొనిన తోడనే వేదమంత్రముల ద్వారా ప్రభు వందనము, తరువాత మాతా పితరులకు, గురుజనముల చరణములకు నమస్కరించి సాటి వారికి నమస్తే యని నివేదన పూర్వకముగ, వినమ్ర భావముతో అభివాదన మొనర్చుచు వారి యాశీస్సులను పొంది ఆంజనేయుడు ప్రసన్నుడగు చుండెను. సమస్త బాలురకు అతని వినమ్రత సౌశీల్యము దర్శనీయముగ నుండెడిది.

ఆంజనేయుడు బాలమండలికి నాయకుడైనను అందరితో ఆత్మీయునిగానే వ్యవహరించును, గాని ఏ మాత్రమును భేద భావము నుంచెడివాడు గాడు. తన మధుర మందహాసములతో అందరి హృదయములను హరించు చుండెను.

బాలుడిప్పుడు ఎనిమిదవ సంవత్సరమున అడుగిడినాడు. ఒకనాడు మహర్షి అగస్త్యుల వారు రాజమందిరమున కేతెంచినారు. రాజదంపతులు అధిక భక్తి శ్రద్ధ లతో మహర్షిని సత్కరించినారు. ఆంజనేయుడింటికి రాగానే మాతా పితరుల పెద్దల చరణములను స్పృశించి వందనమొనర్చినాడు. మాత యొక్క సంకేతమున నవాగంతకులగు మహర్షి చరణములకు భక్తి శ్రద్ధలతో నమస్కరించినాడు. మహర్షి ఆ ముద్దు బాలకుని శిరము మూర్కొని లేవనెత్తి కౌగిటిలోనికి దీసికొని హృదయ పూర్వకముగా నాశీర్వదించినాడు. చక్కని ఆరోగ్యవంతుడు, సదాచార సంపన్నుడగు ఆ బాలుని ప్రగతి వికాసమును గాంచి అతి సంతుష్టుడైనాడు. బాలుని మేధాశక్తి, బుద్ధి, బలము, ఆత్మ వికాసములను పరీక్షించుటకు అడిగిన ఎన్నియో ప్రశ్నలకు సముచిత సమాధానములను పొంది బాలుని వేదారంభము, ఉపనయన సంస్కారముల ప్రస్తావన దెచ్చినాడు.

''భగవాన్! వీని యీ సప్తవర్ష ప్రాయము నందలి ఒక్కొక్క క్షణము తమ వల్ల నియోజితమైన విధముగనే నడుపబడుచున్నది. కాని తండ్రీ! ఎనిమిదవ సంవత్సరమున యజ్ఞోపవీత ధారణ క్షత్రియ బాలకునికి అతిశీఘ్రముగా నెంచబడునేమో గదా!'' అని అంజనాదేవి ఎంతో సంకోచించుచు వినమ్ర పూర్వకముగా నివేదించు కొనినది.

ప్రియపుత్రీ ! నీ శాస్త్ర విషయక జ్ఞానమును గాంచి నే నెంతయో సంత సించుచున్నాను. గృహ్య సూత్రముల వ్యవస్థల ననుసరించి క్షత్రియ కుమారుని యజ్ఞోపవీత ధారణము పదునొకండవ సంవత్సరమున గావలసి యుండును. ★ ఈ విధముగ నీ యాలోచన సమంజసముగనే యున్నది. కాని పుత్రీ ! ఈ బాలుడు ''**అగ్రతశ్చతురో వేదః పృష్ఠతో సశరోధనుః**'' అను సూత్రనికి ప్రత్యక్ష ప్రతిరూపమై యున్నాడు. ఈతడు కేవలము బల విక్రమములంద అద్వితీయుడు గాక విద్యాపాండిత్యములందును సాటి లేని వాడై యుండెను. కావున నీతనికి ఎనిమిది సంవత్సరములు ముడివడగనే వేదారంభ ఉపనయన సంస్కారములను నేను స్వయముగానే నిర్వర్తించెదను.

## ౧౩. గురుకులమున శ్రీరామ ప్రథమ సందర్శనము

వేదారంభ యజ్ఞోపవీత సంస్కారములు విధివిధానముగ జరిగిన యనంతరము వీరహనుమానుడు గురుకులమున ప్రవేశించినాడు. అఖండ మేధా సంపన్నుడు, శౌర్య నిధియగు నా బాలుడు అత్యల్ప కాలముననే ఆ ప్రాంతములందంతటను సర్వ ప్రియుడైనాడు.

గురుకులమునందలి బ్రహ్మచారులెల్లరును ఒక అధ్యాపకుని సంరక్షణమున నూతనఅనుభవములను గడించుటకు జ్ఞానాభివృద్ధి కై దేశాటన (Excursion) యొనర్చు నాచారముండెను. ఈ సంవత్సరమున మునిప్రవరు

★ **అష్టమే వర్షే బ్రాహ్మణ ముపనయేత్ ।౧॥ గర్భాష్టమేవా ।౨॥ ఏకాదశే క్షత్రియమ్ ।3॥ ద్వాదశే వైశ్యమ్ ॥ ౪॥ ఆషోడశాద్ బ్రాహ్మణస్యా నతీత కాలః ।౫॥ ఆద్వావింశాత్ క్షత్రియస్య, ఆచతుర్వింశాత్ వైశ్యస్య, అత ఊర్ధ్వం పతిత సావిత్రీ కాభవన్తి ॥ ఆశ్వలాయన గృహ్య సూత్రములు ।౧-౧౯-౧ నుండి ౬॥** అనగా, జన్మ లేక గర్భధారణ దినము నుండి ఎనిమిదవ సంవత్సరముననే బ్రాహ్మణ బాలురకు, పదునొకండవ సంవత్సరమున క్షత్రియ బాలురకు, పండ్రెండవ సంవత్సరమున వైశ్యబాలురకు యజ్ఞోపవీత ధారణ జరిపించవలయును. అట్లుగాకున్న బ్రాహ్మణబాలురకు పదహారు, క్షత్రియ బాలురకు ఇరువది రెండు, వైశ్య బాలురకు ఇరువది నాల్గు సంవత్సరములకు పూర్వమే యజ్ఞోపవీత ధారణ జరుగవలయును. అట్లు జరుగకున్న వారు పతితులుగా నెంచ బడుదురు.

లగు అగస్త్యమహర్షి నేతృత్వమున ఈ బృందము ఆర్య రాష్ట్ర ముఖ్య రాజధాని యగు అయోధ్య కేగవలయునని నిశ్చయింప బడినది. ఋషుల యోజన ప్రకారము ఋష్య శృంగమహర్షి ద్వారా నిర్వర్తింపబడిన పుత్ర కామేష్టి, మహాయజ్ఞ ఫలితముగ దశరథ మహారాజు ముగ్గురు భార్యలకు మహావీరులగు నలుగురు పుత్రులుత్పన్నమై యుక్త వయస్సు నందు పూర్వయోజనానుబద్ధముగ వశిష్ఠమహర్షి యాశ్రమ గురుకులమున విద్యనార్జించు చుండిరి. వేదాధ్యయనము తో బాటు జ్ఞాన విజ్ఞానములకు సంబంధించిన వివిధ శాఖలందు అధ్యయన మొనర్చు చుండిరని అగస్త్య మహర్షి ఎరిగియే యుండెను. అచ్చటి సంపూర్ణ పరిస్థితుల నవగాహన మొనర్చు కొనుటకును, **బాల వీరుడగు ఆంజనేయునికి ధశరథ పుత్రులతో పరిచయము గలిగించుటకును, మరియు నచ్చటి వాతావరణముచే హనుమంతుని శిక్షణమున కవసరమగు సవరణలు గలిగించుటయే ఈ యాత్ర యొక్క ముఖ్యోద్దేశము.**

అయోధ్యా నగరము యొక్క అలౌకిక శోభ, దానియనుపమ వైశాల్యము మున్నగునవి యాత్రిక విద్యార్థుల నాశ్చర్య ప్రభావితుల నొనర్చినవి. **బాల వీరుడగు హనుమానుడు దశరథ పుత్రులతో, ముఖ్యముగా శ్రీరాముని స్నేహములో తల్లీనమై పోయినాడు. అగస్త్య మహర్షి మహా ముని వశిష్ఠుని యాశ్రమమునసనే నిలిచి నాడు. శ్రీ రామాంజనేయుల జతనుగాంచి మహర్షులిరువురును ఎంతో ఆనందించినారు.** ఒకనా డేకాంతమున నా మహర్షులిరువురును అత్యంతావశ్యక విషయములను మాట్లాడు కొనుచుండిరి. తదనుగుణ్యముగ శ్రీరామునికి ధనుర్విద్య, పావను (హనుమంతు)నకు గదా మల్లయుద్ధము లందత్యంత ప్రవీణులనుగా జేయుటకు నిశ్చ యింపబడినది. అచ్చట నివసించిన కాలమున నొక విధమగు నవ్యానుభూతి, నవీనాత్మ విశ్వాసము, మరియు రాష్ట్రోద్ధారక విషయమున నొక సునిశ్చిత యోజన (plan)ను ధ్రువ పరచుకొని అవిస్మరణీయ అతిథ్యముల యనంతరము వీడ్కోలు పొంది అగస్త్య మహర్షి శిష్యబృందముతో తన యాశ్రమము చేరినాడు. వారి యాత్ర సఫలీకృతమైనది.

## ౧౪. ఆంజనేయుని ప్రశిక్షణము

బాల హనుమంతుని విద్యాభ్యాసము. విధిపూర్వకముగా జరుగుచుండెను. శ్లోకముల, వేద మంత్రముల శబ్దోచ్చారణ హనుమంతుని ప్రత్యేకత. ఆతని స్వస్వర వేద మంత్ర పఠనము శ్రోతలను మంత్ర ముగ్ధులనుగా చేయుచుండెను. బాలకుని యందు వక్తృత్వకళ అద్వితీయముగా నుండెను. మేఘ గర్జనను తలదన్ను తన ఓజో వంతమగు వాణి ద్వారా శాస్త్రీయ లౌకి వ్యవహార బుద్ధి విజ్ఞాన సంబంధ విషయములను హృదయ మస్తిష్కముల నల రించు నట్టి మనోహర శైలిలో ప్రతి పాదించు నపుడు ఆశ్రమ వాసులెల్లరును గుంపులుగా నిండి కుతూహలముగ నాలకించి విస్మయ విముగ్ధులై ఎంతయో ప్రశంసించు చుండిరి.

విద్యుక్త గాయత్రి మహామంత్రానుష్ఠాన ప్రణవజపములను పుణ్య ప్రక్రి యలతో బాటు అష్టాంగ యోగ పద్ధతిలో యోగాభ్యాసము కూడ హనుమం తుని దినచర్య యందు అవిభాజ్యాంగమై యుండెను. తత్ఫలితముగ సూక్ష్మ దర్శియగు మేధ, ఋతంభర (దృఢమగు) బుద్ధి యాతనికి ఉపలబ్ధమైనవి. అకారణమున కఠినాతి కఠిన విషయములైనను నాతడు అతి సులువుగా గ్రహించు సమర్థత గలిగి యుండెను. మేధావంతుడగు కారణముననే పరమేశ్వర ప్రసాదిత పరమ కల్యాణ వాణి యగు వేదా ధ్యయనామృత పరమ సౌభాగ్య మాతనికి సహ జముగనే లభించినది. ఋగ్యజు స్సామాథర్వణము'' లను నాలుగు వేదము లను గురుచరణముల సన్నిధిన విధ్యుక్తముగ నధ్యయన మొనర్చి శబ్దముల సత్యా ర్థములను గ్రహించి 'చతుర్వేది' యైనాడు. సాహిత్యముతో బాటు బ్రహ్మ చారియగు హనుమంతుని వ్యాకరణ శాస్త్ర ప్రవీణత అద్వితీయముగ నుండెను.

జ్ఞాన విజ్ఞానముల వివిధ శాఖలందును గణిత, భూగోళ, ఖగోళ, చరిత్ర మున్నగు సకల శాస్త్రములందును, ఇతర అనేక కళలందును, అర్థశాస్త్రము మున్నగు వానియందును ప్రవీణుడగుటయే గాక నీతి, రాజనీతి, ధర్మశాస్త్రము లాతనికి అత్యధిక ప్రియతమములై యుండెను.

ఇన్ని శాస్త్రములు, ఇన్ని కళలు పఠించినను ఆంజనేయునికి తృప్తిలేదు. క్రీడారంగమునందును అద్వితీయుడుగా నుండెను. "బాల్ బ్యాడ్మింటన్, టేబిల్ టెన్నిస్, క్రికెట్, రింగ్ లవంటి సుకుమార క్రీడలు ఆకాలమున లేవు. పెద్ద పెద్ద అంగలతో దుముకుట, ఎగురుట, గెంతుట మున్నగునవి. ఎన్నో మైళ్ళపరకు పరుగులు, పర్వత ఖండములను వృక్షములను పెరికి భుజములపై నుంచుకొని పర్వతముల నధిరోహించుట, వృక్షముల నెగబ్రాకుట, ఒక దానిపై నుండి మరొక వృక్షము పైకి లంఘించుట, వేగముగా ప్రవహించు మహానదులందీదుట, మల్ల శాలలందు వివిధ మల్లయుద్ధ కౌశల ప్రదర్శనము లాకాలమున సామాన్య క్రీడలు. వీని యందును హనుమంతుడు ప్రథముడుగనే నుండును."

హనుమంతుడు బుద్ధి, మరియు విద్యాక్షేత్రముల కన్న బలశౌర్య క్షేత్రము నందే అధికఖ్యాతి నార్జించినాడు. అనేకములగు దేశ విదేశీయ మల్ల యుద్ధ ప్రక్రియలు శాస్త్రీయ ప్రక్రియలు వాని విరుగుళ్లు మున్నగు వాని యందు ఆతడు ప్రథమ శ్రేణియందే యెంచ బడు చుండెను. వీని యందనేక పురస్కార ముల నందికొనినాడు. ఇన్ని అభూతపూర్వోపలబ్ధుల నందినను అహం అనునదాతని వైపు కన్నెత్తి యైనా చూడక పోవుట ఆశ్చర్య విశేషము. వినయ విధేయత లాతని పెన్నిధియై యుండెను. ఈ సద్గుణములన్నియును మన వజ్రాంగుని సత్యం, శివమ్, సుందరమ్ వైపునకు గొని పోవుచుండెను.

## ౧౫. అవకాశ ప్రతీక్ష, దీక్షాంత కార్యము

బ్రహ్మచారియగు హనుమంతుడిప్పుడు ఇరువదైదు వసంతములను [illegible]చినాడు. బ్రహ్మచర్య దీప్తిచే ప్రదీప్తుడు, అగాధమైన ఈశ్వరభక్తి, నిష్ఠ, మరియు యోగ సాధన వంటి పవిత్రమైన తేజస్సులతో తేజరిల్లుచు, మొక్కవోని పురు[illegible]ర్థము, అతుల బలము, అద్భుత పరాక్రమము, అపరిమిత సాహసములతో [illegible]టు సదాచారము, ధర్మ, పరాయణాత్వ మను జ్యోతితో జ్యోతిష్మంతుడగు యువకుడు యువ తరమునకు శ్రద్ధాళువు, సమవయస్కుల కతి సమీప స్నేహ[illegible]తుడుగ నుండెను. వికసించుచున్న ఆతని వ్యక్తిత్వమున భావుకత, వివేకము,

శ్రద్ధ, మేధ, విద్య, శాంతి, క్రాంతి, ధర్మము, రాజనీతి, జ్ఞాన విజ్ఞానముల్ను, ఇహపరలోక వాదములందు అపూర్వమగు సామంజస్య ముండెను. ఆతని యందు ప్రత్యేకాకర్షణ గుణము విశేషముగ నుండెను. ఆతని గాంచిన వారెల్లరును ఆత నికి వశమగుచుండిరి. హృదయము నిచ్చి పుచ్చుకొనుట యాతనిలోని ప్రత్యేకత. యువతరమున కాతడు నాయకుడు, యువకులిప్పుడాతని కను సన్నల మాత్రముననే ప్రాణము లర్పించుటకు సిద్ధముగా నుండిరి. మాతాపితరులు, పురజ నులు, పరిజనులు యశోవంతమగు నాతని నడవడిని గాంచి సంతసమును పట్ట జాలకుండిరి. తమ జీవితము నందట్టి మహత్తరమైన నిధిని జూచుకొని తమ ప్రణాళిక సిద్ధించినట్లే తలచుచు గురుజనము దయానిదియగు పరమేశ్వరునకు శతకోటి ధన్యవాదము లర్పించు చుండిరి. ఐనను వారి లక్ష్యమున నున్నకార్యము ఇంకా జటిలము, దురూహ్యాము, శ్రమసాధ్యముగానే యుండెను. మహర్షి ఆ విషయమున అతి జాగరూకుడే యై యుండెను.

అగస్త్య మహర్షి తత్త్వావధానమున ఆతని ప్రణాళిక ఇది వరకే యువ తరము నందు రహస్య పద్ధతిలో ఆచరణయందుండెను. ప్రస్తుత పరిస్థితి నను సరించి వారు రహస్య సంచాలకులుగ నుండిరి. ఏలన, వారి లక్ష్యసిద్ధి కీ పద్ధతియే యోగ్యమై యుండెను. బ్రహ్మచారి, వజ్రాంగుడు, మహావీరుడునగు హనుమంతు డిప్పుడు యువ మండలి నేతృత్వమును సంపూర్ణముగ గైకొని బాహాటముగ విప్లవ పతాకము నెత్త వలెనని తలచినాడు. కాని ఋషివరులు " ఈ పద్ధతి నింకను రహస్యముగనే జరుగ వలెననియు, ఈ యగ్ని లోలోపలనే రగుల్కొని ఒకేసారి విజృంభించవలె" నని ఆదేశించినాడు. వాలి, మరియు రావణుని సమ్మి ళిత శక్తి పైపు సంకేతమొనర్చి నారు. హనుమంతుని చేర బిలుచుకొని "కుమారా! మనమింకా అనుకూల సమయమునకై వేచియుండ వలసియున్నది. ప్రస్తుత మిప్పుడు నీవు మీ రత్నపురి యందే యుండి రాష్ట్రోద్ధార కార్యమునకై నీ యఖండ బ్రహ్మచర్య వ్రతమును జాగ్రత్తగా పాలించుచు మహావీరుడను నామమును సార్థక మొనర్చుకొనుము. నా యాశలన్నియును నీ పైననే యున్నవి. నీ పై నాకు

సంపూర్ణ విశ్వాసము గలదు''. అని చెప్పుచుండగనే మమతా శూన్యముగు కఠోర హృదయముగల గురుదేవుని నేత్రములు అశ్రు పూర్ణము లైనవి. ఏలన, నేడు తన ప్రియ శిష్యుడు తన్ను వదలి పోవుచున్నాడు.

## ౧౬. రావణుని పసుపున యుద్ధము

విద్యావ్రతుడు స్నాతకుడునైన మహావీర హనుమానుడిప్పుడు రత్నపురి చేరినాడు. మాతాపితరుల నగర ప్రజలెల్లర సంతోషమునకు మేర లేకుండెను. హనుమంతుడిప్పుడు రాచకార్యములందు పాల్గొన సాగినాడు. ఆతని న్యాయము, ధర్మము, నీతి, నిపుణతా వ్యవహారముల వల్ల ప్రజలత్యంత సౌఖ్యానందముల ననుభవించు చుండిరి. యువరాజగు ఆంజనేయుడు అనాథుల పాలిటి నాథుడు. దీన జన రక్షకుడు, దళితుల ఉద్ధారకుడు, పతితులకునాయకుడు, పుణ్యాత్ములకు సన్మిత్రుడు, కాని పాపాత్ముల, అన్యాయ కారుల పాలిట మాత్రము కాలపురుషుడై నిలుచును. వానర రాష్ట్ర మహాధిపతి వాలి మహారాజునకు గూడ మాండలిక రాజ్యమగు రత్నపురమున చక్కని వ్యవస్థలు, యువరాజగు హనుమంతుని న్యాయనీతి కుశలత్వము, మరియు వీర ధీరత్వముల గూర్చిన సమాచారము లందు ఉండినందున ఆతడధిక సంతృప్తి, సంతుష్టి గలిగియుండెను.

కాలము ముందుకు సాగుచునే యుండెను. దానితో బాటు మహావీరుడగు హనుమంతుని నేతృత్వమున యువక్రాంతికారుల అగ్ని నిరంతరము వ్యాపించుచునే యుండెను. క్రమముగ దాని మిణుగురులు పరిసరాలకు కూడ వ్యాపించినవి. మెల్లమెల్లగా ఈ సమాచారము రహస్యముగా వాలి మహారాజునకు గూడా అందినది. కాని ఆంజనేయునిపై పూర్వమేర్పడిన విశ్వాసమున్నందున 'పరీక్షించి చూడవలె' నని తలచి యుండెను. తలవని తలంపుగా అట్టి యవకాశమిప్పుడు చేజిక్కినది. లంకా పతియగు రావణునకు, దేవరాజ కోశాధిపతియగు కుబేరుని జయించి బందీగా బట్టు కొనవలె నను సంకల్పము గలిగి వాలి సహకారమును కోరినాడు. వాలి ఈ యవకాశమును హనుమంతుని పరీక్షించుట కుపయుక్తముగా నెంచి రత్నపుర మహరాజగు పవనుని సేనా సమేత

ముగ మహారాజాధిరాజగు రావణు పనుపున యుద్ధము జేయవలసినదిగా యాదేశించి నాడు. యువరాజగు హనుమంతుడు తండ్రి పనుపున తానే యుద్ధమ్మున ప్రవేశించ గలడనియు, తనకందిన రహస్య సమాచారము యథార్థ మగుచో నాతడు రావణునకు సహాయ మొనర్చుటకు రాజాలడనియును తలచినాడు.

ఆతడు తలచినట్లుగానే రాజనీతిజ్ఞుడగు హనుమంతుడు రాష్ట్ర నిర్మాత, పురోహిత ప్రముఖుడగు అగస్త్యుని సంకేతముపై స్వయముగ తానే రత్నపుర సైన్యమును దీసికొని రావణుని సహాయార్థము ప్రస్థాన మొనర్చినాడు. తన యద్భుత యుద్ధ కౌశలముచే కుబేరుని బందీగా జేసికొని రావణుని సేవ యందు ప్రవేశ పెట్టినాడు. వాలి యీ విజయ సమాచారమును విని ప్రహర్షిత హృదయుడై వజ్రాంగుని తన హృదయమునకు హత్తుకొని గౌరవించినాడు. ఆతని సందేహము దొలగిపోయినది. విప్లవాగ్ని ఆ ప్రాంతములందు కుములుచు వృద్ధి యగుచునే యుండెను.

## ౧౭. పితా భవతి మంత్రదాః

యువరాజగు హనుమంతుడు సదా ఏకాంతమందే సంధ్యోపాసన, దైనిక స్వాధ్యాయమును జరుపుకొనెడివాడు. ఒకనాడు ఆకస్మికముగా పవన మహారాజు కుమారుని ఏకాంత మందిరమున ప్రవేశించినాడు, ఆ సమయమున హనుమానుని యెదుట పవిత్రమగు అథర్వ వేదమందలి ఒక పుట దెరవ బడియుండెను. ఆతడప్పుడు దాని యందలి పదకొండవ మండలమున తృతీయానువాకము యొక్క ఐదవ సూక్తము పారాయణ మొనర్చుచుండెను. దాని యర్థ చింతనమున సంపూర్ణముగ మునిగి యుండి కాలమును గాని, తన జనకుని ఉపస్థితిని గాని తెలియకుండెను. పారివారిక సత్సంగము, దేవ యజ్ఞమునకు కాలాతీతమగుచుండెను.

కొంత సేపటికి ధ్యాన నిష్ఠనుండి సాధారణావస్థయందు ప్రవేశించి సమయము అతీతమైనదని దెలిసకొని పారివారిక యజ్ఞమునకై బయలు దేరనుండగా పూజ్య పాదులగు జనకులు తన మందిరముననే యుండుటను గాంచి, అహో

భాగ్యముగా దలచి అత్యంత భక్తితో పితరుల పాదములకు అభివాదనమొనర్చి "నమస్తే" నివేదన మొనర్చినాడు. జనకుల అతుల ప్రేమాశీస్సులను పొంది నిలిచినాడు. పవన మహారాజు కుమారుని సమీపమున కూర్చుండ బెట్టుకొని "మాఆనంద వర్ధనుడవును, సుఖ శాంతులయాధారమును, జీవనజ్యోతి స్వరూపుడవు నగు ఓ వత్సా! నీ నిత్యకృత్యములోని దగు నిత్య యజ్ఞమునకు నీ రాక యాలస్యమైనందున కారణము దెలిసికొనుటకే ఇచ్చటికి వచ్చితిని. నీవు వేద స్వాధ్యాయరతుడవై యుండుటను గాంచి నా సంతోషమునకు మేర లేకున్నది. సౌమ్యుడా! భగవతి వేదమాతయొక్క ధ్యాన (మనన) పూర్వక పారాయణము, తదను కూల శుభవర్తనము నిజముగా త్రితాపహరణము, మరియు ఉభయ లోక శాంతి దాయకమునై యుండును.

"ప్రియ కుమారా! నీతో నొక అత్యావశ్యకమగు విషయమును చర్చించ వలసి యున్నది. బహుశః ఈ యేకాంతము దాని కొరకు అధిక ఉపయుక్తమని తలచినాను'. అని పలికి అనేక పత్రములను కుమారుని ముందుంచి " ఈ పత్రములన్నింటి యందును నీ వివాహ సంబంధముల విషయమే ఉల్లేఖించ బడి యున్నది. రాజ కన్యల చిత్రములు, వారి విశేషముల గూర్చిన విషయములు వానితోనే జతపరచబడి యున్నవి. ప్రియ తనయా! ఇవి యన్నియును భద్రపరచి యుంచుకొని విరామ కాలమున శ్రద్ధగా వీని యవలోకనమొనర్చి తరువాత నీ సమ్మతిని దెలియ పరచినచో మేము మా అత్యవసర బాధ్యతల నుండి విముక్తి నొంది వానప్రస్థాశ్రమ ప్రయత్నములను జరుపుకొనెదము. రాజ్య కార్యముల నిదివరకే నీవు చక్కగా నిర్వర్తించు చున్నావు. అత్యధిక హర్షదాయక విషయమేమన, నీ చక్కని వ్యవస్థలు, న్యాయ నిర్దేశముల వల్ల సమస్త రాజ్య ప్రజలు నిన్ను తమ దేవతగా నెంచు చున్నారు. వాలి మహారాజు కూడా నీ విషయమునందు అత్యంత సంతుష్టాంతరంగుడై యున్నా" డని తెలిపినాడు.

ఈ విషయములన్నియును వినిన తరువాత ఆ పత్రముల వైపు క్రీగంటనైనా చూడక పవనుడు తండ్రితో "ప్రియ జనకా! నే నిప్పుడేమి వినుచున్నాను?

..క నాడు గురుదేవులు నా జన్మ గాథను సంపూర్ణముగా వివరించుచు పూజ్యు ..గు తాము మరియు నా మాతృదేవత యొక్క తపశ్చర్యను గూర్చి తెలిపిన దెల్ల ..యును కేవలము కథా మాత్రమేనా ? పూజ్య పాదులగు నా జన్మదాతా! నన్ను రాష్ట్రోద్ధారక కార్యము కొరకే నిర్మాణ మొనర్చినారు. పూజ్యమహర్షులు నాకు అఖండ, ఆజన్మ బ్రహ్మచర్య వ్రతదీక్షను ప్రసాదించినారు. పూజ్య మాతా పిత రులగు తాము ఈ కార్యమున తమ సంపూర్ణ సమ్మతిని ప్రసాదించినారు గదా! ఇప్పుడు తాము నన్ను పరీక్షించుటకే యిట్లు పలుకుచున్నారా ? అని ఆంజనే యుడు అనినాడు.

అపుడు పవనుడెంతో ప్రేమతో హనుమంతుని గాఢ పరిష్వంగన మొనర్చు కొని శిరమును మూర్కొని నాడు. ''కుమారా ! నిజముగనే నిన్ను పరీక్షించ దలచి ఇట్లడిగినాను. గురుపాదులును మరియు నీవును దెలిపిన విషయముల న్నియును యథార్థమే. ప్రియతనయా ! నీ విట్లు ఏకాంతమందుండి తన్మయ త్వమున వేదము నందలి బ్రహ్మచర్య సూక్తమును స్వాధ్యాయ మొనర్చుటను గాంచి పరమానందమైనది. ఐనను నిన్నీ విధముగ పరీక్షించి యథార్థమును దెలిసి కొనుట నా కర్తవ్యమని తలచినాను. నేడు నా యానందమునకు మేరలేదు. నా వల్ల గలిగిన వ్రత భంగమునకు ప్రాయశ్చిత్త విధానము నీ ద్వారా ఈ రూపమున సంపూర్ణ మగునని నాకు ప్రగాఢ విశ్వాసము గలదు. ఇందువల్ల నీవు పితృ ఋణము నుండి ముక్తుడ వగుటయే గాక దేశోద్ధారకమను దైవకార్య నిర్వహణము వలన నీ కీర్తి యుగయుగాంతముల వరకు స్థిరముగా నుండగలదు. ఈశ్వరుడు నీకర్తవ్య మార్గమును ప్రశస్త పరచు గాక.

ఇదే సమయమున అంజనా మాతయు అచ్చటికి వచ్చినది. ఈ ప్రసం గము నంతయును విని హృదయరత్నమగు హనుమానుని తన హృదయము నకు హత్తుకొని ఆతని దీక్షా సఫలతకై ఆశీర్వదించినది. ఇట్లు తమ ఏకైక పుత్ర రత్నమును రాష్ట్ర కార్యమున కర్పించు జననీ జనకులను దశదిశలు వేనోళ్ల కీర్తించి నవి. **''మాతా, నిర్మాతాభవతి, పితాభవతి మంత్రదా''** యను ఋషుల వాక్కులు ఆకాశమున ప్రతి ధ్వనించినది.



యువతరపు యోగ్యనాయకుడు

## ౧౮. యువతరపు యోగ్య నాయకుడు

మహావీరాంజనేయుడు రావణుని పక్షమున విజయ ప్రాప్తి నందినను తన పరాజయ అనుభూతినే పొందినాడు. జైత్రయాత్ర నుండి తిరిగి వచ్చిన పిదప ఆత్మ వంచనా బాధతో వ్యధ పడినాడు. చివరికి ' ఇదియును భగవత్కార్యము నందు ఒక భాగమే యని తృప్తి పడి వైయక్తిక భావముల నణచిపెట్టి కర్తవ్య బుద్ధికే ప్రాధాన్యత నిచ్చినాడు. శిష్యుని మానసిక పరిస్థితిని గురుదేవు లెరిగి యుండియును అనుకూల సమయమును ప్రతీక్షించు చుండిరి.

అగస్త్య మహర్షి యొకనాడు హనుమంతుని సాధనా స్థలమునకు వచ్చినాడు. ఆంజనేయుడప్పుడు యోగసాధనమున తల్లీనమై యుండెను. ఎదుట నిలిచియున్న గురుదేవులను గాంచి '**ధన్యోస్మి, అహోభాగ్య**' మని పలుకుచు గురువుల పాదస్పర్శ యొనర్చి, వినయాభివాదన మొనర్చి ఆశీస్సుల నందికొనినాడు. ''భగవాన్ ! ఎంతో కాలమునుండి తాము విశేషముగా స్మరణకు వచ్చుచున్నారు. దర్శనార్థము మనస్సు తహ తహలాడుచున్న'' దని విన్నవించినాడు.

ప్రియకుమారా ! ఈ మనస్సనునది '**నిస్తంత్రితంత్రి**' ఈశ్వరుని అత్యద్భుత సృష్టి యందిది యొక మహా విచిత్రము. నీ హృత్తంతుల నుండి వెడలిన స్వరములు నా హృదయ తంత్రులను ఝంకృత మొనర్చి వేసినవి. నా పరిస్థితియు ఎంతయో కాలము నుండి ఇట్లే యున్నది. నేను ఇప్పుడొక సందేశము దెచ్చినాను. మన మెంతో కాలము నుండి నిరీక్షించుచున్న సమయము ఇప్పుడు వచ్చినది. 'పుత్రా! నీవు గురుకులమున జేరిన కాలమున అయోధ్యా నగర రాష్ట్రమున గల వశిష్ఠ మహర్షి యాశ్రమమునకు నిన్ను దీసికొని పోయిన విషయము, అచ్చట నలువురు రాజకుమారుల సందర్శన మొనర్చుకొనిన విషయము నీకు జ్ఞాపకముండియే యుండును.'' అని స్ఫురణకు దెచ్చినాడు.

'' ఔనౌను, గురుదేవా ! జ్ఞాపకమునకు వచ్చు చున్నది. చాలా కాలము క్రిందటి విషయమిది. పెద్ద రాజ కుమారుడగు శ్రీరాముని వీర శాలీనత్వ మిశ్రిత సౌందర్యము నన్నాతని భక్తునిగానే చేసి వేసినది. గురుకులమునకు తిరిగి

వచ్చిన పిదప గూడ నే నెంతో కాలమాతని మరుపలేకపోయినాను. కుమారా ఏమి జరిగినదో తెలియదు''. అని ఆంజనేయుడనగానే మహర్షి ''కుమారా ! శ్రీరాముని జనన విషయమున గూడ మహర్షుల యోజనయే నడచియున్నది. విశ్వామిత్రుని యాగ సంరక్షణము రామలక్ష్మణుల ద్వారా నిర్వహించబడుట, తాటక వధ, సుభాహు మరణము, మారీచుడు గాయపడి పారిపోవుట, సీతా స్వయంవరము మున్నగునవి మహర్షుల ప్రణాళిక కనుగుణముగానే జరిగెను'' దని తెలిపినాడు. శ్రీరామ వనవాసము, ఆయన ఋష్యాశ్రమములకు పోవుట, మానవాస్తికల ప్రోవులను గాంచుట, ధ్వంసమై యున్న ఋష్యాశ్రమముల గాంచి అసుర సంహార ప్రతిన యొనర్చుట, మొదలగు విషయములను దెలిపినాడు. శ్రీరాముడు వశిష్ఠ విశ్వామిత్రుల గురుకులము అందు ధనుర్విద్య నభ్యసించిన మీదట విశేషవైజ్ఞానిక అస్త్ర శస్త్ర ప్రాప్తికై ముని యాశ్రమములకు రాగలడు. అప్పుడు నీ విషయమాతనికి జ్ఞాపక మొనర్తు'' ననియు తెలిపినాడు.

''కుమారా ! రామ రావణ యుద్ధము తప్పక జరిగి తీరును. దాని యందు నీ యపూర్వ వీరత్వము, శక్తి సామర్థ్యములను ప్రదర్శించవలసి యున్నది. మరొక విషయము, వానర రాష్ట్ర రాజనీతి ఒక క్రొత్త మార్గమును నడచుచున్నది. ఒక చిన్న నేరమును నెపమున వాలి తన తమ్ముడగు సుగ్రీవుని రాజ్య బహిష్కార మొనర్చి సౌందర్య వతియగు సుగ్రీవుని భార్యను చెరగొనినాడు. అతనికి ప్రాథమిక పౌరహక్కులను సైతము లేకుండా చేసినాడు. వానర రాష్ట్ర స్వాతంత్ర్యాభిమానులు, ఆర్య సంస్కృతిని ప్రేమించునట్టి ప్రజలు వాలియొక్క యీ రాజనీతి పద్ధతి మునుగాంచి ఇదివరకే అసంతుష్టులై యున్నారు. ఇప్పుడు తమ్ముడగు సుగ్రీవుని యెడ సలిపిన దుర్వ్యవహారములు, అత్యాచారముల వలన ప్రజలు అనేకులు ఆతనికి విరోధులైయున్నారు. అసంతుష్టులై యున్న ప్రజలకిప్పుడు సరియైన మార్గదర్శకమొనర్చు నాయకుడవసరమై యున్నాడు. యువతరము, మరియు బుద్ధిజీవులెల్లరును నీయాచరణము వల్ల గొప్పగా ప్రభావితులై యున్నారు. ఇక సామాన్య ప్రజలు ప్రముఖ రాజ వంశీయుడవగు నిన్ను తమ నాయకుడుగా ముందుంచుకొని నీ కను సన్నలలో యుందురు. ఇక నీ విప్పుడు సుగ్రీవుని ముందుంచు

కొని ముందంజవేయుము. సమాన హృదయములు పరస్పరము ఆకర్షించుకొన గలవని నాకు సంపూర్ణ విశ్వాసము గలదు. ఈ ఘటనా చక్రమునకు ఆధారమై యున్న శ్రీరాముని సహకారము వల్ల నీవు వాలిపై ఘన విజయమును సాధించ గలవు. ఆ తరువాత శ్రీరాముని వంటి యోగ్య నాయకత్వమున వానర రాష్ట్ర మంతా ఏకమై అసుర రాష్ట్రమును సర్వనాశన మొనర్చుటలో ఆవశ్యముగ సఫ లము నొందగలదు. ఈ విధముగా అసుర సభ్యత నాశనమైన పిదప వానర, రాక్షస రాష్ట్రములందు వైదిక సంస్కృతి యొక్క విజయ వైజయంతి నభో మండ లము నందెగిరి. పాప తాప భారమున కృంగిపోవుచున్న ధరణీమాత భారము తేలిక యగును. ఇంతేగాక రాష్ట్రోద్ధారకము వలన జీవన ధ్యేయమును సాధించి స్వజీవనమును ధన్యమొనర్చు కొనుటతో బాటు నా తపస్సాధనమును సఫల మొన ర్చిన వాడవగుదువు. ఇక నీవు ఇప్పుడొక్క క్షణమైనను వ్యర్థ పుచ్చక క్రాంతి ధ్వజమును లేవనెత్తు'' మని యనెను. ఇది యంతయును వినిన వెంటనే వీర హనుమంతుడు గురు చరణముల నంటి విప్లవ ధ్వజము నెత్తి క్రాంతి శంఖమును పూరించినాడు.

## ౧౯. విప్లవ శంఖారావము, క్రాంతి ప్రేరణ

ఋష్యాశ్రమమునకు సమీపముననే ఒక విశాల ప్రదేశమున నేడొక విశాల వానర యువక సమ్మేళన మేర్పాటు చేయబడినది. సమస్త వానర రాష్ట్ర మందలి సంకల్ప శీల యువకులకు ఈ సమ్మేళన సూచన లెట్లు ఎప్పుడు అంద జేయ బడినవో ఇతరులెవ్వరికిని ఏ మాత్రమును దెలియదు. నిర్ణీత సమయమున రాష్ట్రో ద్ధార వ్రత దీక్షిత వానర యువకులు మిడుతదండువలె పరుగెత్తి వచ్చు చుండిరి. వారెల్లరును క్రమ శిక్షణలో నిశ్శబ్దముగా గూర్చుండి యుండ, యువకుల హృదయ సామ్రాట్టు మహావీరుడగు హనుమంతుడు యువక మహా సమూహము నుద్దే శించి ఇట్లు ఉపన్యసించినాడు.

''సోదరులారా ! ఆర్యుల పుణ్యభూమి యగు ఆర్యావర్తనమునకొక

అంగమగు మన వానర రాష్ట్రము నేడు ఆసురీ సభ్యతా దాస్యము ననుభవించు చున్నది. కేవలము చెప్పుకొనుటకే ఇది మన రాజ్యము, స్వరాజ్యము. కాని నిజముగా నిది సురాజ్యము మాత్రము గాదు. ప్రబల పరాక్రమ శాలి. అద్వితీయ శూరవీరుడు మహారాజగు వాలి మన యేలికయై యున్నాడు. కాని లంకేశుడగు రావణుని అధునాతన వైజ్ఞానిక మారణాస్త్ర శస్త్ర నిర్మాణముల తళుకులకు మహారాజు నేత్రములు భైరులు గ్రమ్మినవి. రావణుడు అధునాతన వైజ్ఞానిక మారణాస్త్రముల భౌతిక సఫలతలు సంపాదించుకొని వాని వల్ల నాతడున్మాదియై పోయినాడు. వాని యహంభావము ఆకాశము నందుకొనినది. సృష్టికర్త యొక్క అస్తిత్వమునే సవాలు చేయుచున్నాడు. స్వర్ణ లంక వాని యాత్మను నిద్రలో ముంచి వేసినది. చతుర్వేదములను షడంగములను అధ్యయన మొనర్చి 'దశానను' డని యనిపించు కొనియును రావణుడు తన యాచరణ ద్వారా ఆత్మ పరమాత్మల యస్తిత్వమునే స్వీకరించ నిరాకరించినాడు. వైదిక యజ్ఞముల విధ్వంసమొనర్చి వాని యందు మద్యమాంసాదులను వేయించు చున్నాడు. ఋషుల నుండి పన్ను (సుంకము) లను రాబట్టు కొనుట, అది చెల్లించ లేని వారి ననేక రీతుల మార్మిక హింసల పాల్జేయుట, ఋష్యాశ్రమము లను నాశన మొనర్చుట మున్నగునవి రాక్షస సైన్యమునకు నిత్యకృత్యములైనవి. మద్య మాంసాదుల సేవనము విచ్చలవిడిగా నున్నది. పాపాత్ముడగు రావణుడు సౌందర్యవతులగు స్త్రీల నెందరినో చెరగొని వారి సతీత్వమును నాశనమొనర్చినాడు. నలుదిశలందును అత్యాచార, అనాచార, వామాచారములు నగ్న తాండవము జేయు చున్నవి.

మన మహారాజగు వాలియొక్క బలపరాక్రమములను మీరెరుగుదురు గదా! ఒక మారు ఆయన ఈ పాపాత్ముడగు రావణుని ఆరు నెలల వరకు తన చెరసాల యందుంచినాడు. ఇంతటి పరాక్రమ వంతుడై యుండియును వానితో నీ విధమగు సంధి యేల జేసికొనినాడో తెలియుట లేదు. ఇంతేగాక మన మహారాజ్య పవిత్ర వైదిక భూమి యందలి అనేక స్థానము లందు రాక్షసుల స్కంధావారము (సేనానివేశము) లేర్పరచుకొనుటకు సమ్మతినిచ్చినాడు. ఇక దాని

రిణామము? మన యెదుటనే యున్నది. ఈ ఋషి భూమిపైననే ఋషుల
హాక్రందనములు విని పించుచున్నవి. మన అక్కసెల్లెండ్ర , మాతృమూర్తుల
లములకు రక్షణ లేదు. మన క్రొత్త తరమే మారిన వాతావరణము వల్ల మదిరా
మాంసాదుల సేవనము మున్నగు అనేకానేక దురాచారముల వాత బడిపోవుచున్నది.
మన పూర్వజులు పరిహసించబడుచున్నారు. విజ్ఞానము పేరుతో ప్రచ్ఛన్న భౌతి
కారాధన మానవుని హృదయ విహీనులనుగ, పశువుల కన్నను పతితులనుగ జేసి
సినది. పరమ పవిత్రమగు వైదిక సంస్కృతీ శిథిలములపై అసురీ సభ్యత యొక్క
ఈ తాండవ నృత్యమిపుడు పూర్తిగ అసహ్యమైపోయినది. లెండు; కర్తవ్యము
యొక్క ఆహ్వానమును, కాలము యొక్క పిలుపును వినుడు. ప్రియమైన మాతృ
భూమి యొక్క ఈ మానసిక దాస్యము, ఈ బౌద్ధిక బానిసత్వము, ఈ
సాంస్కృతిక వినాశకర మార్గమున నడువ నిష్టము లేనివారు. శరీరము కన్న ఆత్మా
భిమానమే అధిక ప్రియముగ నెంచువారును లెండు; లేచి యీ బలిదాన మార్గ
మున మాయడుగు నీడలో ముందుకు నడువుడు''

ఇదే భావావేశమున మహావీరుడింకా యిట్లు చెప్పుచున్నాడు. ''మనము
క్రాంతి కేతనము నెత్తినాము. ఈ పతాకము ధర్మపతాకము, సత్యము, మరియు
న్యాయ పతాకము, ప్రేమ సద్భావముల పతాకము, సంస్కృతీ సదాచారముల ధ్వజ
మునై యున్నది. స్వంత బిడ్డలవలెనే రాష్ట్రమందలి వందలాది బిడ్డల భవిష్య
త్తును ప్రేమించు వారును, మన తల్లులు అక్క సెల్లెండ్ర వలెనే రాష్ట్రము నందలి
సమస్త మాతృమూర్తులు, సోదరీమణులని యెంచు వారెల్లరును రండు. కా
లను బిగించుడు. మన మెల్లరమును రాష్ట్రోన్మాదులము సమయము పిలుచు
చున్నది. మాతృదేవతలు తమ వీరపుత్రులను, సోదరీ మణులు తమ శూర సో
రులను, కుల వధువులు తమ మాంగల్య తిలకములను ఈ రాష్ట్ర యజ్ఞమ
నందాహుతి నిచ్చుటకు ధీర సంకల్ప మొనర్చుడు. ఈ అనాచారము, దు
చారము, అత్యాచారము, బౌద్ధిక దాసత్వము, సాంస్కృతిక పరాధీనత్వము
నాశనమొందించుటయే మన ధీర సంకల్పము. అది సిద్ధించు వరకు విశ్రమిం
నది లేదు. మనము కేవలము క్రాంతినే గాదు, సంక్రాంతిని, సమ్యక్క్రాంతి

క్రాంక్షించు చున్నాము. ఏదో వ్యర్థముగా రాజ పీఠములను మార్చుట గాదు. సాంస్కృతిక క్రాంతి, సంక్రాంతి'' అని యుద్ఘోసించినాడు.

## ౨౦. పద్మరాగ అశ్రుతర్పణ తపము

యువ శిరోమణి, మహావీరుడగు హనుమంతుని ఉత్తేజితమగు ఉపన్యాసమును క్రాంతి స్వరము సంపూర్ణ వానర రాజ్యమునందు మార్మోగినది. హనుమానుని ఓజోవంతమగు వాణి, తేజోవంతమగు క్రాంతి, ఆహ్వానము వానర రాజ్యమంతయు వినినది. పద్మరాగ కూడ వినినది.

సుగ్రీవుని సేనాధ్యక్షుడగు నీలుని ఏకైక పుత్రికయే ఈ పద్మరాగ. ఈమె నిర్మాణము ఏదో విశేష కారణమున, విశేష తంతువులతో జరిగి యుండును కాబోలు. పసితనము నుండి ఎల్లప్పుడును నిస్పృహ, ఉదాసీనత, మరియు తనలో తాను మునిగిపోయి మై మరచి నట్లుండును. అత్యంత సౌందర్యవతి యగుటయే గాక దైవ పరాయణత్వము, విశిష్టత, వినయ విధేయత, వినమ్రత యను మహానిధుల కధిపతియై యుండెను. యవ్వన దశలో నడుగిడినది. 'వేదాధ్యయన' మనున దొకే కోరిక, రాష్ట్రోద్ధారణ' మనున దొకే కార్యక్రమము ఆమె దృష్టి పథమున నుండెను. ఇవి యన్నియును పూర్వజన్మ సంస్కారముల పరిణామము గాక మరేమగును ?

పద్మరాగ యిప్పుడు పూర్ణ యవ్వనవతి. తల్లిదండ్రులు, మరియు ఆచార్యాలగు 'బుద్ధిమతి' గారనేక వీర యువకుల చిత్రముల దెప్పించి చూపి యోగ్యుడగు నొకని వరించుమని కోరినారు. కాని అప్పుడే వివాహ ప్రయత్నముల నొనర్చ పలదని తల్లి దండ్రులను ప్రార్థించినది.

ఒకనాడు పద్మరాగ తన గదిలో గూర్చుండి అథర్వ వేదము నందలి పృథ్వీ సూక్తమును పఠించు చుండెను. మాతృభూమి యెడ నున్న భక్తి తరంగము లామె హృదయ సరోవరమున నల్లల్లాడుచుండెను. ''పరమేశ్వరా ! నా పవిత్ర రాష్ట్రమున భౌతిక దాస్యమంతరించి ఏకమాత్ర విశ్వసంస్కృతి, వైదిక

సంస్కృతి సామ్రాజ్య నిర్మాణ మెప్పుడు జరుగునో, భగవాన్! రాష్ట్రోద్ధారమను బృహద్యజ్ఞమున నే నొక సమిధగా నా జీవనాహుతి నెప్పుడీయ గలుగుదును? అని తలపోయుచుండెను. సరిగా నదే సమయమున రాష్ట్రమందలి వాయు మండల మందంతటను యువనాయకుడగు వీరహనుమంతుని ఆ వీర శంఖానాదము ప్రతిధ్వనించి ఆమె హృదయాంతరాళమునను ప్రవేశించినది. (అంతః ప్రేర ణనే కావ్య భాషయందు 'ఆకాశవాణి, అశరీరవాణి' అని పేర్కొందురు.) ఆమె యంతరాత్మలో "వేలాది సోదరీ మణుల తిలకమును, సతీత్వమును, సమ్మానమును రక్షించుటకై తల్లులు తమ వీర తనయులను, సోదరీ మణులు నృసింహులగు తమ సోదరులను, మహిళామ తల్లులు తమ తిలక మాంగల్యము లను ఈరాష్ట్ర మహాయజ్ఞము నందాహుతి నిచ్చు సమయము వచ్చినది". అను వాక్యములు ప్రతిధ్వనించినవి.

వేద గ్రంథము తెరచినది తెరచినట్లే యుండెను. పద్మరాగ ఇప్పుడా లోచనా లోకమునందున్నది". మా యువనాయకుడాహ్వానించు చున్నాడు. నేను సోదరులు లేని దాని నగుట వల్ల సోదరి కర్తవ్యమును గూడ నెరవేర్చుకోలేక పోవుచున్నాను. నే నిప్పుడు ఈరాష్ట్ర మహాయజ్ఞమునందు నా యాహుతి నెట్లిడుదును? భౌతిక సుఖ భోగ వాంఛలను వదలి మేము ఆజన్మ బ్రహ్మచర్య వ్రత దీక్షాధారులమై మహిళల మగు మేము మా యాత్మాహుతి నర్పించలేమా? ఏల కాకూడదు? నేను కూడా మహా వీరుడగు హనుమంతుని వలె ఆజన్మ బ్రహ్మచారిణిగా నుండి ఆతనికొక యాదర్శ సోదరిగా రాష్ట్ర జీవితమున ప్రవే శింతును. ఇక రాష్ట్ర మహాయజ్ఞమున నేనుఅర్పించు ఆహుతి అతిశ్రేష్ఠమైనదగును

ఈ యాలోచనయందే మునుకలు వేయుచు పద్మరాగ పునః పృథ్వీ సూక్త పారాయణమునందు నిమగ్నురాలైనది. ఆ సమయముననే ఆచార్యు లగు 'బుద్ధిమతీదేవి' గారు వచ్చి తన శిష్యురాలగు పద్మరాగ వేదాధ్యయనము సంపూర్ణముగా తల్లీనమై యుండుటను గాంచి పరమ సంతుష్టురాలైనది. త వాత శిష్యురాలి వందనములందుకొని ఆశీర్వదించి "ప్రియపుత్రీ! నేడు వింత ప్రసన్నురాలవై యుండుట నాకెంతో సంతృప్తిని గలిగించినది. విశేషమే

మో చెప్పగలవా? అని ప్రశ్నించినది. అందుకు పద్మరాగ ''జననీ! వానర రాష్ట్రమునకు దాస్య విముక్తిని గలిగించి పరమ పవిత్ర వైదిక సంస్కృతీ ధ్వజము నెగుర వేయుటకు ఆంజనేయులు విప్లవ శంఖమును పూరించిన వార్తను మీరు వినలేదా''? అని పలికి తన సంపూర్ణ మనో భావములను తన యాచార్యకు నివేదించినది.

ఆచార్యురాలీ విషయమును విని స్తంభితురాలైనది. తన శిష్యురాలి స్వభావము మరియు నిశ్చయ యదార్థ్యము నెరిగి యున్న కారణమున కేవలమపుడు ''పుత్రీ! నీ యాలోచనలు నిశ్చయముగా శుభదాయకములై యున్నవి. కాని స్త్రీలకీ మార్గమెంతటి దురూహ్యాము, దుర్గమమై యుండునో తెలియువా?'' అని మాత్రమే యన గలిగినది. అందుకు పద్మరాగ అతి వినీత స్వరమున నిట్లనినది. జననీ! ఐతే ఇంత కాలము తమ శ్రీచరణ సన్నిధిన గడిపిన ప్రియ శిష్యురాలి మనోతత్త్వమును గురువుగా నెరుగలేదనియే తలచవలెనా ? క్షంతవ్యురాలను. దేవీ! తామొక తడవ '' ఆమె మహాశక్తి, ఆమె పురుషునికి మాతయే గాదు, నిర్మాత, మరియు ప్రేరణ స్రోత యనియును, ఆమె పత్ని రూపమున, మాతృ రూపమున, సోదరీ రూపమున ప్రతి క్షేత్రమందును దృఢనిశ్చయముతో పురోగామియై ఆశ్చర్య జనకములగు ఉపలబ్ధులను ప్రాప్తించుకొనగల'' దని ఉపదేశించితిరి గదా! అమ్మా! ఋషుల వలెనే ఋషికలు గూడ పవిత్ర వేద మంత్రలాభము, దర్శనముల సౌభాగ్యములను పొందలేదా ? రాజనీతి, రణక్షేత్రములందును స్త్రీ చేయజాలని దేమున్నది? ఆ జన్మ బ్రహ్మచర్య వ్రతధారులైన, బ్రహ్మవాదినులైన నారీమణులు గూడ ఈ మహాదేశ పవిత్ర భూమియందు జనన మొంది యుండిరి గదా ? తాము తమ శిష్యురాలిపై సంపూర్ణ విశ్వాసముంచుడు'' అని యనినది.

ఆ పిదప ఆచార్యురాలగు బుద్ధిమతిగారు ఇక నేమియును జెప్ప జాలక కేవలము ''అమ్మాయీ! మంచిది. నీ దృఢనిశ్చయమిదియే అయిన నే నెట్లో నీ తల్లిదండ్రులను సంతుష్టి పరచెదను. ఐనను నిశ్చయమును క్రియా రూపమున నుంచుటకును, వ్రత దీక్షగొనుటకును మహర్షి అగస్త్యుల అనుమతి, మరియు

మార్గదర్శకత్వమును పొందుటకును నీవు నావెంట మహర్షి యాశ్రమమునకు రావలసి యుండు'' నని తెలిపినది.

ఆచార్య యొక్క ఈ యనునయ వాక్యములను విని పద్మరాగ సంతోషమును బట్ట జాలకపోయినది. ఆచార్య బుద్ధిమతిగారు తన వాక్చమత్కృతి వల్ల ఆమె జననీ జనకులను సంతృప్తి పరచి యొప్పించినది. తమ ఏక మాత్ర సంతానమును రాష్ట్ర హితమునకై సమర్పితమొనర్చు సౌభాగ్యము గొప్ప పుణ్య ఫలితమే యని తెలిపినది. తరువాత తన శిష్యురాలిని అగస్త్య మహర్షి యాశ్రమమునకు దీసికొని పోయినది. సంపూర్ణ విషయములను దెలిసికొనిన తరువాత అగస్త్య మునివర్యులు ' ఇకనిప్పుడు రాష్ట్రము, మరియు మానవత్వము యొక్క భాగ్యోదయము నిశ్చితమైనది''. అని పరీక్షించుటకు గాను పద్మరాగతో ''పుత్రీ! నీవు మహావీర హనుమానుని ఆదర్శ సోదరి రూపమున నీ మహాబాధ్యతల నెట్లు నిర్వహించెదవు?'' అని ప్రశ్నించినాడు.

''పూజ్య ఆచార్యా! ఇందుకు మార్గదర్శకత్వము తామే యొనర్చవలసి యుండును. పూజ్య సోదరులగు ఆంజనేయుల వలెనే వారి దళము నందలి ప్రతి సైనికునికి వీర తిలకము నలంకరించి నేను రాష్ట్ర రక్షణ కార్యమున వారికి ప్రోత్సాహము గలిగింతును. వారి తల్లుల, పత్నుల, సోదరీమణుల మనోబలమును పెంపొందించుచు నూ మహానాయకులగు పూజ్య హనుమంతుని ఈ పుణ్య కార్యమున మాతృమూర్తులు, సోదరీ మణులు, పత్నులు నవ్వుచు నవ్వుచ తమ తనయులను, సోదరులను, భర్తలను, మరియు దేశమందలి యువశక్తి సంస్కృతీ సంరక్షణమునకై కర్మక్షేత్రమునకు పంపుటకు దేశమాత పిలుచు చున్నది అను పూజ్య సోదరుని సందేశమును వినిపించుచు అందుకు దగిన భూమిక సిద్ధ పరచెను. యుద్ధమున నిహతులైన వీరుల భార్యలకు, తల్లులకు, ఓదార్పు గలిగించెదను. గురుదేవా ! తమ యాజ్ఞయైనచో నేను మహిళా కార్యకర్తల సంఘటిత పరచి క్షతగాత్రుల సేవా శుశ్రూషలకై పరిచర్యా శిబిరములను న పుదును. ఒక వేళ దేశ యువతరము యొక్క రక్తము చల్లబడినచో వానర రా

మహిళా శక్తిని ఆహ్వానింతును. పురుష శక్తి పిరికి పాలైనపుడు స్త్రీ మహాశక్తి విజృంభించునని తమ బోటి పూజ్య వరులే సెలవిత్తురు గదా ! అని యనిసది.

''కుమారీ ! నీవు ధన్యురాలవు. ఇంతవరకు మా యాలోచనల కందని విషయములను ప్రకటించితివి. ఇవి అత్యధిక మహత్వ పూర్ణమైనవి. యుద్ధము కేవలము యుద్ధ క్షేత్రముననే జేయబడదు. నిజమునకది దేశమందలి జనమంతయును జేయుచుండును. కృషీవలుడు పొలమున అధిక ధాన్యమును బండించుట, వైజ్ఞానికుడు కర్మాగారము (ఫ్యాక్టరీ) లలో క్రొత్త క్రొత్త ఆవిష్కారముల ద్వారా గొప్ప పరిమాణములలో అస్త్ర శస్త్రముల నిర్మాణము గావించుట, వ్యాపారులు అధిక లాభముల కాశించక దేశ ప్రజలకు సరసమగు ధరలకు భోజ్య పదార్థముల నందించి యుద్ధ విజయమునకు తోడ్పడుట, సామాన్య ప్రజలు చట్టము, మరియు, యుద్ధ నియమములను చక్కగా పాలించుట. పుకారులను, వదంతులను నమ్మక మనోబలమును పెంపొందిచుకొనుట, మున్నగు కార్యముల దేశమందంతటను గృహములందు గూర్చుండి మహిళామణులెల్లరును తమ వీర పుత్రుల, సోదరుల, పతుల దిగ్విజయమునకై పరమేశ్వరుని ప్రార్థించుచు వారు అతి సంతోషముగ రణ క్షేత్రమునకు సాగ నంపుచు రాష్ట్రమున కేంతో సేవ జేయ గలరు. పుత్రీ! నీ కర్తవ్య పాలనమున నాకు సంపూర్ణ విశ్వాసము గలదు''. అని చెప్పి బుద్ధి మతీ దేవిగారిని సంబోధించుచు ''ఆచార్య గారూ ఇంతటి సుయోగ్య కర్తవ్య పరాయణురాలగు శిష్యురాంద్రను రాష్ట్ర సేవార్థము తమ సర్వస్వము ఆహుతి యొసర్చుటకు సిద్ధ పరచినందులకు మీకు కోటి కోటి ధన్యవాదములు. మీ శిష్యురాలు వ్రతదీక్ష గొనుటకు సంపూర్ణముగ అధికారు రాలే'' అని ఆచార్యులు తెలిపినాడు.

మహావీర హనుమంతుడు సంయోగ వశమున ఆశ్రమ మందే యుండెను. ఈ విషయము చర్చ జరుగుచుండగా అచ్చట నే యుండి వినుచుండెను. విషయములన్నియు వినిన తరువాత ఉత్సాహము నాపుకొనలేక ఆచార్యుల సన్నిధి జేరి వారి యనుమతితో పద్మ రాగను సంబోధించుచు ''ప్రాణ మానురాలవగు ఓ సోదరీ ! నీవు నా జీవితములో గల లోటును పూర్తి జేసినావు.

నీవు అంజనామాత గర్భము నుండి ఉద్భవించకున్న నేమాయె. నిన్ను నేను ధర్మ సోదరీ రూపమున స్వీకరించి గర్వించు చున్నాను. ప్రపంచమునకు తల్లి, భార్యల సంబంధములకన్న అధిక పవిత్రము, అధిక మధురము. సోదరి నిస్వార్థము, అధిక మహనీయమునై యున్నది. నాకు నీవు సోదరిగా లభించుట అదృష్టము. సోదరీ! నీ కర్మ క్షేత్రము గృహమే. నీ మనోభావములు అత్యంత గౌరవనీయములు. నీవు యుద్ధ క్షేత్రమున ప్రవేశించు యవసరముండదని విశ్వసించుము. నీకు నీ సోదరుని పౌరుషమునందు సంపూర్ణ విశ్వాసము గలదు. దేశ యువశక్తి యందును నీకు విశ్వాసము గలదు. వారి కుటుంబములను నీవు పరిరక్షించవలసి యుండును. వారి మహిళా మణుల మనోబలమును పెంపొందించవలసి యుండును.

నీవంటి వీర విదుషీ బాలికలుండు దేశము అభివృద్ధి, విజయములను సాధించుటలోనే మాత్రమును ఆలస్యము జరుగదు. సోదరీ ! లెమ్ము ! ముందుకు వచ్చి కర్తవ్య క్షేత్రమున దుముకుటకు నీ సోదరుని నుదుట వీర తిలకము నుంచుము. నీ యనుకరణము దేశ సోదరీ మణుల కందరకును అనుసరణీయ మగును. ఇదియే రాష్ట్రోద్ధార వ్రతదీక్షకు ప్రారంభోత్సవమగును.

అచ్చటి వారందరి సమక్షమున ఒక ఆదర్శ సోదరి ఆదర్శ సోదరునికి హర్షాశ్రువులతో జలకమాడించినది. పద్మరాగ యొక్క ఈ యశ్రువులు కృతజ్ఞతా పూర్ణమై యుండెను. మహావీరుడగు హనుమంతుని సోదరుని రూపమున పొంది నిజముగ నామె ధన్యురాలైనది. అప్పుడే ఆచార్యులు, ఆచార్య యిరువురును కర్తవ్య క్షేత్రమున ప్రవేశించుటకు ఆశీర్వాదములతో ఆదేశించినారు.

సకల దిశలందును వజ్రాంగ హనుమానుని పౌరుషత్వము, రాష్ట్ర ప్రియత్వమును గాన మొనర్చుటతో బాటు ఇంకా ఉచ్చ స్వరమున సోదరి పద్మ రాగ యొక్క తపశ్చర్య మరియు ఆత్మ సమర్పణమునకు జయ జయ గానము లొనర్చినారు.

**ప్రథమ ఖండము సమాప్తము**



ఓ౩మ్

# శుద్ధ హనుమచ్చరితము

## ద్వితీయ ఖండము

దీనియందు

౧. కర్తవ్య ప్రాంగణము. ౨. శ్రీరామ సుగ్రీవుల మైత్రి
౩. సీతాన్వేషణము ౪. లంకా విజయము,
౫. వైదిక సంస్కృతీ సామ్రాజ్యము, లేక రామరాజ్యము.

**ఓం కుర్వన్నే వేహకర్మాణి జిజీవిషేచ్ఛ తగ్ం సమాః ।**
**ఏవం త్వయి నాన్యథేతోఽస్తి న కర్మలిప్యతే నరే ॥ యజు. ౪౦-౨॥**

పరమ పావన కల్యాణియగు వేదమాత ద్వారా ప్రభువగు పరమేశ్వరుడు స్వయముగా తన అమృత పుత్రులగు మానవుల నిట్లు నిర్దేశించు చున్నాడు.

ఓ మానవా ! నీవు కర్మల నొనర్చుచునే కర్మయోగి వై నూరు సంవత్సరములు దీర్ఘ జీవిత యాశను వదలకుము. జీవితము నందలి చరమ క్షణము, అనగా చివరి ఒక్క దీర్ఘ శ్వాస మిగిలి యుండు వరకును నీవు కర్తవ్య నిరతుడవై యుండుము. సోమరి మరియు అకర్మణ్యుడవై మంచము పై ప్రాణములను వదలకుము. నీవు కర్తవ్య కర్మ పురుషార్థము ప్రకాశ పరచు కర్మ భూమిపై మహాప్రయాణ మొనర్చ వలెను.
(వైదిక సంస్కృతి యందు ప్రాణములు త్యజించుచున్న వ్యక్తిని మంచము పై నుండి దింపి భూమిపై పరుండ బెట్టుదురు.)

ప్రియ మానవులారా ! ఈ కర్మ సంబంధములు గూడ అనాసక్త, నిష్కామ కర్మల ద్వారానే తెగిపోగలవు. బంధవిముక్తి, లేక ఈశ్వర ప్రాప్తికి ఇంకా ఇతర మార్గము లేవియును లేవు. ఐనను కోరికలు గాని, ఆసక్తి గాని లేనిదే ఎట్టి కర్మలును సంభవములు గావు. అగుచో ''నిష్కామ కర్మ'' యను దాని యర్థమేమి?

అనగా మన ప్రతికర్మ ఈశ్వరాజ్ఞ పాలనా రూపమున నుండవలయును. పరమే శ్వరుని అమర వాణి యగు వేదములు నిషేధించిన కర్మల నొనర్చక వేదములందు గల ఆజ్ఞల ననుసరించి ప్రతి కార్యమును జేయవలయును. ఇక దానివల్ల జయము గాని అపజయము గాని, లాభము గాని నష్టము గాని, యశము గాని అపయశము గాని, క్లుప్తముగ జెప్ప వలయునన్న మన ప్రతికర్మ ప్రజల సేవారూపమున నుండ వలయును. దీనిపేరే ఈశ్వరార్పణ బుద్ధితో యొనర్చబడిన కర్మ. ఇదియే లోక సాధక కర్మ. దీనినే కర్మ యజ్ఞమని యనెదము. యజ్ఞ కర్మ యనునది లోక హితమునకై పరోపకారవృత్తి, స్వార్థ రహిత బుద్ధితో జేయబడు కర్మ, ప్రజల సేవార్థము రాష్ట్రము నందలి అజ్ఞానమును, అన్యాయమును, అభా వమును (లేమిని) దొలగించు రూపమున జేయబడు కర్మలే జన్మ జన్మాంతర ములనుండి వచ్చుచున్న కర్మ బంధనములను తుంచి వేయును. ఈ కర్తవ్యాను ష్ఠానము గూడ నిజమైన ఈశ్వర భక్తియే.

ఈశ్వర ప్రాప్తికి ఈ కర్మ యోగమే ఏకైక సాధనము. మన పూర్వ జులగు ఋషులు, మహర్షులు, మునులు, మహాత్ములు, సన్న్యాసులు, వాన ప్రస్థులు, గృహస్థులు, బ్రహ్మచారులు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్రులెల్ల రును ఈ రాష్ట్ర సేవా రూప కర్మయోగ సాధననే యొనర్చు చుండిరి. ఆ కాల మున ఈశ్వర భక్తి యనునది అకర్మణ్యత, సోమరితనమునకు పర్యాయముగ నుండెడిది గాదు. సన్యాసమని దాని యర్థము, కర్తవ్య త్యాగము గాదు. రాష్ట్ర హితమునకై తన వ్యక్తిగత కోరికలను త్యజించి తన కర్తవ్య క్షేత్రము నింకా అధిక వ్యాపకము నొనర్చుటయే. వశిష్ఠ, విశ్వా మిత్ర, అగస్త్య వాల్మీకి మున్నగు మహ ర్షులే యిందుకు తార్కాణము. శ్రీరామ, శ్రీకృష్ణ, వీరాంజనేయులు, సీతా, సావిత్రి పద్మరాగయే దీనికి ఉదాహరణమై యున్నారు. మధ్యయుగమందును మహారాణా ప్రతాపుడు, ఛత్రపతి శివాజీ, కబీరు మహాత్ములు, గురునానకు, గోవింద సింహులు, ఈ వర్తమాన యుగము నందును మహర్షి దయానందులు, మహాత్మాగాంధీ, నేతాజీ సుభాష్, లాల్ బహదూర్ శాస్త్రి, మున్నగు వారెల్ల రును ఈ మార్గమునే యనుసరించి పరమేశ్వర ప్రేమను పొందినారు. రండి.

మనమెల్లరమును ఈ మహా శ్రేష్ఠ స్త్రీ పురుషులను కేవలము మందిరస్థ మూర్తులు గానే జేసి వేయక కర్మయోగ మార్గమున పయనించుచు వీరి సత్య పూజల నొన ర్చుదుము. మహావీరుడగు హనుమంతుని ద్వార మనము మన కర్తవ్య ప్రాంగణ మున అత్యధిక కౌశలమును జూపుదుము.

## ౧. వానర రాష్ట్ర రాజనీతి

హనుమంతుని తపోత్యాగములు, అనుపమానమగు సాధనా సంపత్తుల ప్పుడు కార్య రూపము దాల్చినది. పద్మరాగ తపశ్చర్య ఇప్పుడు ఫలరూపము దాల్చినది. యువ వానరదళ నిర్మాణము జరిగినది. మహావీర హనుమానుడు దీనికి నాయకుడు. దేశ సేవా గేయములను పాడుచు రాష్ట్రయువశక్తి హనుమం తుని నాయకత్వమున ఏకత్రిత మగుచునే యున్నది. దుర్మార్గులగు రాక్షసులపై చిన్న చిన్న దాడులు సలిపినారు. తమ పవిత్ర రాష్ట్ర క్షేత్రమును వదలి పోవునట్లు చేయుట, మరియు ఋష్యాశ్రమ సంరక్షణమొనర్చుట వారి ప్రాథమిక ముఖ్య కార్యక్రమము. పద్మరాగ రాయబారము ద్వారా వాలి సోదరుడగు సుగ్రీవుని కోరికపై ఈ దళమాతని సైన్యమున విలీనమ్మైనది. ఇప్పుడు మహావీరుడగు హను మంతుడు సుగ్రీవుని మహామంత్రి సుగ్రీవునికి హనుమంతుని వంటి విద్య బుద్ధి శౌర్య సాహస పరాక్రమములు గల సద్గుణ నిధి మంత్రిగా లభించుటచే నతడు కృతార్థుడుగా మహావీరునికి కిష్కింధ రాజ్య రాజకీయములతో నేరుగా సంబం ధ మేర్పడు స్వర్ణావకాశము లభించినది.

వాలి వద్ద అపార సైనిక శక్తి యుండుటయే గాక స్వయముగ నాతడా కాలమున అద్వితీయ వీరుడై యుండెను. మహావీర హనుమంతుని అభిప్రా యము ననుసరించి సుగ్రీవుడు వాలితో ప్రత్యక్ష యుద్ధమునకు తలపడక దొం గదాడుల (గొరిల్లా) యుద్ధ మునే హితమని యెంచుకొనినాడు. తన అల్పకా లిక యుద్ధ శిబిరమును ఈ నిముషమొక పర్వతముపై మరొకప్పుడు మరొక పర్వతముపై నిర్మించుకొనుచు అవకాశము లభించినపుడెల్ల దాడులు జరుపు

---

నమ్మకం లేకుండాపనిచేయడం గమ్యంలేని ప్రయాణం లాంటిది.

ండెను. అవసరమును బట్టి ఒకప్పుడు నిలద్రొక్కి పోరుట, మరొకప్పుడు
ారిపోవుట, స్థిరమై యుండి నిలువకపోవుట మున్నగు గెరిల్లా యుద్ధ నీతి ద్వారా
ాలిని ముప్పుతిప్పలు బెట్టు చుండెను.

సుగ్రీవుని సైనిక యుద్ధ శిబిరమున్న ఋష్యమూక పర్వతము పై ఒక నాటి సాయంకాల సమయమున తమ యుద్ధ వ్యూహ ప్రణాళికలలో నిమగ్నులై యుండగా ఆకస్మికముగ నొక అబల కరుణాక్రందనములు వారి కర్ణ పుటము లను భేదించెను. వెనువెంటనే ఆకాశ మార్గమున శరవేగముగ బోవుచున్న వాయు యాన ధ్వని గూడ వినవచ్చు చుండెను. వారెల్లరును పై దిశకు జూచు నంత లోనే వారికి కొన్ని వస్త్రములు, అభూషణములు క్రిందికి తమ వైపే వచ్చుట గాన్పించినది. హృదయ విదారకమగు ఆర్త ధ్వనితో బాటు ఆ దేవి యుచ్చ రించుచున్న ''హే రామా! హే లక్ష్మణా!'' యను శబ్దములు కూడా వారికి స్పష్టముగ వినిపించు చుండెను. ఆ వస్తువులు సంగ్రహించి జాగ్రత్తగా భద్రపరచ బడినవి.

ఈ దృశ్యముగాంచిన తోడనే హనుమంతుడు మహో యుత్తేజితు డైనాడు. కాని యేమి లాభము ? అప్పుడే ఆ విమానమెంతో దూరమేగినది. అప్పుడందు కనువగు ప్రతీకార శక్తి ఏదియును వారి యొద్ద లేకుండెను. బుద్ధి సాగరుడు, రాజనీతి విశారదుడగు హనుమంతునికి హరింపబడి ఆకాశ మార్గ మున గొని పోబడు చున్న స్త్రీ శ్రీరాముని భార్య సీతయే యని దెలిసికొనుట కెంతయో కాలము పట్ట లేదు. శ్రీరాముని వన ప్రవేశము ఆతని ఋషుల రక్షణ ప్రతిజ్ఞ మున్నగు విషయముల నాతడు తన గురుదేవుల ద్వారా సంపూర్ణ ముగ వినియుండెను. ఇప్పుడు శ్రీరాముని ద్వారా రాక్షస వినాశకార్య మార ంభమైనదనియును, ఈ సందర్భముననే అవకాశమునకు జూచుకొని వారి భార యగు సీతామహాతల్లిని ఎవడో రాక్షసుడు (రావణుడైనను గావచ్చును) అప హరించుకొని పోవునట్టి ఘోర కృత్య మొనర్చినాడనియును దలచి నాడు. సు వుని ఏకాంతమునకు బిలిచి ఈ సంపూర్ణ యోజనా రహస్యము నాతనికి దెలి పరచినాడు. ఇక యెట్లులైనను శ్రీరామునితో సుగ్రీవుని గలుప వలెనని త

నాడు. ఆతని నేత్రములిప్పుడు రామ లక్ష్మణులను వెదక సాగినవి. వీర హనుమానుని మస్తిష్కమున భవిష్యత్కార్యక్రమముల ప్రణాళిక నిండి పోయినది''. గురుదేవులు శ్రీరామునకు ఇచ్చట జరిగిన యువక సంఘటనము, సుగ్రీవ మహారాజుతో గలిసి చేసినట్టి రాష్ట్రోద్ధార ప్రయత్నములు సంపూర్ణముగ దెలిపి యుందురను గట్టి విశ్వాసము గూడ ఆంజనేయునకు గలిగినది. మాకున్నట్లే శ్రీరామునకు గూడ మమ్ము గలిసికొనవలె'' నను యావేదన మవశ్యముగా నుండు ననియును ఆతనికి తోచినది.

## ౨. గురుకులములో శ్రీరాముని దర్శించు సమయము వచ్చినది

చివరికాదినము రానే వచ్చినది. ఆనాటి ప్రాతఃకాల సమయమున సుగ్రీవుడు , హనుమంతుడు, తదితర వానర వీరులు గలసి దైనిక యజ్ఞము జేయు ప్రయత్నమున నుండిరి. శైల శిఖరము వైపు నడచి వచ్చుచున్న తేజోవంతులగు పురుష సింహులిరువురు సుగ్రీవునకు గాన వచ్చినారు. ఆతడు వారివైపు సంకేత మొనర్చుచు 'మహావీరా ! వారెవరో చూడుము అని యనినాడు. హనుమంతుడు వారిని జూచినతోడనే పోల్చుకొని ఆనందము నిండిన స్వరముతో 'మన మెవ్వరికై ప్రతీక్షించు చుంటిమో వారే వీరు' అని తెలిపినాడు. బాల్యావస్థలో జూచిన కొన్ని గుర్తులు, వారి తేజో వంతమగు ముఖవర్చస్సు, ధనుర్బాణములు, మరియు మహర్షి అగస్త్యుని ద్వారా దెలిసికొనిన ఇతర విశేష లక్షణములను బట్టి ఈ వీర సింహులిరువురును తప్పక రామ లక్ష్మణులే' యని నిశ్చయించికొనినాడు.

'' ఐనా మహావీరా ! ఇట్టి విషయములో రాజనీతి ఏమి నిర్దేశించు చున్నది? వీరు తప్పక రామలక్ష్మణులే యని మనకు సంపూర్ణ విశ్వాసము గలిగినను వీరిచ్చటికి చేరు లోపలనే పరీక్షించుకొనుట మంచిది. ఒక వేళ వీరు.......... అని సుగ్రీవుడనినాడు.

''సుగ్రీవరాజా ! నీ యుద్దేశ్యమేమి ? దుఃఖమున మునిగి యుండి వీరు వాలి పనుపున మనను పూర్తిగ నాశనమొనర్చుటకే వచ్చు చున్నారేమో అనియేనా

నీ యనుమానము? మహారాజా! చాల చిన్న వయస్సుననే నేను శ్రీరామునితో కొంత కాలముండుట తటస్థించినది. ఆయన ప్రకృతి యొక్క పవిత్ర ప్రభావము లింకా నా మనస్స నందున్నవి. ఇక ఆతని రాక్షస వినాశవ్రత మందరకు దెలిసినదే కదా ! వాలితో నాతని కిట్టి 'దుష్ట సంధి' ని గూర్చిన యనుమాన మేమాత్రమును మనకు గలుగవలదు. ఐనను, రాజధర్మము ననుసరించి తమ యాజ్ఞాపాలన మవశ్యకముగా జేయుదును.

## 3. శ్రీరామాంజనేయుల కలయిక

ఆంజనేయుడు తన సైనిక వేషమును వీడి బ్రాహ్మణ వేషమున రామ లక్ష్మణుల సన్నిధిన నిలిచినాడు. వారిని సమీపించగనే తాను బాల్య కాలమున అయోధ్యానగర యాత్రా సందర్భమున జూచిన యొక్కొక్క చిత్రణమే జ్ఞాపకమునకు రాసాగినవి. శౌర్యముతో గూడిన శ్రీరాముని వినయము, ఆతని సౌందర్యము, తేజస్సు గల ముఖమున సీతావియోగ విషాద రేఖలు స్పష్ట చిత్రణము బుద్ధి శాలియగు హనుమంతుని యెదుట దాగుకొనలేకపోయినవి. రాజ నీతి విశారదుడగు హనుమంతుడు తన మనోభావములను వెలికి రానీయ లేదు.

ఆంజనేయుడు రామ లక్ష్మణులకు వినయ భావముతో నమస్కరించి వారికి ఉచిత పూజా పురస్కారముల నర్పించు భావముతో నాతడు (మహర్షి వాల్మీకి శబ్దములలో) హే రాజర్షులారా ! దైవ సమతేజోనిధులారా ! తాపస వేషములలో ఈ నదీ పర్వత వనముల శోభను ప్రకాశ పరచుటకు సువర్ణమయమైన సుందర ధనుర్బాణములను ధరించి, వన్య జీవులను తరింప జేయ వచ్చిన ధైర్య మూర్తులారా !సూర్య చంద్రుల వంటి తేజో ప్రకాశములు గలిగి, సింహ పరాక్రమ శాలురగు మీరెవ్వరు? ఈ ప్రాంతముల కేల వచ్చితిరి'' ? అని యడుగ నపుడు శ్రీరామ చంద్రుడు మందస్మిత వదనముతో నిట్లనినాడు.

''సౌమ్యుడవగు ఓ వీరాగ్రేసరా ! విధి నిర్ణయము నెవ్వరు త్రోయ గలరు? కోసలేశుడగు దశరథ మహారాజు నందనులము. రామ లక్ష్మణులను నామములుగల మేమిరువురము సోదరులము. పితృ వాక్పరిపాలనము కొరకు

సుకుమారియగు సీతా మహాసాధ్వి తో గూడి అడవికి రాగా సీత హరింపబడి నది. ఆమె యన్వేషణమున నిట్లు దిరుగుచున్నా'' మని శ్రీరాముడు తెలిపినాడు. ఈ మాటలు విని గద్గదుడైన యాంజనేయుడు శ్రీరాముని చరణముల స్పృశింప శ్రీరాముడాతని లేవనెత్తి గాఢ పరిష్వంగమొనర్చి యిట్లనినాడు.

''విప్రవర్యా ! మీ రిదేమి చేయుచుంటిరి ?'' అని పూర్వ స్మృతి యాధారమున, అగస్త్య మహర్షి చెప్పిన గుర్తులను బట్టి ఆంజనేయుని కొంత వరకు గుర్తించ గలిగినను, హనుమంతుని యా బ్రాహ్మణ వేషము ఆతనికి కొంత యనుమానమున బడవేసినది. కావున నాతడు '' ఓ మహాపురుషా ! దయతో మీరు మీ సంపూర్ణ పరిచయ భాగ్యమును ప్రసాదించు'' డని యనగానే హనుమంతుడాతని చరణములపై వ్రాలి ''తేజో వంతుడవగు ఓ శుభగా ! మీరీభక్తుని విస్మరించినట్లున్నారు. నా చిన్నతనమున గురు వర్యులతో మీ వద్దకు వచ్చి వశిష్ఠ మహర్షుల యాశ్రమమున మీ సహచరునిగా నుంటిని. తాము సు విజ్ఞానవంతులు, తమ పవిత్ర చరణములందు ప్రగాఢ ప్రేమనుంచు యీ బాల్య కాల భక్తుని మరచి నారా ప్రభూ'' అని యనినాడు.

శ్రీరాముడు పులకితగాత్రుడై ఆంజనేయుని హృదయమునకు హత్తుకొని ''నా ఆత్మ స్వరూపుడవగు ఆంజనేయా ! నేను మానవుడనే కదా ! మానవుని అల్పజ్ఞత్వము నీకు దెలియదా? నిన్ను గుర్తించుటకు ప్రయత్నించినాను, కాని నీ యీ విప్రవేషము నన్ను భ్రమ లో ముంచివేసినది. ప్రియ బంధూ ! లెమ్ము నీవు నాకు భరత లక్ష్మణ, శత్రుఘ్నులకన్న ఏ మాత్రమును తక్కువ కాదు. వారి వలెనే ప్రియాతి ప్రియుడవు'' అని యనినాడు. ఆంజనేయుడత్యాదర వాక్యములతో సుగ్రీవునితో సహ తన పరిచయము నిట్లొసగినాడు.

**''యువాభ్యాం సహిధర్మాత్మా సుగ్రీవః సఖ్య మిచ్ఛతి ।**
**తస్యమాం సచివం విత్తం వానరం పవనాత్మజమ్ ॥వా.రా.కిష్కి. 3.22**

మా సుగ్రీవ మహారాజు ధర్మాత్ముడు. విద్వాంసుడు. మీ మైత్రిని కాంక్షించు చున్నాడు. పవన పుత్రు డనగు నేనాతని మంత్రిని, హనుమంతుడను అని తెలిపినాడు. శ్రీరాముడు తమ్మునితో ''లక్ష్మణా'' సుగ్రీవుని మంత్రి

యగు నీ హనుమంతుడెంత చతురుడో చూడుము. ఈతడు మహా విద్వాంసుడు గాకున్న ఇంతటి కల్యాణవంతమగు వాణియందు బలుకజాలడు. ఇంత సేపు మాట్లాడుచున్నను ఒక్క పలుకైనను అసంస్కృత (అశుద్ధ) ముగా నుచ్చరించలేదు. నిశ్చయముగా నీతడు వేద వేదాంగములందు పరిపూర్ణ పండితుడనుటలో నే మాత్రమును సందేహము లేదు.

★ నా ఋగ్వేద వినీతస్య నా యజుర్వేద ధారిణః ।
నా సామవేద విదుషః శక్యమేవం విభాషితమ్ ॥ వా.రా. కిష్కి. 3వ సర్గ ౨౮॥
★ నూనం వ్యాకరణం కృత్స్నమనేన బహుధా శ్రుతమ్॥
బహువ్యాహరతానేన న కించి దపశబ్దితమ్ ॥ ''౨౯''
★ న ముఖే నేత్రయోశ్చాపి లలాటే చ భ్రువోస్తథా ।
అన్యేష్వపి చ గాత్రేషు దోషః సంవిదితః క్వచిత్॥ ''30''
★ సంస్కార క్రమ సంపన్నామద్భుతా మా విలంబితామ్॥
ఉచ్చారయతి కల్యాణీం వాచం హృదయ హర్షిణీమ్॥ ''3౨''
★ ఏవం విధోయస్య దూతోన భవత్ పార్థి వస్యతు ।
సిద్ధయుం తిహి కథంతస్య కార్యాణాం గతయోఽనఘ ॥ 3౪॥

ఋగ్యజు స్సామాధర్వములందు సంపూర్ణ పండితులుగా నిదే ఎవ్వరును ఈ విధముగ సంభాషించ జాలరు. ఈతడు గొప్ప వ్యాకరణవేత్త. చక్కని సభ్యత, సుశిక్షణము, సుసంస్కారములతో నియమ పూర్వక జీవన వ్రతమాచరించు మాతా పితరుల సుపుత్రుడనుటలో ఏ మాత్రమును సంశయము లేదు. ఈతని ముఖము, నేత్రములు మస్తకము, మరియు ముఖభాగము నందు ఏవిధమగు దోషమును, చాంచల్యమును గానరాదు. ఇంతేగాక ఏ యంగము, స్వభావము, చేష్టలందును ఏ విధమగు న్యూనతయును లేదు. ఇట్టి దూతగల పార్థివుడు సకల కార్యములను సిద్ధింప చేసికొనగలడు. ★

---

★ హనుమంతుని 'కోతి' యని విశ్వసించు వారు దయదలచి వాల్మీకి రామాయణము లోని శ్లోకములను శ్రద్ధతో చదివి బాగుగా అర్థము చేసికొని యాలోచించవలెను. 'కోతులెన్నడైన వేద వేదాంగములను చదువగలవా ? శ్రీరాముని వంటి సకల విద్యాపారంగతుని సమక్షమున తమ సంస్కారముల ప్రభావములను ప్రదర్శింప గల్గునేమో వితర్కించవలెను.

ఆ తరువాత లక్ష్మణుడు తమ సంపూర్ణ విషయములను దెలిపి "ప్రియతముడవగు నో యాంజనేయా! మా కుల, బలములు జగత్ప్రసిద్ధములు. కాని యీ సమయమున సీత హరింపబడుట వల్లను, తను పుత్రుడగు కబంధుని సూచన వల్లను మేము మీ సహాయము నపేక్షించి వచ్చి యున్నాము. ఆవశ్యముగ మమ్ము మీ మిత్రులుగా స్వీకరించుడు.

"అహం చైవచ రామశ్చ సుగ్రీవం శరణం గతౌ॥కిష్కింధ ౪-౧॥

హనుమంతుడు సీతాన్వేషణమును గురించి రామలక్ష్మణులకు ఆశ్వాసమిచ్చుచు "సుగ్రీవుడును మీ వలెనే వారి యన్నయగు వాలి ద్వారా కళత్రమును గోల్పోయి రాజ్య భ్రష్టుడగు కారణమున భార్య విరక్తుడై ఈ పర్వతముపై నివసించుచున్నాడు. తాము వారి మైత్రిని పొందుడు. ఇక పరస్పర సహకారముచే మీ యిరువురి కార్యములను సిద్ధింపగలవు" అని తెలిపినాడు.

## ౪. హనుమంతుని పౌరోహిత్యము

సోదరులిరువురును హనుమంతుని ననుసరించినారు. హర్షపూర్ణుడగు మహా వీరుడు బలిమిచే నొప్పించి సోదరుల నిరువురను తన భుజ స్కంధముల పై నాసీనుల నొనర్చుకొని ఆనందము పొంగిపార ఎగురుచు, దుముకుచు సుగ్రీవుని సైనిక శిబిరమునకు చేరినాడు. వీరిని గాంచి సుగ్రీవుడు ఎదురేగి స్వాగతము పలికినాడు. అవసరమగు శిష్టాచారముల యనంతరము పరస్పర మైత్రి ధర్మము నందు దీక్షితులగుటకు నిశ్చయించుకొనినారు.

ఈ దీక్షాగ్రహణ యజ్ఞమునకు పురోహిత కార్యము నిర్వహించు వారెవ్వరా? అను ప్రశ్న ఉత్పన్నమైనది. ఎల్లరును కొంతవడి మౌనముగా ఆలోచించు చుండిరి. చివరకు శ్రీరాముడే ఆ మౌనవాతావరణమును భంగమొనర్చుచు "మహావీరుడగు హనుమంతుడు గలడు గదా! ఇతని యగాధ పాండిత్యము, సదాచారము వేదాను శీలనము, విప్లవాత్మక యువక సంఘటనము మున్నగు వానిని గురించి మహర్షి అగస్త్యుల వారు నాకు సవిస్తారముగ జెప్పియున్నారు. ప్రత్యక్షముగా నిపుడు అంతకన్న నధికముగానే గాంచు చున్నాను. ఈ పవిత్ర

కార్యమునకు సకల విధముగ హనుమంతుడే యధికారి. మహర్షి యనుపస్థితి యందు సకలార్హతలుగల వారి శిష్యుడు, వారి సత్య ప్రతినిధి మహాబలియే ఈ దివ్య కార్య నిర్వహణమునకు సమర్థు'' డని యనినాడు.

అందులకు ఆంజనేయుడు తన అసమర్థతను, అసమ్మతిని మృదువుగ నివేదించినాడు. కాని శ్రీరాముడు ''పావనీ ! యజమానుని హితమును దృష్టి యందుంచుకొని వ్యవహరించువారే నిజమగు పురోహితులు. నీకన్న హితైషు లెవ్వరున్నారు.? మేము రాష్ట్రోద్ధార కార్యమున, యజ్ఞాగ్ని సమక్షమున, 'మైత్రి' యను అఖండ బంధనమున బంధింపబడుచున్నాము. దేశోద్ధారకార్యమే నీ జీవన వ్రతమై యున్నది. దీని సాధనకై ఆజన్మ, అఖండ బ్రహ్మచర్య వ్రత దీక్షను గొని ఘోర తపశ్చరణ మొనర్చు చున్నావు. కావున నీవే మాకు పురోహితుడవుగా నుండదగిన వాడవు. వయస్సును బట్టి నీవు మాకు తమ్ముడవు కాని విద్యా తపస్సాధనములందు నీవు మా కవశ్యముగా మాననీయుడవే. నీవే మాకు పురోహితుడవు, మిత్రుడవు, అనుజుడవు, సేవకుడవుగూడ నగుదువు. నీవు మాకు గానిదేమియును లేదు. మహా వైదిక సాంస్కృతిక, సామ్రాజ్య సంస్థాపనకు ఈ దేవకార్యమును ఎప్పుడెట్టి యవసరము గలుగునో అప్పుడట్టి స్థితిని గ్రహించవలసి యుండును. నీ జన్మయే ఈ దైవీ కార్యమున కంకితమై యున్నది. కావున నోయాంజనేయా ! ఇప్పుడు నీవే మాత్రమును సంకోచించక మాకు పౌరోహిత్యమును నిర్వహించు'' మనినాడు.

శ్రీరాముని యీ ప్రేరణాత్మక వ్యాఖ్యానమును వినిన పిదప పావని కాదన లేక పోయినాడు. మరోవైపు సుగ్రీవుడు హనుమంతుని ప్రశస్తిని గాన మొనర్చుచునే శ్రీరాముని సంతోషముగా సమర్థించినాడు. వజ్రాంగు డత్యంత వినయ భావముతో శ్రీరామాజ్ఞా పాలన మొనర్చుటకు పురోహిత పీఠము నలంకరించినాడు. **''యత్ర బ్రాహ్మణ క్షత్రాశ్చ సమ్యంచౌ చరతః సహ''** నేడు ఈ వైదిక వ్యవస్థ వల్ల ఋష్యమూకము సార్థకమైనది. విప్లవాగ్నిని గ్రక్కు యువ హృదయ సామ్రాట్టు క్రాంతి దళ నాయకుడు, వేదజ్ఞుడు ఆచార్యుని రూపమున 'సామయాగ' మును సు సంపన్న మొనర్చు చున్నాడు. ఎంత చక్కని దృశ్యమిది ?

బ్రహ్మధర్మ, క్షాత్ర ధర్మముల సమముగా నిర్వహింప సమర్థుడు హనుమంతుడ
యగును. భారత మాత అమర సూనుడగు హనుమంతుడు వాస్తవముగ ధన్యుడే

వేదికపై సామాన్య యజ్ఞానంతరము, **''ఓం అగ్నే వ్రతపతే వ్రతం చరిష్యామి''**... అనువ్రతధారణ మంత్రములు స్వాహాకార పూర్వకముగా ఉచ్చరించుచు శ్రీరామ సుగ్రీవులు ఆశీస్సులొసగినారు. వ్రతపతి యగు పరమేశ్వరుని సాక్షిగా మిత్ర యుగ్మము ప్రగాఢమైత్రికి వ్రత ధారణ మొనర్చి పరస్పరము గాఢాలింగన మొనర్చుకొని, పౌరోహిత దక్షిణలు సమర్పించుకొని సంపూర్ణ యజ్ఞ ఫలము నార్జించి నారు. వీరవ్రతుడగు ఆంజనేయుడు, మరియు యువజన సముదాయ మెల్లరును హర్ష ధ్వనములతో పుష్ప వర్షమును గురిపించినారు.

## ౫. శ్రీరామ సుగ్రీవుల మైత్రి

మిత్రులిరువురును ఆసనములపై యాసీనులై భావి పథకము నాలోచించు చుండిరి. పరస్పర ప్రేమ దృక్కులతో వీక్షించు కొనుచు పరస్పర సుఖ దుఃఖములు దాదాపు ఒకే విధముగ నున్నవను ధోరణిలో మాట్లాడు కొనుచుండిరి. పూర్తి ప్రసంగమును వాల్మీకి యీ విధముగ వర్ణించినాడు.

**కాష్ఠయోః స్వేనహస్తేన జనయామాస పావకమ్ ।**
**దీప్యమానం తతో వహ్నిం పుష్పైర భ్యర్చ్య సత్కృతమ్ ॥ కిష్కింధా కాండ ౫-౧**
**సుగ్రీవోరాఘవశ్చైవ వయస్యత్వముపాగతౌ।**
**సుప్రీత మనసౌ తావు భౌహరి రాఘవౌ ॥ కి.కాం. ౫-౧౭॥**
**అన్యోఽన్యమభివీక్షన్తౌ నతృప్తి మభిజగ్మతు ।**
**త్వం వయస్యోఽసి హృద్యోమే ఏకం దుఃఖం సుఖంచనౌ ॥ కి.కాం. ౫-౧**

ఇట్లెంతో కాలము అన్యోన్య ప్రేమ పూర్ణ వార్తాలాపములతో పరస్పర ధైర్యమును గలిగించుకొనుచు ప్రోత్సహించుకొనిన యనంతరము హనుమంతుని ప్రేరణతో సుగ్రీవుడు ''రాఘవేంద్రా ! ఇక నీవు సీతా వియోగ దుఃఖమును హృదయము నుండి దీసివేయుము. ఆ మహాతల్లి పృథ్వీ మండలము

మూలనున్నను అతి శీఘ్రముగ జాడ దెలిసికొందును. ఇంకొక విషయము, నా వద్ద కొన్ని వస్త్రాభూషణములు భద్రపరచబడి యున్నవి. బహుశః అవి సీతా మాతయే యై యుండవచ్చును. నేనొక నాడీ పర్వతముపై కూర్చుండి మంత్రులతో సమాలోచన మొనర్చు చుండగా ఆకాశ మార్గమున అతిశీఘ్రగతి వెళ్లు చున్న విమానము నుండి "హే రామా! హే లక్ష్మణా!" యను ఆక్రందన లొనర్చుచు నొక అబల ఇవి మా వైపున పారవైచినది. అని చెప్పి ఆంజనేయుని ద్వార వానిని తెప్పించి శ్రీరాముని ముందుంచినాడు.

## ౬. యతివరుడగు లక్ష్మణుని ఆదర్శము

ఆ భూషణములను గాంచగనే హృదయమునందున్న దుఃఖాగ్ని పెల్లుబికినది. కన్నుల నుండి అశ్రు ప్రవాహము రాసాగినది. మనస్సునెట్లో అదుపు పరచుకొని లక్ష్మణునితో "చూడు తమ్ముడూ! ~~ఈ~~ భూషణములు మీ వదిన గారివే యగునా ? " అని ఒక్కొక్క భూషణమును లక్ష్మణునకు జూప సాగి నాడు. లక్ష్మణుడు హస్త, కంఠ, శిరోభూషణములను గుర్తించక "అగ్రజా! నేను వీనిని గుర్తించ లేను. కాని యీ పాద నూపురము ( అందె) లను మాత్రము గుర్తించగలను. ఇవి నిక్కచ్చితముగా నా తల్లి యగు సీతాదేవివియే" అని పలుకగా అచ్చటి వారెల్లరకును అత్యంతాశ్చర్యము గలిగినది. అప్పుడు సుగ్రీవుడు "లక్ష్మణా ! నీ వింత కాలము నుండి సీతా మాత సేవలో నుండియు ఆమె అభూషణములను గుర్తించ జాలక పోవుట మాకు ఆశ్చర్యముగా నున్నది" అని యడిగినాడు. అందుకు లక్ష్మణుడు "మిత్రులారా ! నేను హారకేయూర కుండలములు మున్నగు వానిని గుర్తించని కారణమేమనగా నేను వారి నెన్నడును దీర్ఘ దృష్టితో గాంచకుండుటయే. కాని నేను కేవలము 'నూపురము' ను గాంచిన తోడనే వానిని గుర్తించుట యనునది మీ కాశ్చర్యమును గలిగించినట్లు న్నది. నేను పాదాభివందన మొనర్చు సమయమున చరణములకివి యుండుట వల్ల వీనిని మాత్రమే గుర్తించగలిగితిని. అని తెలిసినాడు. ★

---

★ పాఠక సోదరులారా ! ఆర్య మహాపురుషుల మనోభావములను జూడుడు. రాజ కుమారుడు పండ్రెండు సంవత్సరములు ఏకాంతమున నుండియు వదినను కన్నెత్తి యైనను జూడకుండుట ఆశ్చర్యము గలేదా! ఏ జాతి యందు లక్ష్మణుని వంటి సంయమము ( ఇంద్రియ నిగ్రహ వ్రతు) లుందురో నిజముగా నాజాతి విజయము నొందుటలో సంశయమేమి ?

**నాహంజానామి కేయూరే నాహం జానామికుండలే ।**

**నూపురేత్వాభి జానామి నిత్యం పాదాభివందనాత్ ॥ కిష్కింధా ౬-౨౨॥**

రాముడు సీతను స్మరించుచు అధైర్యవంతుడై అనేక విధముల తలపో యుచు శోకించసాగినాడు. రాముని శోకమును గాంచి సుగ్రీవుడు ''రాఘవా! శోకించకుడు. జానకీ దేవి యాచూకి అతి శీఘ్రముగనే దెలిసికొందు''నని నేను సత్యముగ ప్రతిన యొనర్చుచున్నాను. మీ వలెనే నాకును భార్యా వియోగ దుఃఖము గలదు. సామాన్యుడనగు నేను దుఃఖమును దిగమ్రింగుకొనుచుండగ నీవు మహాత్ముడవై ఈ విధముగ దుఃఖించుట సమంజసముగాదు '' అని యోదార్చినాడు.

**వ్యసనేవార్త కృచ్ఛ్రేవా భయేవా జీవితాంతకే ।**
**విమృశన్ వైస్వయా బుద్ధ్వా ధృతి మాన్నావసీదతి ॥కిష్కి ౭-౯॥**
**యేశోక మనువర్తన్తే నతేషాం విద్యతే సుఖమ్ ।**
**తేజశ్చ క్షీయతే తేషాం నత్వం శోచితుమర్హ సి ॥ కిష్కి. ౭-౧౨॥**

''శ్రీరామచంద్రా ! ధృతిమంతుడగు పురుషుడు వ్యసనమున, కష్టమున, ధననాశమున మరియు జీవనాంతము నందును కేవలము ఆలోచించును. కాని శోకించడు. శోకించువాని సుఖములు నష్టమగును. ఆతడు తేజోహీనుడై బహుధా జీవితమునందును సందేహమునే పొందును. రాజేంద్రా ! నీవు శోకమును త్యజించి ధైర్యము నాశ్రయింపు'' మని సుగ్రీవుడు శ్రీరాముననునయించినాడు. ★

## ౭. సుగ్రీవుని రాజ్యాభిషేకము

వాలి వధించబడి ఆతని యంత్యేష్టి కర్మలు జరిగిన యనంతరము రాజు లేని రాజ్యము గావున సుగ్రీవుని రాజ్యాభిషేక ప్రయత్నములు జరుగ సాగినవి. రాజ తిలకమునకు యోగ్యమగు ఓషధులు, వస్త్రా భూషణములు మున్నగు

★ శ్రీరామునికే ఈ విధముగ ధర్మోపదేశమొనర్పగల సుగ్రీవుడు కోతియగునేమో పాఠకులాలోచించవలయును.

వస్తు చయము సిద్ధపరచిన పిదప హనుమంతుడు శ్రీరాముని సన్నిధి కేగి "మహా రాజా ! తాము కిష్కింధా నగరమునకు వచ్చి తమ హస్తములతో తమ మిత్రునికి రాజ్యాభిషేకము నొనర్చవలయును. రాజులేని ప్రజలకు క్షేమముండదు. రాజ్యా భిషేకమునకు సంబంధించిన సామగ్రి యంతయు సిద్ధముగనున్నది" అని విన్న వించినాడు.

ఇది వినిన పిదప శ్రీరాముడిట్లనినాడు. " ఆంజనేయా ! నీ స్నేహోద రములకు నేనధిక సంతుష్టుడనైతిని. కాని నేను పదునాలుగేండ్ల వరకు ఏ నగ రము నందును ప్రవేశించలేను, కావున యథావిధిగా నీవే రాజ్యాభిషేక కార్యమును నిర్వహించుము. రాజ్యాధికారము న్యాయరీత్యా అంగదునకు చెంది యుండును. కాని ఇప్పుడాతడు బాలుడు. రాజ్యభారమును వహించ జాలడు. కావున యువ రాజుగ అంగదునభిషేకించు" మని తెలిపినాడు.

**స్నాతోఽయం వివిధైర్గంధై రౌషధైశ్చ యథావిధి ॥ కిష్కి ౨౬-౬॥**

**తస్య పాండురమాజ హ్రుశ్చ త్రం హేమ పరిష్కృతమ్ ॥ ౨౬-౨౩॥**

**శుక్లేచ బాలవ్యజనే హేమదణ్డేయశస్కరే ।**

**తథారత్నాని సర్వాణి సర్వబీజౌషధానిచ ॥ కిష్కి. ౨౬-౨౪॥**

**సక్షీరాణాంచ వృక్షాణాం ప్రరోహాన్ కుసుమానిచ ।**

**శుక్లానిచైవ వస్త్రాణి శ్వేతంచైవాను లేపనమ్ ॥ కిష్కి ౨౬-౨౫ ।**

**సుగంధానిచ మాల్యాని స్థలజాన్యంబు జానిచ ।**

**చన్దనానిచ దివ్యాని గంధాశ్చ వివిధాన్బ హూన్ ॥కిష్కి-౨౬-౨౬**

**అక్షతం జాతరూపంచ ప్రియంగు మధు సర్పిషీ ।**

**దధిచర్మచ వైయాఘ్రం పరార్ధ్యౌ చాప్యు పానహౌ ॥ కిష్కి ౨౬-౨౭॥**

**సమాలంభ దమాదాయా గోరోచనం మనః శిలామ్ ॥**

**ఆజగ్ముస్తత్ర ముదితా వరాకన్యాశ్చ షోడశ ॥కిష్కి. ౨౬-౨౮॥**

**తతస్తే వానర శ్రేష్ఠ మభిషేక్తుం యథావిధి।**

**రత్నైర్వస్త్రైశ్చ భక్ష్యైశ్చ తోషయిత్వాద్విజర్షభాన్ ॥ కిష్కి. ౨౬-౨౯**

తతఃకుశపరిస్తీర్ణ సమిద్ధం జాత వేదసమ్।
మన్త్రపూతేన హవిషా హుత్వా మన్త్రవిదోజనాః ॥కిష్కి.కాం. 26-30॥

రామాజ్ఞను పొంది ఆంజనేయుడు సకలౌషధ సుగంధ మిశ్రిత జలముచే స్నానము చేయించి సకల ప్రజా సమ్మతితో సుగ్రీవుని రాజ సింహాసనముపై, అంగదుని యువరాజాసనము పై కూర్చుండ జేసి సకల రాజలాంఛనములతో రాజ్యాభిషేక కార్యము నిర్వర్తింప జేసినాడు. వేదవేత్తలగు బ్రాహ్మణుల యథోచితముగ పూజించి వారిని బ్రహ్మ, ఋత్విజ, అధ్వర్య, హోతాసనములపై కూర్చుండ జేసినాడు. చక్కని చందన సమిధల చే అగ్ని కుండమునందగ్నిని ప్రజ్వలింపజేసినాడు. వేదమంత్రములచే యజ్ఞ కార్యము నిర్వర్తింపబడినది. తరువాత రాజు, మరియు ప్రజాక్షేమమునకై శాంతి పాఠముతో ప్రార్థనలు జేయబడినది.

అగ్ని హోత్రము తరువాత నవరత్న ఖచిత సింహాసనముపై మహారాజా! సుగ్రీవుని పూర్వాభిముఖునిగా గూర్చుండ జేసి మంత్రులెల్లరును రాజ మహత్త్వమును పఠించినారు. గజ, గవాక్ష, శరభ, గవయ, గంధమాదన, హనుమజ్జాంబవంతాదులెల్లరును ప్రసన్న చిత్తములతో విధి పూర్వకముగా రాజతిలక కార్యమును నిర్వర్తించినారు. తిలక ధారణానంతరము హనుమంతుని వ్యవస్థననుసరించి మంత్రి మండలి, సామంత, మాండలిక రాజులు, ఇతర ప్రముఖులు, ప్రతినిధులు రాజునకు ప్రణామమొనర్చి రాజకీయాజ్ఞలను సర్వదా పాలించుటకు, శాసనబద్ధులై యుండుటకు, రాజునకు సకల విధముల సహాయ మొనర్చుటకు ప్రతిజ్ఞల నొనర్చినారు.★

## ౮. హనుమంతుని హెచ్చరిక, రాజనీతిజ్ఞత

వాలి వధానంతరము రామలక్ష్మణులు ప్రవర్షణ పర్వతముపై నివసించి వర్షాకాలమును గడిపినారు. రాజ్యము, ఐశ్వర్యము, స్త్రీ మున్నగు సంపదలు లభ్యమగుట తోడనే సుగ్రీవు డిచ్చట భోగములందు జిక్కుకొని శ్రీరాముని

★సుగ్రీవుని యీ రాజ్య తిలక సమారోహణమునకు సంబంధించిన సమస్త వృత్తాంతమును చదివిన పిదప గూడ మన యీ మహాన్ పూర్వజుల నెవరైన కోతులు అనునట్టి దుస్సాహసమొనర్చగలరా ?

కార్యమును దాదాపు మరచిపోయినాడు. రాజనీతి విశారదుడగు హనుమంతు డిది గాంచి సుగ్రీవునకీ రామ కార్యమును గూర్చి జ్ఞాపక మొనర్చుచు ''మహా రాజా శ్రీరాముని దయవల్ల మీకు రాజ్య ప్రాప్తి గలిగినది. కాని మిత్రకార్యము మాత్రము మిగిలి పోయినది. అది త్వరలోనే నిర్వహింపవలసి యుండెను. సమయముపై మిత్రులను సంపాదించుకొనువారికి రాజ్యము, కీర్తి, ధనము, యశము అను నీ నాలుగు సంపదలు అభివృద్ధి నొంది సురక్షితముగ నుండగలవు. కావున నో మహారాజా ! మీరిప్పుడు సకల కార్యములను వదలి మీ కుల ప్రతిష్ఠల నభివృద్ధి పరచి రాజ్య సంపదలతో బాటు రాజమహిషిని ప్రసాదించినట్టి శ్రీరాముని కార్యమును నిర్వహించుడు. చతురులగు యోధులను నలుదిశలకు బంపి సీతాదేవి నన్వేషింపజేయుమని తెలిపినాడు.

ఈ హిత **వాక్యములను** వినిన తక్షణమే సుగ్రీవుడు సేనానాయకుడగు నీలుని బిలిచి ''సేనాధిపతీ ! సీతాన్వేషణమునకై అతి చతురులు, యోగ్యులగు యోధులను నలువైపులకు బంపి కార్య సాఫల్యమొనర్చుము. స్వయముగ నీవే పోవలసి యున్నచోటికి పోయి కార్యమును సాధించు'' మని ఆజ్ఞాపించినాడు.

ఇచట సుగ్రీవుడు తన సేనా నాయకున కాదేశ మిచ్చిన విషయము తెలియక అచ్చట ప్రవర్షణ పర్వతముపై శ్రీరాముడు సీతను జ్ఞాపక మొనర్చుకొని దుఃఖముతో లక్ష్మణా ! సుగ్రీవునకు మన ధ్యాస యే లేనట్లున్నది. రాజ్య భోగములందు ఓలలాడు యాతనికి తన వాగ్దానము లెట్లు జ్ఞప్తికి వచ్చును ? కావున నీవు వెళ్లి నిర్లక్ష్యుడు, సోమరియునగు సుగ్రీవునితో ''నీవు నీ వాగ్దానము వదలి సీతాన్వేషణమున మాకు సహకరించనిచో మేము నిన్ను నీ బంధుమిత్ర పరివార సహితము సంహరించి మీ యన్న యున్నచోటికి బంపుట మాకు కఠినముగు కార్యము గాదు. అని తెలుపు మని కిష్కింధకు బంపినాడు.

శ్రీరాముని సందేశమును దీసికొని లక్ష్మణుడు కించిత్ క్రోధముతో సుగ్రీవునకు బుద్ధి జెప్పుటకు బయలు దేరినాడు. ఆతడు కిష్కింధకు చేరగనే

వానరులు అడుగడుగున నాతనికి స్వాగతములు సలిపినారు. కొంత ముందు కేగగనే యువరాజగు అంగదుడు గలసి అత్యంత నమ్రభావముతో ప్రణామము నర్పి సత్కార పూర్వకముగ నగరమును జూపుచు రాజ భవనము వైపు గొని పోయి నాడు. లక్ష్మణుని రాకను గూర్చి రాజసభ మరియు రాజభవనమునకు తెలియ పరచినాడు.

లక్ష్మణుడు క్రోధమూర్తియై వచ్చిన సమాచారమందగానే సుగ్రీవుడు భయ భీతుడై ముఖ్యమంత్రియగు ఆంజనేయుని బిలుచుకొని రహస్య మంత్రా లోచనా మందిరమునకు దీసికొనిపోయి ''మహామంత్రీ ! రాజ్య భోగములలో జిక్కి నేను నిక్కముగ మిత్రద్రోహియైనాను. రామ లక్ష్మణుల కోపము కన్న ప్రతిజ్ఞా పాలనము చేయలేనందులకే నాకధిక భీతిగా నున్నది. ఇట్టి కర్మయందు శ్రీరాముని వంటి మిత్రునకు నాపై కోపము వచ్చుట సహజము''. మిత్రుని జేసికొనుట కడు సులభమే గాని ఆ మిత్రత్వమును నిలుపుకొనుటయే అతి కఠిన'' మను మాట ఎంతయో సత్యమైనది.

**''సర్వథా సుకరం మిత్రం దుష్కరం పరిపాలనమ్''** ||కిష్కింధ 32-2

'' ఇపుడీ యపరాధమునకు నే నేమి ప్రాయశ్చిత్తమొనర్చుకొనవలయునో నీవే తెలుపు' మని యనినాడు. అందులకు హనుమంతుడు ''మహారాజా ! శ్రీరాముని కోపము యథార్థమైనది. నీవు రాజ్య సౌఖ్యములందు మునిగి **అంధుడవై** కర్తవ్యమును విస్మరించినావు. వర్షాకాలము పోయి ఆకాశము నిర్మ**లమై మార్గము** లెప్పటినుండియో సుగమమైనవి. సీత జాడ దీయుటకు నీవేదైన **ఉపాయము** ఆలోచించినావా ? కావుననే రామానుజుడు కోపయుక్తుడై ఇచ్చ టికి వచ్చినాడు. ఇక నిప్పుడు చేతులు జోడించి లక్ష్మణునకు క్షమాపణము చెప్పుకొనుటకన్న ఉపాయాంతర మేదియును లేదు'' అని తెలిపి ఇంకయు నిట్లనినాడు.

''రాజన్ ! రాజులకు హితమగు వాక్యములు నిస్సంకోచముగ, నిర్భ యముగ మంత్రులన వలసియుండునని శాస్త్రములు దెలుపుచున్నది. కావున నో మహారాజా ! నిర్భయుడనై నే నీనిశ్చిత వాక్యములను దెలుపుచున్నాను.

**నియుక్తైర్మంత్రి బిర్వాచ్యో హ్యావశ్యం పార్థివోహితమ్।**
**అత ఏవ భయం తక్త్వా బ్రవీమ్యే వధృతం వచః ॥కిష్కిం ౩౨-౧౮॥**

హనుమంతుని సూచనతో సుగ్రీవుడు నీతినిపుణురాలగు తారాదేవిని ముందిడుకొని యతివరుడగు లక్ష్మణుని దర్శించినాడు. మహారాణియగు తారా దేవి క్షమాభిక్షనర్థింప లక్ష్మణుడు లేచి అభివందనమొనర్చినాడు. అతని క్రోధము నీరైపోయినది. లక్ష్మణుడు శ్రీరాముని సందేశమును సుగ్రీవునకు దెలిపి తిరిగి ప్రవర్షణ పర్వతమునకు జేరినాడు. అట్లే శ్రీరాముడును ఆంజనేయుని నీతి కుశలత్వమునకు సంపూర్ణ శాంత చిత్తుడైనాడు.

## ౯. హనుమంతునిపై శ్రీరామ సుగ్రీవుల విశ్వాసము

సీతాన్వేషణమునకు వానర వీరులను బంపు విషయమున సమాలోచనములు జరుగుచున్నప్పటి వాల్మీకి రామాయణము నందలి వర్ణనలను జూచుట వల్ల సుగ్రీవునకు హనుమంతుని యందెంతటి ప్రగాఢ విశ్వాసముండెనో భగవానుడగు శ్రీరామునికి గూడ నాతని కార్యకుశలత్వముపై ఎంతటి యకుంఠిత నమ్మకముండెనో విదితమగుచున్నది. శ్రీరాముని సమక్షముననే సుగ్రీవుడు హనుమంతునితో నిట్లు దెలుపుచున్నాడు.

**"న భూమౌ నాంతరిక్షేవా నామ్బరే నామరాలయే।**
**నాప్సువాగతి భంగస్తే పశ్యామి హరి పుంగవ ॥వా. రా. కిష్కి-౪౪-౩॥**
**సాసురాః సహగన్ధర్వాః సనాగ నర దేవతాః।**
**విదితాః సర్వలోకాన్తే ససాగర ధరా ధరాః। కిష్కింద ౪౪-౪ ॥**
**గతిర్వేగశ్చ తేజశ్చ లాఘువంచ మహాకపే।**
**పితుస్తే సదృశంవీర మారుతస్య మహౌజసః ॥ కి. ౪౪-౫ ॥**
**తేజసా వాపితే భూతం నసమం భువివిద్యతే**
**తద్యథా లభ్యతే సీతా తత్త్వమే వాను చింతయ ॥ వా. రా. కి. ౪౪-౬॥**
**త్వయ్యేవ హనుమన్నస్తి బలం బుద్ధిః పరాక్రమః**
**దేశ కాలాను వృత్తిశ్చ నయశ్చ నయ పణ్డితః ॥ వారా. కి. ౪౪-౭ ॥**

''కపి శ్రేష్ఠ ! నీ గమనము నవరోధించు శక్తి పృథివి, అంతరిక్షము, జలము, మరియు దేవలోకమునందెచ్చటను గానరాదు. దేవతలు, అసురులు, గంధర్వులు, నాగులు, మరియు మానవులయు, వారి సమస్త లోకముల యొక్కయు, సముద్రములు, పర్వతములు మొదలగు వాని యొక్క జ్ఞానమును నీకు పుష్కలముగా గలదు. మహాబలీ ! నీ గమనము, వేగము, తేజము, స్ఫూర్తి బలశాలియగు నీ తండ్రి పవనునకు దీటుగ నున్నవి. భూ మండలమునందు నీ తేజమునకు సమానమైనవాడు ఇంతవరకు లేకుండెను. ఇప్పుడునూ లేడు. ఏ మార్గమున సీతాదేవి లభించగలదో యా మార్గమునే నీవనుగమించుము. ఆంజనేయా ! నీవు నీతి శాస్త్ర పండితుడవు. దేశ కాల పరిస్థితులు కనుకూలముగా నీతి, బుద్ధి బల పరాక్రమముల ప్రయోగము నీవు సంపూర్ణముగ నెరుగుదు'' వని కీర్తించినాడు.

సుగ్రీవుని మాటలు వినిన తరువాత శ్రీరామచంద్రునకు తన కార్యము సిద్ధించునను నమ్మకము దృఢముగ గలిగినది. తన మనస్సు నందానందము నిండి పోగా తన నామాక్షరములు చెక్కియున్న ఉంగరమును వ్రేలినుండి దీసి ఆంజనేయున కిచ్చుచు,

**''అనేన త్వాం హరిశ్రేష్ఠ చిహ్నేన జనకాత్మజా ।**
**మత్సకాశాదను ప్రాప్త మనుద్విగ్నానుపశ్యతి ॥ వా.రా. కిష్కి. ౪౪-౧౩॥**
**వ్యవసాయశ్చ తేవీర సత్త్వయుక్తశ్చ విక్రమః ।**
**సుగ్రీవశ్చచ సందేశః సిద్ధిం కతయతీవమే॥ కిష్కి. ౪౪-౧౪॥**

కపిశ్రేష్ఠా ! ఈ చిహ్నము వల్ల నీవు నేను పంపగా వచ్చినట్లు సీతాదేవి విశ్వసించ గలదు. అప్పుడామె నిర్భయురాలై నీవైపు చూడగలదు. వీరవరా ! నీ యుద్యోగము, ధైర్యము, మరియు పరాక్రమములను గాంచుటతో బాటు సుగ్రీవుడు నీకిచ్చిన సందేశములను వినిన తరువాత నీ ద్వారా ఈకార్యము సిద్ధింప గలదను విశ్వాసము నాకు గలుగుచున్న'' దని యనినాడు. ★

★ ఆధ్యాత్మ రామాయణము నందును శ్రీరాముడాంజనేయుని గుణములను శ్లాఘించుచు గుర్తు (చిహ్నము) గా తన ముద్రిక నిచ్చి,

## ౧౦. సాగర లంఘన ప్రేరణ

హనుమంతుడు జాంబవంత అంగదాది మహావీరులతో గలసి సీతా దేవి నన్వేషించుచు సముద్రతీరమునకు జేరినాడు. సీతాదేవి జాడ దెలియు లక్ష ణములు దెలియక ధైర్యమును కోల్పోయి వారెల్లరు నచ్చటనే నిరశన వ్రతమును గొని కూర్చున్నారు. అదృష్ట వశమున అచ్చటనే యున్న 'సంపాతి' యను గృధ్ర రాజుతో నీ విషయమును చెప్పగానాతడు ''కపి పుంగవులారా ! నూరు యోజనములు గల సముద్రమున కావల గల 'లంకాపుర' మను రాజ్యమునకు రాజు రావణుడు. ఆతడే సీతాదేవిని తన లంక యందు దాచి యుంచినా'' డని తెలిపినాడు. అప్పుడు వానరులందరొక్క చోట గూర్చుండి సముద్ర లంఘ నము గూర్చి ఆలోచించ సాగినారు. అంగదుడు అడిగినందువల్ల వానరులెల్ల రును తమ తమ బలములను గూర్చి తెలిపి సముద్రమును దాటుటకు తమ య సమర్థను వెలిబుచ్చినారు. కాని హనుమంతుడు ఇది యంతయును మౌనము గనే వినుచు కూర్చున్నాడు. ఎంతటి నిరభిమానము ? ఈ ప్రసంగమును వాల్మీకి రామాయణమున అతిరోచకముగా, అతి విస్తృతముగా తెలుప బడియున్నది. అందు జాంబవంతుని ద్వార హనుమంతుని బుద్ధి బలము, పరాక్రమము, విద్య, మరియు వీరత్వమును గూర్చి ఎంతో విచిత్రముగ చిత్రణ మొనర్చ బడినది.

**''వీర వానర లోకస్య సర్వశాస్త్ర విదాంవర ।**
**తూష్ణీమేకాంత మాశ్రిత్య హనుమాన్ కిం న జల్పసి ॥వా.రా. కి. ౬౬.౨॥**

..............................................................................

**రామలక్ష్మణయోశ్చాపి తేజసాచబలేనచ॥ కి ॥౬౬-౩ ॥**
**గరుత్మానివ విఖ్యాత ఉత్తమః సర్వపక్షిణామ్ వా.రా.కి. ౬౬-౪॥**
**పక్షయోర్యద్ బలం తస్య భుజవీర్య బలం తవ**
**విక్రమశ్చాపి తేజశ్చ నతే తేనాప హీయతే ॥ కి ౬౬-౬ ॥**

---

**త్వమేవ కార్యే ప్రమాణం హి త్వమేవ కపి సత్తమ।**
**జానామి సత్త్వన్తే సర్వంగచ్ఛ పన్థాః శుభస్తవ ॥ ఆధ్యా - రా. ౪-౬-౨౯।**

కపిశ్రేష్ఠ ఈ కార్యమునకు కేవలము నీవే సమర్థుడవు. నీ శౌర్య పరాక్రమమ్ములను నేను బాగు గనెరిగితిని. వెళ్లిరమ్ము నీ మార్గము కల్యాణకారకము, శుభప్రదమగు గాక! (అనిగలదు)

**బలం బుద్ధిశ్చ తేజశ్చ సత్వంచ హరిపుఙ్గవ ।**
**విశిష్టం సర్వభూతేషు కిమాత్మానం నబుధ్యసే ॥ కి. ౬౬-౭ ॥**

"సంపూర్ణ శాస్త్రవేత్తలందు శ్రేష్ఠుడవు, వానరజగత్తునందద్వితీయ వీరుడవగు ఓ హనుమంతా ! నీ విట్లే ఏకాంతమునందొంటరిగా, మౌనముగా గూర్చుండి యున్నావు. మాకు సముద్ర తరణోపాయమేలజెప్పుట లేదు ? బలతేజములందు నీవు శ్రీరామలక్ష్మణులతో సమానుడవు. గమన శక్తి యందు సకల పక్షి జాతులలో సర్వశ్రేష్ఠుడు, మహాబలుడునగు గరుడునికి సమాన విఖ్యాతి నార్జించినావు. ఆతని పక్షము (ఱెక్క) లయందుగల బలవిక్రమ తేజములు నీ యీ బాహువులందును గలవు. వజ్రాంగా ! నీవు నీ నిజ స్వరూపము నేల కనుగొనలేక పోవుచున్నావు ?" అని జాంబవంతుడాతని జన్మవృత్తాంతమును బాల్యావస్థయందలి పరాక్రమమును అగస్త్య మహర్షి యాశ్రమమున రాష్ట్రోద్ధారక కార్యమునకై అఖండ బ్రహ్మచర్య వ్రత దీక్షను పొందిన విషయములను జ్ఞాపకమొనర్చుచు చివరకిట్లనినాడు.

**ఉత్తిష్ఠ హరి శార్దూల లంఘయస్వ మహార్ణవమ్ ।**
**పరాహి సర్వభూతానాం హనుమాన్ యాగతిస్తవ ॥ వా.రా. కి. ౬౬-౩౬।**

"వానర శ్రేష్ఠా! లెమ్ము ! లేచి యీ మహాసాగరమును లంఘించు" మనగానే హనుమంతుడుప్పొంగి యోగబలమున ప్రాణాయామము ద్వారా తన శరీరమును పెంచుకొన సాగినాడు.

## ౧౧. ఆత్మ విశ్వాసము, విరాట్ రూపము

( ఆధ్యాత్మ రామాయణ మందును దాదాపు ఇదే విధముగు వర్ణన గలదు. ఆంజనేయుడు ఆత్మ విశ్వాసముతో నిట్లనుచున్నాడు).

**లంఘయిత్వా జలనిధింకృత్వా లంకాంచ భస్మసాత్।**
**రావణం సకులం హత్వా ౨_౨ నేష్యే జనకనందినిమ్ ॥ ఆధ్యా. రా ४.९.౨౨**
**యద్వా బధ్వా గవేర జ్వా రావణం వామ పాణినా ।**

**లంకాంఽన పర్వతాంధృత్వా రామస్యాగ్రేక్షిపామ్యహమ్ ॥** అధ్యా. రా.౪-౯-౨౩
**యద్వాదృష్టైవ యాస్యామి జానకీం శుభలక్షణామ్॥** అధ్యా. రా. ౪-౯-౨౪॥

''మిత్రులారా ! నేను సముద్రమును లంఘించి లంకను భస్మీభూత మొనర్చగలను. రావణుని కులమును సర్వనాశనమొనర్చి శ్రీ జనకనందినిని తేగలను. మీరు కోరినచో రావణుని మెడకు త్రాడు గట్టి ఈడ్చుకు రాగలను. లంకను త్రికూట పర్వత సహితముగ పెకలించి వామ హస్తమున లేవ నెత్తుకొని శ్రీరామ భూపాలుని యెదుటికి దెచ్చి యుంచుదునా ? లేక కేవలము సీతా మాతనే చూచిరావలయునా? అని యడుగుచున్నాడు.

(హనుమంతుని ఆత్మబలమెంత గంభీరమైనదో గాంచితిరా ?) జాంబవంతుడు హనుమంతునితో ''మహావీరా ! శ్రీరామ సుగ్రీవుల యాజ్ఞమేరకు నీవు కేవలము శుభ లక్షణయగు జానకీ దేవి క్షేమముగ నుండుటను మాత్రమే జూచి రమ్ము'' అని యనినాడు.

తన జీవన వ్రతము పూర్తియగు దశ కొరకు మహావీరుడు నిరీక్షించు చున్నట్టి స్వర్ణావకాశము ఆతని యెదుటికి వచ్చి నిలిచినది. ఆతని కన్నుల యెదుట అగస్త్య మహర్షి యెదుట గైకొనిన వ్రతదీక్షా దృశ్యము నాట్యమాడసాగినది. మరియు నాతని సమక్షమున భవ్యమగు అపార విశాలమగు పురుషార్థ ప్రదర్శన ఘడియలు నిలిచినవి. సముద్ర లంఘనముకై హనుమంతుడు దాల్చిన విరాట్ రూపము వాల్మీకి రామాయణమున విస్తార రూపముగ వర్ణించబడియున్నది. ఇట కేవలము పరిచయ మాత్రముగనే దెలుపుచున్నాము.

**వవృధే రామవృద్ధ్యర్థం సముద్ర ఇవ పర్వసు ॥** వా.రా. సుంద. ౧-౧౦।
**నిష్పమాణ శరీరః సంలిలంఘయిషురర్ణవమ్।**
**బాహుభ్యాం పీడయామాస చరణాభ్యాం చ పర్వతమ్ ॥** సు-౧-౧౧
**సచచాలా చలశ్చాశు ముహూర్తం కపిపీడితః ।**
**తరూణాం పుష్పితాగ్రాణాం సర్వం పుష్పమశాతయత్ ॥** సు. ౧-౧౨॥
**తమూరువే గోన్మథితాః సాలాశ్చాన్యేన గోత్తమః ।**
**అనుజగ్ముర్హనూమంతం సైన్యా ఇవ మహీపతిమ్ ॥** సుం. ౧-౪౬॥

పౌర్ణమి నాడు సముద్రముప్పొంగునట్లు మహాత్ముడగు శ్రీరాముని కార్య సిద్ధికొరకు హనుమంతుడు ప్రాణాయామము ద్వారా తన శరీరమును బెంచికొనినాడు. ( ఇది దృఢసంకల్ప శక్తి యొక్క హనుమంతుని గూర్చిన అలంకారిక వర్ణనయే) తన భుజములు, చరణములతో ఆ పర్వతము నదుము టచే ఆతని తాడనము నొందిన పర్వతము ముహూర్త మాత్రము కంపించుచునే యుండినది. దానిపై బెరిగి యున్న వృక్షముల పుష్పములన్నియు జల జల రాలినవి. ఆతడు పర్వతమును నిలద్రొక్కి యెగిరినపుడు పర్వతముపై బెరిగి యున్న సాల వృక్షాదులు నలువైపుల బడి పోయినవి. ఆ విరిగి పడిపోయిన వృక్ష ములాతని వేగ గమనమున రాజు వెంట సైన్యము నడచినట్లు కొంత దూరమెగి రిపోయి పడిపోయినవి.

జాంబవంతాదుల యనుజ్ఞను పొంది రామకార్యసిద్ధికై వేగధారణ మొనర్చి వీర యాత్ర ప్రారంభించిన హనుమంతుని వేగమును గాంచుటకు వానరులెల్ల రును సాగర తీరమునకు చేరినారు. వారి కోరికపై ఆంజనేయుడిట్లనినాడు.

**యథారాఘువ నిర్ముక్తః శరః శ్వసన విక్రమః ॥వా.రా.సుం. ౧-౩౮॥**

**గచ్ఛత్తద్వద్గమిష్యామి లంకాంరావణ పాలితామ్।**

**నహిద్రక్ష్యామి యదితాం లంకాయాం జనకాత్మజామ్॥** సుం. ౧-౪౦

**బద్ధ్వా రాక్షస రాజాన మానయిష్యామి రావణమ్ ।**

**సర్వథా కృతకార్యోఽహమేష్యామి సహసీతయా ॥** సుం. ౧-౪౧।

మిత్రవరులారా ! శ్రీరాముని చేతినుండి విడువబడి వాయు వేగము గల బాణము తన లక్ష్యమును నెరవేర్చినట్లు నేను రావణుడు పాలించుచున్న లంకలో ప్రవేశించి ఇదే ఉత్సాహముతో సీతాదేవి దర్శనమగువరకు అచ్చట వెదకెదను. పురుషార్థము ఆత్మ విశ్వాసములతో సీతమ్మ జాడ కనుగొందును. అట్లు గానిచో రాక్షస రాజగు రావణునిచటికి బంధించి తేగలను. సీతాన్వేషణ కార్యమునందు నేను సంపూర్ణ కృతకృత్యుడనే యై ఇచ్చటికి రాగలను.

## ౧౨. సాగర తరణము

అని పలికి హనుమంతుడు సముద్రమును దాటుటకు దాని యంద

దుమికినాడు. ఆతడందు దుముకగనే దానియందు మేఘ గర్జన ధ్వని గలిగినది. అంత వేగముగా నీదుచు దక్షిణ దిశకు బోవుచుండెను. సముద్రము నందేయే దేశములకు జేరుచుండునో, యా ప్రాంతముల ప్రజలు ఆతని వేగమును ఉన్మాదులవలె గాంచు చుండిరి. ఉన్మాద రోగి నోటి నుండి నురుగులు వెళ్లినట్లే సముద్రము నురుగులు గ్రక్కుచుండెను. ఆతనికి సముద్ర మొక దొన్నె వలె నుండెను. హనుమంతుని యాత్రా సాధనమగు శరీరమును యా దివ్య నౌక యెదుట సముద్రము తన గాంభీర్యమును వదలి నట్లుండెను.

సముద్ర ద్వీపములందచ్చటచ్చట నుండి దేవ గంధర్వులు, ఋషులు, మునులు సముద్ర యాత్రికులు మున్నగు వారు హనుమంతుని వీరత్వమును గాంచి ఆతని ప్రశంసించుచు ఆదరణ దృష్టితో జూచు చుండిరి.

**సాగరుని సద్భావము :**

**తస్మిన్ ప్రవగశార్దూలే ప్లవమానే హనూమతి ।**
**ఇక్ష్వాకు కులమానార్థీ చింతయా మాస సాగరః ॥ వా.రా. సుం. ౧-౮౬॥**
**సాహాయ్యం వానరేన్ద్రస్య యదినాహం హనూమత ।**
**కరిష్యామి...... సర్వ వాచ్యో వివక్ష్యతామ్ . సు ।౧-౮౭॥**
**తథామయా మిధాతవ్యం విశ్వప్రేత యథాకపి ।**
**శేషంచ మయి విశ్రాంతః సుఖోఽసౌఽతి తరిష్యతి ॥ సుం. ౧-౮౮॥**

"అతి వేగముగా వచ్చుచున్న హనుమంతుని గాంచి సూర్యవంశమును గౌరవ దృష్టితో జూచు సాగరుడు★ అను పేరుగల పురుషుడు తన మనమున "నేను సూర్య వంశీయుల వలన ఎంతో లాభమును పొంది యున్నాను. ఇప్పుడు సూర్య వంశ యువరాజుపై విపత్తు వచ్చి పడినది. వారి పనిమీదనే ఈ వానర

★ సాగరుడనగా అనేకులు జల పూర్ణమగు 'సముద్ర' మని అర్థము జేయుదురు. అది ఉపయుక్తము గాదు. అసంభవమైన విషయము, మొదటి కారణమేమన జడమునందిట్టి ఆలోచనలు సంభవము గాదు. మున్ముందు సేతువు నిర్మించు ప్రకరణము వచ్చును. జడమగు సముద్రము నందిట్టి రాపు భక్తి యున్నది, యని తలచితి మేని సముద్రమును దాటుటకు వారధిని గట్టు శ్రమ మిథ్య యని సిద్ధమగుచున్నది'' ఇది కవి యొక్క కావ్యనుయలంకారిక వర్ణన మాత్రమే'' యని తలచవలయును.

వంశీయుడగు నరవీరుడు వచ్చు చున్నాడు. నేనీ సమయమున సీతనికి సహాం పడకున్నచో సకల దిశలనుండి మాకు తలవంపులే కలుగగలవు. ఇప్పుడితని సుఖ పూర్వక విశ్రాంత కొరకు తగు వ్యవస్థలు చేసిన నీతడు కొంత విశ్రాంతిఁ గొని ముందరి మార్గమును సరళముగా దాటగల'' డని తలపోసినాడు.

**మైనాకముపై విశ్రాంతి:-** ఈ విధముగా దలచి సాగరుడు విశ్రాంతిఁ గొనుమని హనుమంతుని గోరినాడు. మార్గ మతిదీర్ఘమైనది. కావున హను మంతుడు మహాత్ముడగు సాగరుని కోరిక ననుసరించి 'మైనాక పర్వతము' పై కొంత తడవు విశ్రమించినాడు. తరువాత ఆహార పానీయములు ముగించు కొని పయనమైనాడు. సముద్రము నందనేక కష్టముల నెదుర్కొనుచు సురస ★ తో కొంత కాలము యుద్ధము చేసి సంపూర్ణా రోగ్యముతో సముద్రమును దాటి ఆవలి తీరమును జేరినాడు.

## ౧౩. లంకాప్రవేశము

భయంకరమగు సముద్రమును దాటి హనుమంతుడు లంకా నగర ప్రాం తమున ప్రవేశించి పటిష్ఠవంతమగు దాని నిర్మాణమును గాంచి మనస్సునం దీవిధ ముగా తలపోసినాడు. ''ఇంతటి సురక్షితమగు లంకయందు నే నెట్లు ప్రవే శించ గలను? లోపలికి జేరకున్న సీతామాత నెట్లు జూడగలను ? నే నిపుడు రాక్షసుల కంట బడకుండ సీతాదేవి జాడ గను గొనునట్టి ఉపాయ మాలోచిం చవలసి యున్నది. నా రాక రావణునకు దెలిసిన కార్య భంగమగును. రాక్షసేం ద్రుని యాజ్ఞ లేనిదే గాలియైనను లంకయందు ప్రవేశింప జాలదు. ఆతని భీమ

★ మహావీరుడగు హనుమంతుడు యుద్ధము జేసినట్టి 'సురస' యనునది భౌతిక దేహ ధారి యగు 'స్త్రీ' గాదు. ఇది కావ్యాలంకార పదము. 'సు+రస అః' అను దాని యర్థము చక్కని రసము గలది అని యగును. అనగా సాంసారిక భోగములు, భౌతికాకర్షణము, స్వర్ణమయ లంక ( ఆకాలమునందలి భౌతికాకర్షణ మరియు భోగప్రధానమగు సభ్యత లకు కేంద్రము.) వైపునకు హను మంతుడు పోవుచున్న కొలది 'సురసా భౌతికాకర్షణ' లను ప్రహరణముల నెదుర్కొనుచు లంకను సమీపించుకొలది ఆకర్షణల 'సురసా' నోరు పెరుగ సాగినది. మహావీరుని సంకల్ప శక్తియు ఇనుమడించు చున్నందున ఆతడు తన యోగబలమున దానిపై విజయము సాధించి నాడు. ఇదియే 'సురసా హను మంతుల సమరగాథా రహస్యము.

కాయులగు కర్మచారులకు, గుప్త చరులగు రాక్షసులకు దెలియకుండ లంకయందు గిడుట గాని, క్షణకాలము నిలుచుట గాని సాధ్యము గానట్లు తోచుచున్నది'' అను సంకల్ప వికల్పములతో హనుమంతున కచ్చటనే రాత్రియైనది. హనుమంతుడు ఆరాత్రి రాక్షసులుండు మార్గములను వదలి ఏదో యొక రహస్య మార్గమున ఎట్లో అతిచతురతతో లంకా నగరమున ప్రవేశించినాడు.

**ప్రదోషకాలే హనుమాన్ స్తూర్ణముత్పత్య వీర్యవాన్ ।**
**ప్రవివేశ పురీం రమ్యాం ప్రవిభక్త సహా పథామ్** ॥వా.రా. సుం. ౨-౪౮॥

**లంకిణిని నిర్జించుట** : రాత్రి సమయమున హనుమంతుడు లంకయందు ప్రవేశించి దృఢత్వము, అభేద్యము, ఐశ్వర్యము, సుందరము, విలక్షణమై యున్న దాని నిర్మాణమును గాంచి మొదట కొంత సంతసించినను అవి తన కార్యమునకు గొప్ప యాటంకములు, విఘ్న కారకములే' యని తలచినపుడు కొంత విచారము కలిగినది. ఇట్లు ఆలోచించు చుండ గనే యాతని సముక్షమున వీర వేషమున అస్త్ర శస్త్రధారిణి యగు నొక వీరాంగన నిలచి యుండుటను గాంచి కించిన్మాత్రము చలించినాడు. ( ఈ స్త్రీ లంకిణి, దీని బుద్ధి బలము, వీరోచిత సాహసములను గాంచి రావణుడు దీనికి శౌర్యవంతులగు అనేక వీర సైనికులను, ధనాదుల నిచ్చి లంకారక్షణమునకై నియుక్తపరచినాడు) లంకాపురిని లంకిణి రక్షించుచున్నంత కాలము అది పరాజయము నొంద జాలదని హనుమంతునకు తెలియుటకు ఎంతో కాలము పట్టలేదు.

హనుమంతుని జూచిన తోడనే లంకిణి ఆర్భాటముతో పెడబొబ్బలు పెట్టుచు, అనేక పరుష వాక్యములతో దిట్టుచు తాడన మొనర్చసాగినది. లంకిణి యొక్క దుఃసాహసమును గాంచి, స్త్రీ యని యెంచి మొదట హనుమంతుడు దానిపై చేయి జేసికొనుటకు సంకోచించినాడు. కాని దాని దౌష్ట్యము మితి మీరు చుండుటచే శస్త్రములను ప్రయోగించకుండనే దానిని పైకెత్తి భూమికి గురి కొట్టినాడు. అది భూమిపై బడి గిల గిల దన్నుకొనుచు ఆర్త ధ్వనితో చూచుచుండగా హనుమంతుడు కరుణ వహించి ఇంకా నెట్టి ప్రహారణముల జేయక వదలి వేసినాడు.

ద్రూప భీముడు, ఘనుడు, విఘనుడు, శుకనాముడు, చక్రుడు, శఠుడు, మత్తుడు, కపటుడు, హ్రస్వకర్ణుడు, దంష్ట్రుడు, లోమశుడు, ధ్వజగ్రీవుడు, సారిణుడు, హతిముఖుడు ద్విజిహ్వుడు, కరాలుడు, విశాలుడు, శోణితాక్షుడు, మున్నగు వారి భవనములను గూడ జూచినాడు. దీనివల్ల లంకా నగరశక్తిని దెలిసికొని నాడు. హనుమంతుడొరులకు దెలియకుండ.

**శివికావివిధాకారః స కపిర్మారు తాత్మజః**

**లతాగృహాణి చిత్రాణి చిత్రశాలా గృహాణి చ ॥ వా. సు.౬-౨౬॥**

**క్రీడాగృహాని దాన్యాని దారూ పర్వత కానిచ ।**

**కా మస్య గృహకం రమ్యం దివాగృహక మేవచ ॥ వా.రా. సుం.౬.౩౭॥**

**దదర్శరాక్షసేంద్రస్య రావణస్య నివేశనే ।**

**సమందర సమ్ప్రఖ్యం మయూర స్థాన సంకులమ్ ॥ సుం. ౬-౬౮॥**

రావణుని చిత్రశాల, లతాగృహము, క్రీడా భవనము, దారూ పర్వతము, కామ గృహము, దివాగృహము, మొదలగు వానిని గాంచినాడు. దానిచే నాతనికి లంకయందలి వైజ్ఞానికుల, శిల్పికారుల బుద్ధి బలమెంతటి కళావంతమైనదో తెలియుటయే గాక రావణుని నీతి, రీతి, బలమమున్నగు వాని రహస్యమును గ్రాహ్యామైనది. ఇది రాబోవుయుద్ధమునందెంతయో ఉపకరించినది. ★

**రావణ గృహమున సీతాభ్రమ :** సమస్త ప్రదేశములందు వెదకి ఒకనాడు హనుమంతుడు మరల రావణుని భవనమున నున్న పుష్పక విమానము నెక్కి చూచినాడు. అందనేకసౌందర్యవతులగు స్త్రీలుండిరి. అందొకర్తుకసర్వాంగసుందరి. స్వర్ణమణి భూషణ భూషితురాలు నిద్రించుచుండుటను గాంచి ఈ రూప యవ్వన సంపన్నురాలగు స్త్రీ సీతాదేవియే యై యుండునా ?

**సతాంద్రుష్ట్వా మహాబాహుర్భూషితాం మారుతాత్మజః**

**తర్కయామాస సీతేతి రూపయవ్వన సంపదా ॥వా.రా.సుం. ౧౦-౫౩॥**

---

[1] రాక్షసులగువారు కూడ గొప్పవిజ్ఞానవంతులు, ప్రగతి శీలురగు మానవులే యై యుండిరనియును, భౌతిక వికాసమున లంకారాజ్యము పరాకాష్ఠ నందియుండెననియు మనకు ఇందువల్ల స్పష్టమగుచున్నది.

అని వితర్కించి "రాముని వియోగము నొందిన సీత ఇట్లలంకారముల ధరించి, ఇట్టి భోగముల ననుభవించుచు నిశ్చింతగా నిదురింప జాలదు. అన్య పురుషుల మాట యటుంచి దేవరాజగు ఇంద్రుని గూడ సేవించదు. ఏలన, రాముని వంటి గుణవంతులు, దోషరహితులునగు పురుషులుండ జాలరు. అట్టి రాముని భార్య ఇట్టి వైభవములందెట్లుండ గలదు ? నేను పొరపడినాను. ఇక నిట క్షణమైనను నిలువ రాదు. సీతాదేవి ఇట్టి రాణివాసము లందుండదు. ఆమెను వేరు స్థలములందే వెదకుట యుక్త" మని తలచి ఆంజనేయుడాచోటును వదలి పోయినాడు.

స రామేణ వియుక్తాసా స్వప్తుమర్హతి భామి నీ ।
సభోక్తుం నాప్యలంకుర్తుం నపాన ముపసేవితుమ్ ॥ వా.రా. సు. ౧౧-౨॥
నాన్యం నరముపస్థాతుం సురాణా మపి చేశ్వరమ్ ।
నహిరామ సమః కశ్చి ద్విశ్యతే త్రిదశేష్వపి ॥ వా.రా.సుం. ౧౧-౩॥
అన్యేయమితి నిశ్చిత్య భూయస్తత్రచచారసః।
పానభూమౌ హరిశ్రేష్ఠః సీతాసందర్శ నోత్సుకః ॥ సుం. ౧౧-౪॥

## ౧౪. ధర్మభీతి, మనోశుద్ధి

స్నానశాలయందొక నాడు హనుమంతుడు సీతను వెదుకుచు రూప, యవ్వన, ధన మదాంధులగు రమణులు రావణునితో క్రీడించు చుండుటను గాంచినాడు. కాని అందు సీత గాన్పించలేదు. ఆ దృశ్యములను గాంచినందున బ్రహ్మచారియగు నాతనికి అధిక జుగుప్సతో బాటు సీత గాన్పించలేదను చింత కూడ గలిగినది. ఆతడిట్లు తలపోసినాడు.

పరదారావరోధస్య ప్రసుప్తస్య నిరీక్షణమ్॥
ఇదంఖలు మమాత్యర్థ ధర్మలోపం కరిష్యతి ॥ వా.రా.సుం. ౧౧-౩౮
నహియే పరదారాణాం దృష్టిర్విషయవర్తినీ ।
అయంచాత్ర వయాదృష్టః పరదారాపరిగ్రహః ॥ సుం. ౧౧-౩౯॥

"నేనెంతటి దౌర్భాగ్యుడను ? నాకు సీతాదేవి జాడ దెలియలేదు

నరికదా అనేక ధర్మ హీన, శాస్త్ర దూషితములగు నీచకర్మలు జరుగుచుండు దృశ్యములను గాంచవలసి వచ్చినది. ఇవన్నియును ధర్మభీతిగలవారి ధర్మమును శిథిల పరచగలవు. పరస్త్రీ విషయములందు నా మనస్సు దూషితము గాజాలదు. నేను నేడు పరస్త్రీలను నే నీదశయందు అవశ్యముగ జూచితిని. ఇట్టి దృశ్యములను గాంచుట శాస్త్ర దూషితము.

**''నేక్షేతనగ్నాం పరస్త్రియమ్, ఇతిస్మృతిః ॥** న + ఈక్షేత నగ్నాం పర స్త్రియమ్

ఇట్టి యాలోచనలలో హనుమంతుని హృదయమున రాజాజ్ఞా రూపమగు ధర్మనాశనమను భయముత్పన్నమైనది. ''అట్టి ధర్మము వల్లనే గదా ! తాను సముద్రమును దాటి ఇంత దూరము వచ్చుట తటస్థించినది''. అని తలచి అతడు దూత ధర్మము, మానవ ధర్మము లను గూర్చి తులనాత్మక దృష్టితో నిట్లాచించినాడు.

**కామంప్పృష్టాః మయాసర్వా వశ్వస్తా రావణాస్త్రయ ।**
**నతుమే మనసాకించి ద్వైకృత్య ముపపద్యతే ॥వా.రా.సుం. ౧౧-౪౧॥**
**మనోహిహేతుః సర్వేషా మింద్రియాణాం ప్రవర్తనే ।**
**శుభాశుభాస్వవస్థాసు తచ్చమే సువ్యవస్థితమ్ ॥ సుం. ౧౧-౪౨**
**నాన్యత్రహి మయాశక్యా వైదేహీ పరిమార్గితుమ్।**
**స్త్రియోహిస్త్రీషుదృశ్యన్తే సదాసం పరిమార్గణే॥ వా.రా.సుం. ౧౧-౪౩॥**
**యస్యసత్త్వస్యయా యోని స్తస్యాంతత్పరి మార్గతే ।**
**శక్యం ప్రమదానష్టా మృగీషు పరిమార్గితుమ్ ॥ సుం. ౧౧-౪౪॥**
**తదిదం మార్గితంతావ చ్ఛుద్ధేన మనసామయా ।**
**రావణాంతః పురం సర్వ దృశ్యతే నచ జానకీ ॥ సుం. ౧౧-౪౫ ॥**

నే నన్ని దిశలందున్న స్త్రీలను గాంచితిని. నా మనస్సు నందెట్టి వికారముత్పన్న గాలేదు. ఈ మనస్సే గదా ! సర్వేంద్రియములను శుభాశుభ కర్మలందు ప్రవేశ పెట్టునది ? నా మనస్సు ఇంద్రియములు నా యధీనమందున్నవి.

స్త్రీ మండలి యందుగాక అన్య ప్రదేశములందు సీత యుండజాలదు. ఏ జాతి యందు ఎట్టి గుణవిశేషముండునో అది ఆ జాతియందే కానవచ్చును. స్త్రీ ప్రదేశములను విడిచి అన్య ప్రదేశములందు స్త్రీయగు సీతామాతను వెదక జాలను గదా! కావున సీత జాడ దెలియునంతవరకు రావణుని అంతఃపురములందే వెదుక వలసి యుండును. పరమేశ్వరుడిందుకై నామనస్సును దృఢముగ, పవిత్రముగ నుంచుగాత

## ౧౫. శాస్త్రీయ వీర భావము

రావణుని అంతఃపురము లందెచ్చటను సీతాదేవి గాన్పించ నందున కడు విచారముతో " ఇక సీతాదేవి లభించుట దుస్తరమే. ఆమెను గాంచకుండ కిష్కింధకు నేనెట్లు పోగలను ? నిష్ఫలుడనై పోయి సుగ్రీవ మహారాజు, అంగద జాంబవంతాది వానర వీరులకు నా ముఖము నెట్లు జూపుదును ? అని కించిద్విచారము నొంది వెంటనే ధీరత్వముగ "ఛీ ఛీ నాబోటి ధీరులకిట్టి యాలోచనలు శోభించవు. ఇట్టి నిరాశను వదలి ఉత్సాహముగా సీతాదేవి నన్వేషించ వలసియే యుండును. కృతకార్య శూరుడనగుట యుత్తమము. కాని పిరికితనము నాయందుండరాదు. తప్పక నాకు కార్యసిద్ధి లభించగలదు. నిర్వేదము ( నిరాశ) వల్ల కార్యహాని, పురుషార్థము వల్ల సకల దుస్తర కార్యములు సిద్ధించ గలవు.

**అనిర్వేదః శ్రియోమూలం నిర్వేదః పరంసుఖమ్।**

**మూయస్తత్ర విచేష్యామి నయత్ర విచయః కృతః ॥ వా.రా.సుం. ౧౨-౧౦॥**

**అనిర్వేదోహి సతతం సర్వార్థేషు ప్రవర్తకః ।**

**కరోతి సఫలం జన్తోః కర్మయచ్చ కరోతిసః ॥వా.రా.సుం. ౧౨-౧౧॥**

**తస్మాదనిర్వేదకరం యత్నం చేష్టేఽ హముత్తమమ్।**

**అదృష్టాంశ్చ విచేష్యామి దేశాన్ రావణ పాలితాన్ ॥ సుం. ౧౨-౧౨॥**

హనుమంతుడిపుడుత్సాహవంతుడై కేవలమొకటి రెండు ప్రాంతములందే కాక రావణ పాలిత సమస్త ప్రదేశములందును సీతాదేవి నన్వేషించుటకు కృత నిశ్చయుడైనాడు. ఈ కృత నిశ్చయముతోనే అనేక ప్రదేశములందును

అనేక జాతుల స్త్రీలను జూచినాడు. ఒకచోట విమానములపై నెక్కుచు, మరోచోట భవనములందు ప్రవేశించుచు, అనేక భవనములపై నధిరోహించుచు, అనేక స్థలములందు పొంచి యుండియు నన్వేషించినాడు. కాని సీత జాడ ఏమాత్రము దెలియ రాలేదు. అప్పుడు చింతా కులిత చిత్తుడై ఇట్లాలోచించినాడు.★

సంపాతి కథానుసారము సీతాదేవి ఇట్టి స్థలములందుండ జాలదు. రామ బాణాదుల భయము వలన అతి వేగముగ పరుగిడుచున్న విమానమున నిలువ జాలక ఏ యరణ్యము నందైనను బడి మరణించి యుండును. లేదా సుకుమారియగు ఆర్యదేవి శ్రీరాముని వియోగముచే విహ్వల చిత్తయై సముద్రుని భీకరాకృతిని గాంచి భీతిల్లి మరణించియైన నుండవచ్చును. అట్లుగాకున్న ఆ యుగ్ర బలధారియగు రావణుని భుజపీడనమును భరించ జాలక జీవములను త్యజించి యుండును. లేక దుష్టరావణుని యాజ్ఞతో ఈ రాక్షసులే చంపివేసినారేమో ! రావణుని యంతఃపుర గుప్తస్థానము లందెచ్చటనైనను పంజరము నందలి పక్షి వలె బంధింపబడి యుండునా. అట్లు జరుగకున్న రామపత్ని యగు జానకి రావణుని వశము నందెట్లుండగలదు? అయ్యో ! నిశ్చయముగ, సప్రమాణముగ ఏ విషయమును నిర్ధారణ మొనర్చుకొననిదే ఏకపత్నీ వ్రతుడగు శ్రీరామునికి సీతాదేవి మరణించినదని యెట్లు తెలుపుదును? ఈ విశాల గంభీర సాగరమును దాటి వచ్చిన ఫలమేమి ? రామ లక్ష్మణులు, సుగ్రీవుడు తక్కిన వానర వీరులు నన్ను గాంచి యేమందురు?

నేను వెళ్ళి 'సీతాదేవి యెచ్చటనూ లేదని' చెప్పగనే ఈ సంతాపకరమగు కటు వార్తను వినిన మరుక్షణముననే శ్రీరాముడవశ్యముగా ప్రాణములను వదలును. రాముని మరణమునుగాంచిన యాతని ప్రేమ పాత్రుడగు లక్ష్మణుడు జీవించి యుండలేడు. ఈ విషాద వార్తను వినిన భరత శత్రుఘ్ను లెట్లు జీవించి యుండగలరు ? కొడుకు లెల్లరును మరణించిన పిదప వారి తల్లులు ఈలో

★ విమానములపై నెక్కుచు దిగుచుండుట, అనేక స్థలములందు నిఃసంకోచముగ పోవుచు వచ్చుచుండుటను గాంచిన హనుమంతునకు విశేషముగ లంక యిదివరకే పరిచయమైయుండెనని తోచుచున్నది. విస్తారపరిచయమునకై వాల్మీకి రామాయణము, సుందరాకాండమునందలి ౯౧౧౯ వ సర్గము, ౧౨-౨౫ వ శ్లోకములను చూడుడు. (అనువాదకుడు)

కము నందుండ గలరా ? రాముని యీ దుర్దశను గాంచిన యాతని మిత్రుడు జీవించి యుండజాలడు. ఇది జూచి యాతని భార్య 'రుమ' అంగదుని తల్లి 'తార', తరువాత వానర లోకమంతయును నశించ గలదు. ఐతే నేను కిష్కింధకు వెళ్ళి ఇంతటి మహా వినాశకరమగు ప్రళయమును సృష్టించుట కన్న సీత లభ్యము గాకున్న ఈ సముద్ర తీరము నందే చితినేర్పరుచుకొని దాని ప్రచండాగ్నికాహుతి యగుటయో, సముద్రమున మునిగి ప్రాణముల త్యజించుటయో, అట్లుగాకున్న ఈ శరీరమును పక్షుల కాహారముగ జేయుటయో, లేదా, తాపస వృత్తితో వృక్షమూలములందు జీవనమును వెళ్లమార్చుటయో చేయుదును. కాని సీతాదేవిని గాంచనిదే తిరిగి వెనకకు మరలను. ఆర్య వీర పురుషార్థినై రావణుని జంపెదను లేదా వాని నెత్తుకొని సముద్రము పై పైనే వెళ్లి రాముని చరణములపై బడ వేయుదును. యశస్విని యగు రామపత్నిని గాంచనంతవరకు లంకయందలి ప్రతియణువును గాలింతును కాని పిరికి పందనై వెనుకకు తిరిగి పోనని నిశ్చయించు కొనినాడు.

సాగరానూపజేదేశే బహుమూల ఫలోదకే ।
చితింకృత్వా ప్రవక్ష్యామి సమిద్ధ మరణీం సుతమ్ ॥ వా.రా.సు. ౧౩-౩౯॥
తాపసోవా భవిష్యామి నియతో వృక్షమూలకః ।
నేతః ప్రతిగమిష్యామి తామదృష్ట్వా సితేక్షణామ్ ॥ వా.రా. సుం. ౧౩-౪౩॥
యావత్సీతాం నపశ్యామి రామ పత్నీం యశస్వినీమ్ ।
తావదేతాం పురీంలంకాం విచినోమి పునః పునః ॥ సుం. ౧౩-౫౦॥

## ౧౬. అశోక వాటికా ప్రవేశము

ఇట్లాలోచించుచుండగా హనుమంతున కొక యూహ తళుక్కున మెరసినది. లంకయందొక యారామము 'అశోక వాటిక' యనునది గలదు. అది చాల విశాలమైనది. అందు అవశ్యకముగా సీతాదేవి జాడ దెలియ గలదని తోచినది. 'సంపాతి' యును 'అశోక వాటిక యందే రావణుడు సీతనుంచినాడు'

డని తెలిపి యుండెను. ఇట్టి యాలోచనలతో ఆంజనేయుడు అశోక వాటిక యందు ప్రవేశించినాడు. ఆ వాటిక యందనేక విధములగు స్వర్ణ రత్న రజిత మణి జటితములగు వేదికలు, సకల ఋతువులందును ఫలించగల వృక్షజాతులు నిర్మల శీతజలములను ప్రవహింప జేయు సెలయేరులు, నానా జాతుల పక్షులతో గూడిన సరోవరములు, కృత్రిమ పర్వతములు, పర్వతీయ పదార్థములు, బహువర్ణ పత్ర ఫల పుష్ప సుగంధములను విరజిమ్ము లతాగుల్మ వృక్షములతో నిండిన స్థలములను గాంచినాడు. కొన్ని వృక్షములు, స్వర్ణ స్తంభములు, నక్షత్రములవలె ప్రకాశించుచు సమీపస్థ భాగములపై స్వర్ణ కాంతులను విరజిమ్ముచుండెను. వాని సమీపమున నడుచు చున్నపుడు వాని కాంతి ప్రభల వల్ల తన శరీరమంతయు స్వర్ణమయమైనట్లు తోచినది.

**తేషాంద్రుమాణాం ప్రభయా మేరోరివ మహాకపి ।**
**అమన్యత తదావీరః కాంచనోఽస్మీతి సర్వతః ॥ వా.రా.సుం. ౧౪-౩౯।**

అచ్చట నున్న వృక్షజాతులను, వాని ఫలములను, అనేక వింత వింతలగు వస్తువులను, వాని నిర్మాణములను గాంచుచు అందందు సీతాదేవిని వెదకుచు ఒక నదీ ప్రాంతమునకు జేరినాడు. దానియందలి నీరు మిగుల స్వచ్ఛముగ నుండి నానా జాతుల పక్షుల సమూహములతో అతి శోభాయమానముగా నుండెను.

**ఇహైవని యతాహారో వత్స్యామి నియతేన్ద్రియః**
**నమత్కృతే వినశ్యేయుః సర్వేతే నరవానరాః ॥ వా.రా.సుం. ౧౩-౫౭.॥**

## ౧౭. సీతాదేవి ఈశ్వర నిష్ఠ

ఆ నదిని సమీపించగనే హనుమంతునికి తన నిరాశా చీకటులంతరించి ఆశాకాంతులు దరిచేరుచున్నట్లు దోచసాగినది. ఆతడిట్లాలోచించసాగినాడు. ప్రతి ఆర్య నారీ నరులు ప్రతిదినము సంధ్యా వందన మొనర్చుట జీవితమునకొక అనివార్యాంగము. కావున ప్రతి ఉదయ సాయం సంధ్యలందిచ్చటికి సీతాదేవి తప్పక వచ్చు చుండవలయును.

సంధ్యాకాల మనః శ్యామా ధ్రువమేష్యతి జానకీ ।
నదీచేమాం శుభజలాం సంధ్యార్థే వరవర్ణినీ ॥ వా.రా.సుం. ౧౪-౪౯॥

తస్యాశ్చాప్యనురూపేయ మశోకవనికా శుభా ।
శుభాయాః పార్థివేన్ద్రస్య పత్నీరామస్య సంమతా ॥ సుం. ౧౪-౫౦॥

యది జీవతి సాదేవి తారాధిపతి భాసునా ।
ఆగమిష్యతి సావశ్య మిమాంశీత జలాంనదీమ్ ॥ సుం. ౧౪-౫౧॥

ఈ నదికి జానకీదేవి తప్పకవచ్చును. ఏలన ఇట్టి శుభ వైదిక పథమున నడచు నామెకు సంధ్యావందన మొనర్చుకొనుటకు శుభజలయుక్తమగు ఈనది, ఈ వనము, అతియోగ్యముగ నున్నది. ఒక వేళ జానకి బ్రతికి యుండెనేని ప్రతి ఉదయం సాయంకాలములందు ఈ శీతల పరిశుద్ధ జలములుగల యీ నదికి తప్పక రాగలదు. ఈ విధముగ నాలోచించుచు హనుమంతుడు నలువైపులకు జూచుచు ముందుకు నడుచు చుండెను. ★

## ౧౮. జానకి దర్శనము

ముందర కొంత దూరము నుండి ఒక స్త్రీ రూపము వచ్చుచున్నట్లు గాన్పించినది. ఆమె అతి కృశించియుండి మలిన భూషాంబరముల దాల్చి కన్నీరు గార్చుచు వచ్చు చుండెను. ఆమె సువర్ణ సమానమగు శరీరము నివురుచే గప్పి

★ పూర్వకాలపు ఆర్యజాతి స్త్రీల ధర్మ భావమును జూడుడు. వారి యీ ధర్మ భావనలకు సాక్షిగా ఇతర జాతి పురుషులకు గూడ వారిపై ఎంతో గౌరవముండెడిది. ఎట్లన

అపాం సమీపే నియతం నైత్యికోవిధి మాస్థితః।
సావిత్రీ మప్యధీయతే గత్వారణ్యం సమాహితః ॥ మనుస్మృతి ॥

ఒక వేళ సీతాదేవి జీవించి యుండిన సంధ్య (బ్రహ్మ యజ్ఞము) జేసికొనుట కవశ్యముగా ఇచ్చటికి వచ్చును. ఆమె జీవించి యుండునను విశ్వాసము హనుమంతునకు పూర్తిగ లేకుండెను. ఈ కాలము నందే స్త్రీ యైన నింతటి దృఢవ్రతము గలిగి యుండుటను విన్నారా ? వేద సిద్ధాంతములకు విరుద్ధ మగు పురాణాదులనే మీరు ధర్మ గ్రంథములని నమ్మియున్నారు. వాని యందు స్త్రీలను శూద్రులుగా, వేదములకు అనధికారులుగా చిత్రింపబడియున్నదిగదా!



హనుమంతుని సీతా దర్శనము

బడిన నిప్పు వలె నుండెను. ఆమె ప్రతి చేష్ట నుండియు పతివ్రతా ధర్మ కిరణ ములు ప్రసరించు చున్నట్లుండెను.

ఆమెను గాంచినంతనే హనుమంతుడు మనస్సునందిట్లాలోచింప సాగి నాడు. " ఉపవాసములచే కృశించి పతి వియోగమున ఉదాసీనయై మనో దుఃఖముచే నిండియున్న యీమె నిజముగ సీతాదేవియే. ఎవరి వియోగమున శ్రీరాముడు శోకము, దుఃఖములందు మునిగి యున్నాడో, ఎవరి కొరకాత డనేక రాక్షసుల పరిమార్చినాడో, వారి సర్వనాశనమునకెప్పుడు కూడ సిద్ధముగ నున్నాడో, ఎవరి నన్వేషించుటకు నే నంతటి గంభీరమగు సముద్రమును దాటి వచ్చి ఇంతటి యభేద్యమగు లంకకు దారి గాంచితినో నిజముగ వారే ఈ మహా జనని సీత. ఈ దేవి నిమితమెన్ని కష్టములు పడవలసి వచ్చినను అవి యన్ని యును ఈమె సద్గుణములు, మరియు నీమె కష్టముల యెదుట తుచ్ఛములే.

ఈ సతీరత్నము పతివ్రతాధర్మమునే తన లక్ష్యమునందుంచుకొని తన పూజ్య పతి దేవుడగు శ్రీరామచంద్రుని భక్తి నిమిత్తము సమస్త సుఖ భోగము లను, వైభవములను త్యజించి వనవాస క్లేశములను మనస్సు నందుంచక నిర్జన వనములందు వసించు చుండినది. ఈ పరాధీనావస్థయందును ఈమె నిప్పు కణమువలె తేజోవంతమై యున్నది. ఈమెను పునః ప్రాప్తి జేసికొను భాగ్యమబ్బి నందులకు రాజ్య భ్రష్టుడగు శ్రీరామునకు పునః రాజ్య ప్రాప్తి గలిగిన దానికన్న మిన్నగ ఆనందానుభూతి కలుగ గలదు.

**సర్వాన్ భోగాన్ పరిత్యజ్య భర్తృస్నేహ బలాత్కృతా ।**
**అచింతయిత్వా కష్టాని ప్రవిష్టా నిర్జనంవనమ్ ॥** వా.రా. సుం. ౧౬-౧౯॥
**అస్యానూనం పునర్లాభా ద్రాఘవః ప్రీతి మేష్యతి।**
**రాజారాజ్య పరిభ్రష్టః పునః ప్రాప్యేవ మేధినీమ్॥ సం. ౧౬-౨౩॥**

ధన్య సీతామాతా ధన్య సమస్త రాజ్య భోగములను బంధు జనముల నెడ బాసి యుండియును ఈ ఫల పుష్పములను, రాక్షస వైభవములను ఆశా దృక్కులతో నైన జూడక ఏక చిత్తయై సదా శ్రీరామ చింతన మొనర్చు నీమె పతి

ప్రేమ ధన్యమైనది. ఏల గాదు? ఆర్య పుత్రి గదా ! ఆర్ష శాస్త్ర గ్రంథముల జదివినది గదా, అందు

**భర్తానామ పరంనార్యా శోభనం భూషణాదపి ।**
**ఏషాహి రహితాతేన శోభనార్హా న శోభతే ॥ వా.రా. ౧౬-౨౬॥**

పతి స్త్రీకి పరమ భూషణము, పతి వియోగ స్త్రీలు శోభకు యోగ్యులైనను శోభా హీనులేయగుదురు. సౌఖ్య హీనురాలై శ్రీరాముని తేజముతో ఉజ్వలితమై బంధు జన రక్షణకు దూరమై స్వశీల రక్షణ రక్షితయగు సీతను గాంచి హనుమంతుడు ఆనందాశ్రువులను వర్షించ సాగినాడు. తన యాత్ర సిద్ధించి ఫలవంతమైనందుల కెంతయో ఆనందానుభూతిని పొంది పరమేశ్వరుని కనేక ప్రణామములొనర్చి నాడు.

**తాందేవీం దీనవదనా మదీనాం భర్తృ తేజసా ।**
**రక్షితాం స్వేన శీలేన సీతామసిత లోచనామ్ ॥ వా.రా. సుం. ౧౭-౩౦॥**
**హర్ష జానిచ సోఽశ్రూణి తాం దృష్ట్వా మదిరేక్షిణామ్ ।**
**ముమోచ హనుమాన్స్తత్ర నమస్కృత్ర చరాఘువమ్ ॥ వా.రా.సుం. ౧౭-౩౧॥**

## ౧౯. సీతా ఆంజనేయుల సంవాదము

ఆంజనేయుడు తన కార్య సిద్ధి విషయమాలోచించు చుండెను. వేద వేదాంగ జ్ఞాతలగు యజ్ఞకర్తలు బ్రహ్మముహూర్తముననే లేచి వేద మంత్రముల పఠింప సాగినారు. వానిని విని రాక్షస నగరమున సైతము వైదిక కర్మల అనుభూతిని పొందిన హనుమంతుడు నిత్యకృత్య నిర్వహణమున తల్లీనమై నాడు.

సూర్యోదయ మగుటతోడనే నగరమున వందిమాగధులు, భట్టులు, నానా విధ స్తోత్ర పాఠములచే రావణుని మేల్కొలిపినారు. రావణుడు సుఖ శయ్యపై నుండి లేచి ఆవశ్యకములు నిర్వర్తించుకొని బంధువులతో గూడి వైదిక నిత్య కర్మల నెరవేర్చు కొనినాడు. నిత్య విధుల యనంతరము వివేక హీనుడై రావణుడు సీతకు కు మార్గ ప్రేరణ నిచ్చు నుద్దేశముతో అశోక వాటికకు బయలు దేరినాడు. అచ్చటికి జేరి రావణుడు అనేక విధములగు లోభములతో, భయ

ముతో సీతను తన స్వాధీన మొనర్చు కొనుటకు ప్రయత్న మొనర్చినాడు. కాని సీత ఎట్టి స్థితి యందైనను తన నిశ్చయము నుండి విచలింప లేదు. ఆతడు తిరిగి వెళ్ళి పోయిన తరువాత ఆతని యాజ్ఞచే రాక్షసాంగన లనేక రీతులు భయ పెట్టసాగినారు. ఆ సమయముననే 'త్రిజట' యను రాక్షస వనిత తన స్వప్న వృత్తాంతమును దెలియ పరచి సీతకు కొంత ధైర్యమును గలిగించినది. ఆమె మాటలను విని క్రూరులగు ఇతర రాక్షసాంగనలు శాంతి వహించినారు.

చాటున దాగి యుండి చూచుచున్న హనుమంతుడు సీత, రావణుడు, త్రిజట, మరియు ఇతర రాక్షసాంగనల మాటలన్నియును వినిన పిదప ఇట్లా లోచించి నాడు. ''నేను మానుషీభాష సంస్కృతమున ద్విజాతీయుల వలె పలు కుదునేని నన్ను రావణునిగా నెంచి సీత భయ భీతురాలు గావచ్చును. లేక నా మాతృ భాషయగు వానరీ భాషయందు మాట్లాడినచో నామె దెలిసికొన జాలదు.

**యది వాచం ప్రదాస్యామి ద్విజాతిరివ సంస్కృతామ్**
**రావణం మన్య మానామాం సీతాభీతా భవిష్యతి ॥** ఆధ్యాత్మ రామాయణ॥

ఏది యెట్లైనను సీతకు రాష్ట్ర భాష సంస్కృతమునందే సాంత్వనము గలిగించెదనని తలచి శ్రీరాముని గుణ గణములను, రామలక్ష్మణుల కుశల సమాచారమును శ్రుతపరిచినచో సీత తన్ను విశ్వసించి తన విషయములను తెలియ పరచగలదని నిశ్చయించుకొని హనుమంతుడు శ్రీరాముని జననము మొదలు కొని వనవాసము, సీతాహరణము, సుగ్రీవ సఖ్యము, తాను సముద్రమును దాటి వచ్చుట, లంకా నగరమును గాలించుట, చివరికి అశోక వాటికకు చేరుట మున్నగు విషయములను శ్రుత పరచినాడు.

శ్రీరాముని సంపూర్ణ చరిత్రను వినిన సీతాదేవికెంతో విస్మయానందము గలిగినది. ఇది స్వప్నమా, లేక భ్రమయా ? యని యెంచి ఇట్లనినది. ( దీని వర్ణన ఆధ్యాత్మిక రామాయణమున)

**యేనమే కర్ణపీయూషం వచనం సముదీరితమ్।**
**సదృశ్యతాం మహాభాగః ప్రియవాదీ మమాగ్రతః ॥** ఆ.రా.౫-3-౧౮॥

"అమృత సమానమైన అత్యంత ప్రియ వార్తను వినిపించిన ప్రియ భాష మహా భాగులు నా యెదుటకు దయ చేయవలె" నని సీత పలికినది. ★

ఈ వచనములను విని హనుమంతుడు వృక్షము నుండి క్రిందికి దిగి వచ్చి అతి వినయముతో ఎదుట నిలిచి సీతాదేవికి ప్రణామమొనర్చినాడు. ఆకస్మికముగ నొక వానరుడు తన యెదుట నిలుచుటను జూచిన సీతకు "రావణుడే నన్ను మోస పుచ్చుటకీ వేషమున వచ్చినాడ"ను అనుమానము గలిగి అవనత వదనయై యుండెను. ★★

అదిగాంచిన హనుమంతుడు "అమ్మా, ! జానకీ ! నేను రామదూతనని శపథము చేసి చెప్పుచున్నాను. అని యనినాడు. సీత యడిగిన మీదట వానర రాజగు సుగ్రీవునితో శ్రీరామునకు గలిగిన మైత్రిని గురించిన కథయంతయును విస్తార రూపమున వినిపించి నాడు. రామలక్ష్మణుల శారీరక చిహ్నములు, వారి గుణ స్వభావములను వర్ణించినాడు. తాను ఋష్యమూక పర్వతముపై బారవైచిన వస్త్రాభూషణములను జూపగ శ్రీరామ లక్ష్మణులు దుఃఖించిన విధమును సవిస్తారముగ దెలియ పరచినాడు. ఈ విషయములెల్ల విని పిదప ఆంజనేయునిపై సీతకు సంపూర్ణ విశ్వాసము గలిగినది. ఈ విషయము ఆధ్యాత్మిక రామాయణము నందలి రోచకముగ, విస్తృతముగ నిట్లు వ్రాయబడి యున్నది.

## ౨౦. శ్రీరాముని యశోగానము

**తేజసాఽఽదిత్య సంకాశః క్షమయా పృథివీ సమః ।**

**బృహస్పతి సమోబుద్ధ్యా యశసా వాసవోపమః ॥ ఆ.రా. 3౭-౯ ॥**

★ ఇందువల్ల ఆ కాలమున రావణుని మాతృభాష సంస్కృతమే యై యుండెననియు, అతడు సీతయెదుట సంస్కృతముననే ప్రసంగించెననియు, సీత యొక్క మాతృభాషయును సంస్కృతమేయై యుండెననియు, హనుమంతుడనేక భాషలందు పండితుడై యుండెననియును స్పష్ట పడుచున్నది.

★★ సీత యిట్లు సంశయించుట వల్ల "శారీరక దృష్టితో వానర, మరియు రాక్షసులలో భేద మేమి లేకుండెననియు, వానర రాక్షసులెల్లరును మానవులే యై యుండిరనియును, విశేషమేమన, వానరులు, మరియు రాక్షసులందు కేవలము రాష్ట్రీయ వేష, భూష, భాషలయందవశ్యముగ కొంత భిన్నత్వముండె" ననియు ప్రతీతమగుచున్నది.

ఒకచెడ్డపని నీమంచి తనమంతయు (నీమంచినంతయు) నాశనము చేయును.

రక్షితాజీవలోకస్య స్వజన స్యచరక్షితా ।
రక్షితా స్వస్య వృత్తస్య ధర్మస్యచ పరంతపః ॥ ఆ.రా. ౩౫-౧౦ ॥
రామోభామిని లోకస్య చాతుర్వర్ణస్య రక్షితా ।
మర్యాదానాంచలోకస్య కర్తాకార యితాచసః ॥ ఆ.రా. ౩౫-౧౧॥
అర్చిష్మానర్చితో౽త్యర్థం బ్రహ్మచర్యవ్రతేస్థితః॥
సాధూనాముపకారజ్ఞః ప్రచారజ్ఞశ్చ కర్మణామ్ ॥ ఆ.రా. ౩౫-౧౨॥
రాజనీత్యాం వినీతశ్చ బ్రాహ్మణానాముపాసకః॥
జ్ఞానవాన్ శీలసంపన్నో వినీతశ్చ పరంతపః ॥ ఆ.రా. ౩౫-౧౩॥
యజుర్వేదే వినీతశ్చ వేద విద్భి సుపూజితః॥
ధనుర్వేదేచ వేదేచ వేదాంగేషు చనిష్ఠితః ॥ ఆ.రా.౩౫-౧౪॥

ఓ మాతా ! శ్రీ రామచంద్రుని ముఖము చంద్రుని వలె, నేత్రములు కమలముల వలె, తేజస్సు సూర్యునివలె, క్షమ పృథివి వలెనున్నవి. ఆయన బుద్ధి యందు బృహస్పతి, యశస్సునందు దేవరాజగు ఇంద్రుని మించును. ఆతడు జీవలోకమును, స్వ బంధు జనమును రక్షించువాడు. చాతుర్వర్ణ మర్యాద నిర్మాత, మరియు రక్షకుడునై యున్నాడు. జననీ ! శ్రీరాముడు ఎల్లరు పూజింప బడువాడై బ్రహ్మచర్య వ్రత ధారణ నొనర్చు కారణమున సదాప్రకా వంతుడై యుండును. ఆతడు సాధువుల ఉపకారమును మరవని వాడు. సత్క ర్మల ప్రచారము నెరుగువాడు. రాజనీతి కోవిదుడు, బ్రాహ్మణోపాసకుడు జ్ఞాన శీల సంపన్నుడు నై యున్నాడు. చతుర్వేద పారంగతుడు, వేదజ్ఞులంద పూజించ దగినవాడు. ధనుర్వేదము నందు ప్రవీణుడు మరియు అన్యాన్య వేదాం ములందత్యంత నిపుణుడు. సోదరులిరువురును సకల సద్గుణ సంపన్నులు.

సత్యధర్మరతః శ్రీమాన్ సంగ్రహానుగ్రహేరతః।
దేశకాల విభాగజ్ఞ సర్వలోక ప్రియంవదః ॥ వా.రా.సుం. ౩౫-౨౦
భ్రాతాచాస్యచవై మాత్రః సౌమిత్రి రమిత ప్రభః ।
అనురాగేణ చ రూపేణ గుణైశ్చాపి తథావిధః ॥ వా.రా. సుం. ౩౫-౨౧॥
శ్రీరాముడు సత్య ధర్మరతుడు, లక్ష్మీప్రసన్నుడు, నిగ్రహానుగ్ర

ములందు ప్రవీణుడు. దేశకాల పరిస్థితులను చక్కగా నెరుగువాడు. సకల జనులతో మధురముగ, హితకరముగ భాషించువాడు. ఆతని తమ్ముడగు లక్ష్మణుడును మహా ప్రభావవంతుడును, స్నేహశీలియే గాక ఇతర గుణముల యందును శ్రీరామునకు సమానమైనవాడు.

ఆ సోదరులిరువురును నిన్ను వెదకుచు తన యన్నయగు వాలిచే ఘోర అవమానమును పొంది గృహమునుండి తరిమి వేయబడిన సుగ్రీవునితో ఋష్యమూక పర్వతముపై గలిసికొనినారు. వారు దాదాపు ఒకే విధమగు దుఃఖమును అభవించుచున్నవారై యుండుట వల్ల పరస్పరము ప్రియ స్నేహితులైనారు. నిన్ను వెదకుటకై సుగ్రీవ మహారాజు వానర సైన్యముతో బాటు నన్ను నియోగించినాడు. ఓ మాతా! శ్రీరాముడు నీ దర్శనమునకై తహతహ లాడుచున్నాడు.

**త్వత్కృతే తమ నిద్రాచ శోకశ్చిన్తాచ రాఘవమ్ ॥**

**తాపయన్తి మహాత్మాన మగ్న్యాగార మివాగ్నయః** ॥వా.రా.సుం. ౬౪-౪౬॥

నీ వియోగమున మహాత్ముడగు రాముని శోకము, దుఃఖము, నిద్ర చింతయునునవి ఎండు తృణమును అగ్ని గాల్చి వేయునట్లు గాల్చు చున్నది. శుభ లక్షణ లక్షితుడగు లక్ష్మణుడు తన యన్న సేవయందు శిష్యునివలె రతుడై యుండును. సుగ్రీవ మహారాజుగారి యాజ్ఞతో నిన్ను వెదకుచు చివరకిచ్చట గాంచ గలిగితిని. నీ దర్శనము మరియు సందేశములచే అనేక భయగ్రస్థ వానర వీరులను, శ్రీరామ లక్ష్మణులను, శోక రహితులనుగా చేసి వేయుదును. నేను లంకకు చేరుట వ్యర్థముగా లేదు. నీ దర్శన రూపమగు యశస్సు కేవలము నాకే లభ్యమైనది. తల్లీ! నీ శోకము దొలగిపోవు సమయము వచ్చినది. రఘుకుల భూషణుడగు శ్రీరాముడతి శీఘ్రముగ ఇచ్చటికి చేరి, దుర్మార్గుడగు రావణుని పుత్ర మిత్ర బంధు భట వర్గముతో గూడ నాశనమొనర్చి నిన్ను తన వెంట గొని పోగలడు. ఇక నీవు దుఃఖించక ధైర్యము వహించుమనిన.

ఇదియంతయును వినిన తరువాత సీతాదేవి అతి ప్రసన్నురాలై హనుమంతుని కృతజ్ఞతా పూర్వకముగా గీర్తించి తన విశ్వాసమును దెలిపినది.

## ౩౧. రామాంగుళీయ సమర్పణము

హనుమంతుడు శ్రీరాముని దూతయే యను విశ్వాసము సీతాదేవికి సంపూర్ణముగ గలిగినది. ఐనను, దాని నింకను దృఢపరచుకొనుటకై ఆంజనే యుడు శ్రీరాముని యుంగరమును జానకీ దేవికి సమర్పించినాడు. దానిని పొందిన సీతా దేవి యానందము వర్ణనాతీతముగ నుండెను. సాక్షాత్తు శ్రీరామ దర్శనమే యైనట్లు ఆనందానుభూతి నొందినది. అప్పుడామె వదనము గ్రహణ విముక్త చంద్ర బింబము వలె కాంతి మంతమైనది. ఆ యానందమున హను మంతుని ఈవిధముగ ప్రశంసించినది.

**విక్రాన్తస్త్వం సమర్థస్త్వం ప్రాజ్ఞస్త్వం వానరత్తోమ।**
**యేనేదం రాక్షస పదం త్వయైకేన ప్రధర్షితమ్ ॥ వా.రా. సుం. ౩౬-౭॥**
**శతయోజన విస్తీర్ణః సాగరో మకరాలయః।**
**విక్రమ శ్లాఘనీయేన క్రమతా గోష్పదీకృతః ॥ సుం. ౩౬-౮॥**
**నహిత్వాం ప్రాకృతం మన్యే వానరం వానరర్షభ।**
**యస్యతేనాస్తి సంత్రాసో రావణాదపి సంభ్రమః ॥ సుం. ౩౬-౯॥**
**అర్హసేచ. కపిశ్రేష్ఠ! మయాసమభి భాషితమ్।**
**యద్యసి ప్రేషితస్తేన రామేణ విదితాత్మనా ॥ సుం. ౩౬-౧౦॥**
**ప్రేషయిష్యతి దుర్ధర్షో రామోనహ్య పరీక్షితమ్।**
**పరాక్రమ మవిజ్ఞాయ మత్సకాశం విశేషతః ॥ సుం. ౩౬-౧౧॥**

'' ఆంజనేయా ! నీవు మహా శూరవీరుడవు. సమర్థ వంతుడవు, బుద్ధి మంతుడవు, నీ వొక్కడవే నిర్భయముగ మహాభయంకరమగు ఈ రాక్షస నగ రము నవమానపరచితివి. నిన్ను గన్న తల్లి ధన్యురాలు. నీ పురుషార్థము ధన్య మైనది. మహా భయంకర జల జంతువులచే నిండియున్న సముద్రమును తుచ్ఛ ముగ నెంచి దాటి వచ్చితివి. కావున నిన్ను నేను సామాన్య వానరునిగ దలచను. నీకు రావణుడనిన ఇసు మంతయును భయము లేదు. ఓ వానర శ్రేష్ఠా! నీవ

తో సంభాసించు యోగ్యత గలిగిన వాడవు. కావుననే ఆత్మ వేత్తయగు శ్రీరా
డు నిన్నే యెంపిక జేసి పంపించినాడు. రాముడెప్పుడును అపరీక్షిత పరాక్రమ
న పురుషుని నా వద్దకు బంపించడు.'' అని కీర్తించినది. ఆధ్యాత్మ రామా
ణము నందిట్లు వ్రాయబడియున్నది. ''వానర సైన్యమును దీసికొని శ్రీరాము
ంతటి విశాల సాగరమును దాటి ఇచ్చటి కెట్లు చేరగలడ'' ని సీత యాంజనే
యునకు తన సంశయమును దెలిపినది.

**హనుమానాహమేస్కంధా వారుహ్యా పురుషర్షభా ।**
**ఆయాస్యతః ససైన్యశ్చ స్సుగ్రీవో వానరేశ్వరః ॥ అ.రా. సుం. ౨-౪౬॥**
**విహాయసాక్షణేనైవ తీర్త్వా వారధి మాతతమ్ ॥ అ. సుం. ౨-౪౭॥**

హనుమంతుడు ''జననీ ! ఆ యిరువురు నరశ్రేష్ఠులు నా భుజముల
క్కి రాగలరు. వానర రాజగు సుగ్రీవుడు తన సకల సైన్యములతో ఆకాశమార్గ
మున క్షణములో నిచ్చటికి జేరగలడు''. అని తెలుపగనే సీతాదేవి అత్యంతానం
మున అతి నమ్రత శబ్దములతో హనుమంతునికి తన సందేశమును దెలిపినది.
స్తుతి యుక్త శబ్దములతో హనుమంతునికి ధన్యవాదము లర్పించినది.

## ౨౨. అశోక వన విధ్వంసనము

సీతాదేవిని వీడ్కొని హనుమంతుడు 'వీరులగు వారు ఎవరికిని దెలియ
కుండా దొంగవలె వెడలి పోవుట శోభావంతముగ నుండదు. ఎట్లులైనను నా
రాకను రావణున కెరిగించవలయు'' నని తలచి రావణున కతిప్రియమగు అశోక
వాటికను విధ్వంస మొనర్పసాగినాడు. రాక్షసాంగన లదిగాంచి సీతతో '' ఈతఁ
డెవడు ? ఇచ్చటికెట్లు వచ్చినాడు? నీతోనేమి సంభాషించినా'' డని యడిగి
నారు. కాని సీత వారితో అతిక్లుప్తముగ ''రాక్షసుల మాయలేమో నేనెరుగ జాలను. ?
సర్ప పాదములను సర్పమే యెరుగగల'' దనిమాత్రమే చెప్పినది.

అశోక వన విధ్వంసమును గూర్చి రాక్షసాంగనలు రావణునకు దెలియ
పరచినారు. ఈ వార్తను విని రావణుడతి కోపముతో కన్నుల నిప్పులు రాల్చుచు
హనుమంతుని బట్టి తెచ్చుటకు అనేక రాక్షస యోధులను బంపినాడు. అస్త్ర

శస్త్ర ధారులగు రాక్షస వీరులనేకులు హనుమంతుని జేరి అనేక పరుష వాక్య ములతో తూలనాడుచు ఆయుధములను ప్రయోగించ సాగినారు. ఇదిగాంచిన తేజస్వియగు హనుమంతుడు వీర గంభీర స్వరమున మహాపరాక్రమోపేతుడగు శ్రీరామునకు, మహావీరుడగు లక్ష్మణునకు, శ్రీరాముని మిత్రుడగు మహా రాజ సుగ్రీవునకు జయనినాదములను బలికినాడు. దీని వర్ణన మిట్లున్నది.

**జయత్యతిబలీ రామో లక్ష్మణశ్చ మహాబలః ।**
**రాజాజయతి సుగ్రీవో రాఘవేణాభి పాలితః ॥ వా.రా. సుం. ४೨-33॥**
**దాసోఽహం కోసలేన్ద్రస్య రామస్యాక్లిష్ట కర్మణః ।**
**హనుమాన్శత్రు సైన్యానాం నిహన్తా మారుతాత్మజః ॥ సుం. ४೨-3४॥**
**నరావణ సహస్రంమే యుద్ధే ప్రతిబలం భవేత్ ।**
**శిలాభిశ్చ ప్రహస్తశ్చ పాదపైశ్చ సహస్ర శః ॥ సుం॥ ४೨-3౫॥**
**అర్దైయిత్వా పురీం లంకా మభివాద్యచ మైథిలీమ్।**
**సమృద్ధార్థో గమిష్యామి మిషతాం సర్వరక్షసామ్ ॥ సుం. ४೨-3౬॥**

తమ లంకా నగరమున రామలక్ష్మణ సుగ్రీవులకు జయ నినాదము లను సలుపుటను వినిన రాక్షసులు క్రుద్ధులై "నీవెవ్వడవు, ఎచ్చటి నుండి వచ్చి నావు. ఈ వనము నిట్లేల విధ్వంసమొనర్చుచున్నా" వని యడిగినారు. అందుల కాంజనేయుడిట్లు తెలుపుచున్నాడు.

అతిశ్రేష్ఠ కర్మ పరుడు, కోసలేంద్రుడగు శ్రీరాముని సేవకుడను, శత్రు వుల పాలిటి కాలుడను, పవన పుత్ర హనుమంతుడను. ఉత్తమాస్త్ర శస్త్రము లను ధరించిన వేయి మంది రావణులైన నను నన్ను యుద్ధమున జయించలేరు. లంకా పురమును సర్వము గాలించి, సీతామాతను దర్శించి ప్రణామమొనర్చి, సకల రాక్షసులు జూచు చుండగా నాకార్యములను సిద్ధింపజేసికొని వెళ్లిపోవుచు న్నాను" అని యనిన విని రాక్షసులు ఒక్కుమ్మడి హనుమంతుని పై బడినారు. హనుమంతుడు క్రమక్రమముగా వారి నెల్లరను యమపురికి పంపినాడు.

---

## ౨౩. రాక్షసులతో యుద్ధము

రాక్షస వీరుల మరణవార్తను విని రావణుడు రణదుర్జయుడు మహా బలుడగు జంబుమాలియను వానిని స సైన్యముగ హనుమంతుని బట్టుటకు బంపినాడు. కాని ఒకే యొక పిడిగ్రుద్దుతో హనుమంతుడు వానిని హతమార్చి నాడు. ఇది వినిన రావణుడు మహాక్రుద్ధుడై, తక్షణమే తమ మంత్రుల పుత్రు లను బంపినాడు. వారు వెంటనే వెళ్ళి హనుమంతునిపై బాణ వర్షమును గురి పించ సాగినారు. ఆంజనేయుడు వారిని దప్పించుకొనుచు, అందరిపై ప్రహర ణముల నొనర్చుచు సాయంకాలము వరకు వారి నెల్లరను జంపివేసినాడు.

మంత్రుల, పుత్రుల మరణవార్తను విని రావణుడు కడు దుఃఖితుడై వెంటనే తన యాస్థానమునందలి గొప్ప గొప్ప విద్వాంసులను సమర విద్యా విశా రదులను సమావేశ పరచి, ఆలోచించి వారెల్లరి సమ్మతితో విరూపాక్షుడు, ఉపా క్షుడు, ప్రఘసుడు, బాసకర్ణుడు మున్నగు సేనానాయకులతో సంబోధించి "మహావీరులారా! మీరు సత్వరమే వెళ్ళి ఇంతటి యుగ్ర కర్మలొనర్చిన ఆ కపిని బట్టి తెండు. ఈతనితో నీతి శాస్త్రమునననుసరించి దేశకాల పరిస్థితుల నాలో చించుట మంచిది. ఏలన, నే నీతని సామాన్య వానరునిగా దలచను. వానర జాతియందలి కడుబలవంతుడగు వాలి, సుగ్రీవుడు, మహాబలి జాంబవంతుడు, సేనాపతి నీలుడు, మరియు అన్యాన్య ద్వివేదుల (రెండు వేదముల నెరిగిన వారల) ననేకుల జూచితిని. కాని వారిలో నీతని యందు గల భీమగతి, తేజము, పరా క్రమము, బుద్ధి, బలము, ఉత్సాహములు లేవు. ఆ రూపు లావణ్యములు గూడ గాన రావు. కావుననే నేనాతని మహా మహిమ గల శక్తి సంపన్న పురుషునిగా ంచు చున్నాను. కావున నాతని బట్టుటకు ప్రబల యత్నమునే జేయవలసి యుండును. సురాసురులు, మానవులెవ్వరును మీ యెదుట నిలువ లేరు.

**ామంలో కాప్త్రయః స్సేన్ద్రాః ససురాఽసుర మానవాః ।**
**భవతామగ్రతః స్థాతుం నపర్యాప్తారణాజిరే ॥ వా.రా. సుం. ౪౬-౧౫॥**
**థాపితున యజ్ఞేన జయమాకాంక్ష తారణే ।**
**ాత్మా రక్ష్యః ప్రయత్నేన యుద్ధ సిద్ధిర్హచంచలా ॥ వా.రా. సుం. ౪౬-౧౬॥**

ఐనను యుద్ధమున జయాపజయములు చంచలములు. కావున జయాభిలాషులు, నీతివంతులగు పురుషులు ఆత్మరక్షణ విషయము నందతి జాగరూకులై యుండవలయు''నని యుపదేశించినాడు.

రాజాజ్ఞను పొంది అనేక యోధులను వెంటగొని విరూపాక్షుడు మొదలగు ఐదుగురు సేనాపతులు హనుమంతుని బట్టుటకు బయలు దేరినారు. హనుమంతుని గాంచిన వెంటనే ప్రహారణముల గావించ సాగినారు. యుద్ధ విశారదుడగు హనుమంతుడు వారి ప్రహారములను దప్పించుకొనుచు స్వాత్మరక్షణ యత్నమునే జేసినాడు. కాని వా రతిక్రౌర్యమున వర్తించుటతో కొద్ది కాలముననే సేనా సమేతముగా వారెల్లరను హతమొనర్చి వారి సహాయమునకు వచ్చుచున్న యోధులతో యుద్ధ మొనర్చుట కుద్యుక్తుడైనాడు.

వాల్మీకి రామాయణము నందు దీని వర్ణనము అతి సుందరముగా నున్నది. హనుమంతుని అతులిత పరాక్రమ చిత్రణ మొనర్చుచు దాని యందిట్లున్నది.

**తవేనాభ్య హనత్ కాంశ్చిత్ పాదైః కాంశ్చిత్పరం తవః ।**
**ముష్టిభిశ్చా హనత్కాంశ్చి న్నభైః కాంశ్చి ద్వ్యదారయత్ ।।వా.రా.సుం. ४७-౧౨।।**
**ప్రమమాతో రసా కాంశ్చి ద్రుభ్యామపరానపి ।**
**కేచిత్త స్త్రైవ నాదేన తత్రైవ పతితాభువి ।। వా.రా.సుం. ४७-౧౩।।**

హనుమంతుడు ఆరాక్షసులను చరుపులలో కొందరను, పాదముల క్రింద నలపి మరికొందరను, పిడికిలి పోట్లతో ఇంకా కొందరను, నఖములతో జీల్చి యనేకులను జంపి వేసినాడు. వక్షమునకదిమి కొందరను, నలిపివేసినాడు. పిడుగువంటి ఆతని గర్జనమును విని అనేక రాక్షసులుఅక్కడికక్కడనే మట్టిగరచినారు.

## ४८. హనుమంతుని బంధనము

సేనాపతులైదుగురును యమాలయమునకు జేరినారను వార్తను విని రావణుడు అక్షయ కుమారుని సైన్య సహితముగ బంపినాడు. కాని యనతి కాలముననే స సైన్యముగ అక్షయ కుమారుడు చనిపోయిన వార్తను విని రావణు

డతి క్రుద్ధుడై ఇంద్రజిత్తును(మేఘనాథుని) బిలిచి ''కుమారా! నీ వందరిలో మేటి వీరుడవు, భుజ బలమున ప్రసిద్ధుడవు. విద్య మరియు తపః ప్రభావ మును, దేశ కాలములను చక్కగా నెరుగ గల ధీ శాలివి. వెళ్లి యా వానరుని బట్టి తెమ్ము. మన ప్రముఖ యోధుల నెందరనో హత మొనర్చినాడు. అక్షయ కుమా రుని సైతము మ్రింగి కూర్చున్నాడు. ఎంత లెంతటి యోధులను జంపిన వాని యెదుట నే నేమి జేయగల'' నని తలచకుము. నీలో నున్న బలము వాని యం దెక్కడిది ? కావున నీవు వెళ్లి వానిని శీఘ్రముగ బట్టి తెమ్ము.

**నఖల్వియంమతిశ్రేష్ఠ ! యత్త్వంస ప్రేషయామ్యహమ్ ।**
**ఇయన్చ రాజ ధర్మాణాం క్షత్రస్య చమతిర్మతా ॥ వా.రా.సుం. ౪౮-౧౩॥**
**నానాశస్త్రేషు సంగ్రామే వైశారద్య మందిరమ్ ।**
**అవశ్యమేవ బోద్ధవ్యం కామ్యశ్చ విజయోరణే ॥ వా.రా.సుం. ౪౮-౧౪॥**

ప్రియకుమారా ! ఈ మహా సంకటమున నిన్ను బంపుటకు నా కెంత మాత్రము ఇష్టము లేనిదైనను ఏమిచేయుదును ? క్షత్రియ (రాజ) ధర్మనీతి యిదియే గదా ! శత్రు దమనా! ''నానాస్త్ర శస్త్ర ప్రయోగనిపుణత, విజయ మునే చేపట్టవలయునను దీక్ష యుద్ధమున యోధులకు ఈ రెండే సహాయ కారులై యుండును''. అని బోధించి యుద్ధమునకు బంపించినాడు.

రాజాజ్ఞను బొంది మేఘనాథుడు అస్త్ర శస్త్రముల ధరించి రథా రూఢుడై హనుమంతుని జేరి భీకర యుద్ధ మొనర్చినాడు. హనుమంతుని సమర కౌశలమును గాంచి ఆశ్చర్య చకితుడై ఎట్లైన నీతని బట్టి తీసికొని పోవలెనని తలచినాడు.

**అవధ్యోఽయమితిజ్ఞాత్వా తమస్త్రేణాస్త్ర తత్త్వమిత్।**
**నిజగ్రాహమహాబాహుం మారుతాత్మజ మింద్రజిత ॥వా.రా.సుం.౪౮-౩౭॥**
**తేనబద్ధస్తతోఽస్త్రేణ రాక్షసేన సవానరః।**
**అభవన్నిర్వి చేష్టశ్చ పపాత చ మహీతలే ॥ వా.రా.సుం. ౪౮-౩౮॥**
**గ్రహణో చాపిరక్షోభిర్మహాన్మే గుణదర్శనమ్ ।**
**రాక్షసేన్ద్రేణ సంవాదస్తస్మాద్గృహ్ణాతు మాంపరే ॥ సుం. ౪౮-౪౮॥**

మేఘనాథుడు దూరమునుండియే యొక అమోఘాస్త్రమును ప్రయోగించి హనుమంతుని బంధించినాడు. బంధింపబడగానే హనుమంతుడొకసారి నిశ్చేష్టుడై భూమిపై బడి మరునిముషముననే తేరుకుని ''రాక్షసులు నన్ను రావణుని యెదుట ప్రవేశ పెట్టదలచియే ఈ నిగ్రహాస్త్రమును ప్రయోగించినారు. దీనివలన తన కెంతయో మేలు గలిగినది. ఏలన, ఈ మిషచే రావణుని సభాస్థలి ప్రవేశించి వానితో సంభాషించి, వాని రీతి, నీతి, బలదర్పముల స్థితిగతులను దెలిసికొను నవకాశము గలుగ గల''దని తలచినాడు.

## ౨౫. రావణ సభలో హనుమంతుడు

ఆధ్యాత్మ రామాయణము నందిట్లు వ్రాయబడి యున్నది. ''హనుమంతుడు రావణుని సభా మందిరమునకు గొనిపోబడినాడు, సమస్త సభాసదుల మధ్య రత్న ఖచిత స్వర్ణసింహాసమున అత్యంత ఠీవితో గూర్చున్న రావణుని గాంచినాడు. హనుమానుని జూడగనే రావణునికి మహా చింతా భయములు గలిగినవి. ఈ భయంకర వానరుడెవ్వడై యుండునని అనేక రీతుల వితర్కించుకొని ప్రహస్తునితో

**ప్రహస్త పృచ్ఛైన మ సాకిమాగతః కిమత్ర కార్యకుత ఏవ వానరః ।**
**వనం కిమర్థం సకల వినాశినం, హతాకిమర్థం మమరాక్షసాబలాత్**

**॥ ఆ.రా. ౨-౪-౨॥**

''ప్రహస్తా ! ఈ వానరుడెచ్చటినుండి యేల వచ్చినాడు ? ఇచ్చట వాని కేమి పని ? నా వాటిక నేల విధ్వంస మొనర్చినాడు ? బలాత్కారముగ నా రాక్షస వీరుల నేల ప్రమందించినాడో వీని నడుగుము. అని యనగానే రావణునాజ్ఞతో ప్రహస్తుడు హనుమంతునితో నిట్లడిగినాడు.

**రావణస్య వచః శ్రుత్వా ప్రహస్తో వాక్యమబ్రవీత్ ।**
**సమాశ్వసిహి భద్రన్తే నభీః నార్యాత్వయాంకపే ॥ ఆ.రా. ౨౦-౭॥**
**యదితావత్వ మిన్ద్రేణ ప్రేషితో రావణాలయమ్ ।**
**తత్వ మాఖ్యాహి మాతేభూ ద్భయం వానర ! మోక్ష్యసే ॥ ఆ.రా. ౨౦-౮॥**

**యదివైశ్రవణస్యత్వం యమస్య వరుణస్యచ ।**

**దారురూప మిదం కృత్వా ప్రవిష్టోసః పురీమిమామ్ ॥ ఆ.రా. ౫౦-౯॥**

**విష్ణునాప్రేషితో వాపి దూతో విజయకాంక్షిణా।**

**న హితో వానరం తేజో రూపమాత్రం తు వానరమ్ ॥ ఆ.రా. ౫౦-౧౦॥**

**తత్వతః కథయ స్వాద్య తతో వానర మోక్ష్యసే ।**

**అనృతం వదతశ్చాపి దుర్లభం తవ జీవితమ్ ॥ ఆ.రా.౫౦-౧౧॥**

"ఓ వానరా! నీ వీ రావణ నగరమునకు ఎవరు బంపగ వచ్చినావు? ఇంద్రుడు బంపగ వచ్చితివా? కుబేరుడు, యముడు, వరుణుడు మున్నగు వారి దూతవా? జయము నాకాంక్షించు విష్ణువే నిన్ను బంపినాడా? లంకకు నీ వేల వచ్చితివి? సత్యమును దెలుపుము. అబద్ధములాడిన నీ జీవితము సమాప్త మగును." అని ప్రశ్నించిన మంత్రి వాక్యములకు హనుమంతుడిట్లను చున్నాడు. "నే నింద్ర, యమ, వరుణుల దూతను గాను. కుబేరుని మైత్రి నాకు లేదు. విష్ణువు బంపగ వచ్చినవాడను సైతము గాను. వానర జాతి వాడను. రాక్షసేంద్రుని దర్శనమునకు వచ్చినాను. రావణ దర్శనము దుర్లభమని తోచినందున ఉపవన వినాశమును గావించినాను. బలాభిమానులగు రాక్షసులు కొందరు యుద్ధము నకు రాగా కేవలము స్వాత్మ రక్షణమునకు మాత్రమే యుద్ధము జేసితిని.

**రక్షణార్థన్తు దేహస్య ప్రతి యుద్ధా మయారణే ॥ ఆ.రా. ౫౦-౧౫॥**

మహాతేజస్వియగు శ్రీరాముని దూతను, 'పవన పుత్రుడను' అని తెలిపినాడు. పవనపుత్రుడ' నను మాట వినగానే రావణుడాంజనేయుని నఖ శిఖ పర్యంతము ఆశ్చర్య విస్మితగాత్రుడై కాంచి "నీవు రత్నపురి రాజు వీర శౌర్యధని వానర శ్రేష్ఠుడగు పవనకుమారుని యశస్వి పుత్రుడవు మహావీర హను మంతుడవా? నీవు మా మిత్ర వర్గములోనివాడవే. పౌరుష పూర్ణమగు నీ సహ కారము వల్లనే గదా! నేను దేవ రాజగు కుబేరుని నిర్జించి యాతని పుష్పక విమా నమును గొని తెచ్చితిని. నాకు పౌత్ర తుల్యుడవు. నీ విచ్చటి కేల వచ్చితివి

---

అలవాటును వీలైనంత త్వరగా విడుపించుకోకపోతే అవసరముగా మారుతుంది.

తెలుపు'' మని ప్రశ్నించినాడు. ఆ మాటలు విని హనుమంతుడు ''దానవ రాజా! రాక్షసుల దుర్మార్గములు మితి మీరు చున్నవి. రాక్షస సభ్యత అన్యాయము, వామాచారముతో నిండిపోయినది. ఋషులు, మునులకు మీరు పెట్టుచున్న నానా హింసల రూపమున నున్న మీ పాపములకు ప్రతీకార మొనర్చుటకే నేను జన్మించినది. ప్రచ్ఛన్న భౌతిక వాదపు రాక్షస సభ్యతను నిర్మూలించి దాని స్థానే ఆధ్యాత్మిక భౌతికముల సమన్వితమగు వైదిక సంస్కృతీ ధ్వజము నెగుర వేయు టయే నా జీవన ధ్యేయము. అట్టి ధ్యేయ పూర్తికే నా జీవిత మర్పితమై యున్నది. అని యనగానే రావణుడు '' ఓహో! ఐతే నీ రాజద్రోహమును గూర్చి నే నిది వరకొకటి రెండు సార్లు వినిన విషయము వాస్తవమే నన్న మాట''. అని ఆశ్చ ర్యముగా నడిగిన పిమ్మట పావని యిట్లనినాడు.

'' ఔనౌను మహారాజా ! నేను రాష్ట్రోద్ధారక విషయమున ప్రయాస మొనర్చిన విషయమున మీరు వినినది సంపూర్ణముగా యథార్థమే. అనుకూల సమయమునకై నిరీక్షించు చుంటిని. దేవుని దయవల్ల ఆ సు సమయము ఇప్పుడు లభ్యమైనది. ఇక నిప్పుడు నా పథ్య తథ్య వచనములను వినుడు. రాక్షసేంద్రా! నేను సుగ్రీవ మహారాజు సందేశమును గొని నీ వద్దకు వచ్చినాను. నీకు అగ్ర జుని వంటివాడగు వానర మహారాజు సుగ్రీవుడు నీకు కుశల సమాచారమునంపి నాడు. నీ విప్పుడు మహాత్ముడగు నీయన్న సుగ్రీవుని ధర్మార్థ యుక్తమును, ఇహపర సుఖదాయక మునునగు సందేశమును వినుము.

అయోధ్యా నగరమున మహాసైన్య సమృద్ధి శాలి ఇంద్ర సమాన ప్రతా పుడు తన ప్రజలను తండ్రి వలె గాచుకొను మహారాజు దశరథుడు. అతని ప్రియాతి ప్రియుడు. జ్యేష్ఠ పుత్రుడు నగు శ్రీ రామచంద్రుడు పిత్రాజ్ఞచే దండ కారణ్యములకు వచ్చి యుండెను. అతనితో గూడ భ్రాతృభక్తి తత్పరుడగు చిన్న తమ్ముడు లక్ష్మణుడు, మహా పతివ్రతయగు పత్ని విదేహా రాజగు మహాత్మ జనక మహారాజు ప్రియ పుత్రిక సీతయును వచ్చి యుండిరి.

అరణ్యమున సీత గానరాకుండ పోయినందున ఆమెనన్వేషించుచు ఆయిరువురు రాజపుత్రులు ఋష్యమూక పర్వతముపై సుగ్రీవుని గలిసికొని నారు.

సుగ్రీవుడు సీతను వెదకుటకు ప్రతిజ్ఞ యొనర్చగా శ్రీరాముడతనికి రాజ్యము నిప్పింతునని మాట యిచ్చినాడు. శ్రీరాముడొకే యొక బాణముతో వాలిని సంహరించి సుగ్రీవునకు రాజ్య ప్రదాన మొనర్చినాడు. వాలి బలమును నీవు బాగుగా రుచి చూచియే యుంటివి గదా !'' అని తెలిపినాడు.

## ౨౬. హనుమంతుని యుపదేశము

హనుమంతుడు రావణునకు శ్రీరామ కథను వినిపించిన పిదప నిట్లుపదేశించినాడు. ''రాక్షసేంద్రా ! నీ వొకవేళ సీత యిచ్చట లేదని యందు వేమో! నే నామెను జూచినానని నీవు నిశ్చయముగ నెరుగుము. నీవు స్వయముగ, సగౌరవముగ సీతను శ్రీరామునకు సమర్పించక పోయినచో రాముడే సీతను దీసికొని పోగలడు. విషాక్త యన్నము వలనే సీత నీకు జీర్ణము గాదని నిశ్చయముగ నెంచుము. నీవు సీతను నీ యింటి యందుంచుకొని యైనను దాని పరిణామమును నీవెరుగ జాల కున్నావు. ఆమె నీ పాలిటి పంచ శిరస్సుల నాగేంద్రుడని నమ్ముము.

మహారాజా ! పూర్వ జన్మ సుకృతము వల్ల నీ విపుడు సకలైశ్వర్యవంతుడవును, దీర్ఘాయుష్మంతుడవు నై యున్నావు. పరస్త్రీ హరణ రూపమగు నధర్మమువల్ల ఆ యదృష్టమును నష్టమొనర్చుకొనుట యుచితము గాదు. ''పూర్వ జన్మ సంచిత పుణ్యము ఈ కించిన్మాత్రపు అధర్మము వల్ల నష్ట పడగలదా ?'' యని నీవు దలతువేని అది సరిగాదు. ఇది సాధారణమగు దుష్కర్మ గాదు. మహాఘోర పాప కార్యము. దీని ఫలమనుభవింపకుండ నుండలేవు.

**ప్రాప్తం ధర్మఫలంతావ ద్భవతానాత్ర సంశయః ।**
**ఫలమస్యాప్య ధర్మస్య క్షిప్రమేవ ప్రపత్స్యసే ॥ ఆ.రా. ౫౧-౨౧॥**

రాక్షసేంద్రా ! నీవు పూర్వ సుకృత సత్ఫలతముల ననుభవించుచున్న టులనే అతి శీఘ్రముగా ఈ దుష్కర్మల ఫలమును సైతము అనుభవించగలవు. కావున నో మహారాజా ! నా యీ పలుకులను శ్రద్ధగా వినుము.

**జనస్థాన వధం బుద్ధ్వా వాలినశ్చ వధస్తథా ।**
**రామ సుగ్రీవ సఖ్యంచ బుధ్యస్వ హితమాత్మనః ॥ ఆ.రా. ౫౧-30॥**



రావణునకు హనుమంతుని ఉపదేశము.

రామేణహి ప్రతిజ్ఞాతం హర్యృక్ష గణ సన్నిధౌ ।
ఉత్సాదనమమిత్రాణాం సీతా యైస్తు ప్రధర్షితా ॥ ౫౧-౩౨॥
ఉపకుర్వన్హిరామస్య సాక్షాదపి పురన్దరః ॥
న సుఖం ప్రాప్నుయాదన్యః కిం పునస్త్వ ద్విధోజనః ॥ ౫౧-౩౩ ॥
యాం సీతేత్యభిజానాసి యేయం తిష్ఠతితే గృహే ।
కాలరాత్రీతి తాం విద్ధి సర్వలంకా వినాశినీమ్ ॥ ౫౧-౩౪॥
తదలం కాలపాశేన సీతా విగ్రహ రూపిణా ।
స్వయం స్కన్ధావసక్తేన క్షేమమాత్మని చిన్త్యతామ్ ॥ ౫౧-౩౫॥
సీతాయాస్తేజసాదగ్ధాం రామ కోప ప్రదీపితామ్।
దహ్యమానామి మాం పశ్య పురీంసాట్ట ప్రతోళికామ్॥ ౫౧-౩౬॥
యోరామం ప్రతి యుధ్యేత విష్ణుస్తుల్య పరాక్రమమ్ ॥
సర్వలోకేశ్వర స్యేహ కృత్వా విప్రియ మీట్టశమ్ ॥
రామస్య రాజసింహస్య దుర్లభం తవజీవితమ్ ॥ ౫౧-౪౨॥

రాజా ! పాపకార్యములకు నీవు జంకవేని రాక్షసుల వధ, వాలి సంహారము, రామ సుగ్రీవుల మైత్రిని గాంచియైనను సర్వ హితమును గూర్చి యాలోచించుకొనుము. ఆర్య పుత్రుడగు శ్రీరాముడు వానరజాతి, మరియు భల్లూక జాతి నాయకుల యెదుట సీత నపహరించిన దుర్మార్గుని సమూలముగ నాశనమొనర్తు నని ప్రతిజ్ఞ నొనర్చి నాడు. రామునకు కీడు తలపెట్టిన ఇంద్రుడైనను సుఖముగా నుండ జాలడనిన నీబోటి సాధారణ పురుషుని లక్ష్యమెంత ? రావణా! నీవు సామాన్య 'సీత' యని యెంచు చున్న యామె నీ పాలిటి కాల రాత్రియై యున్నది. అది నీ వైభవముతో గూడిన లంకను సర్వ నాశనమొనర్చ గలదు. సీతారూపమగు కాలపాశమును మెడకు దగిలించుకొని సుఖముగనెట్లుండ గలవు? నీవు నీ క్షేమము నాలోచించుకొని మహా సౌధములతో, వైభవములతో ప్రదీప్తమైయున్న లంక సీత తేజస్సుతో, రాముని కోపానలముతో భస్మముగా నున్నదని తలచి సీతను ప్రసన్న పరచి అతి గౌరవముగ నామెను శ్రీరాముని

---

పాటాలు పాఠశాలలోనే ముగుస్తాయి కాని చదువుజీవితాంతము ఉంటుంది.

కల్పింపుము. నీ వామెను లంక యందుంచుకొని పుత్ర, పౌత్ర, మిత్ర, కళత్ర, సజాతి బంధువర్గము నీతి నిపుణులగు మంత్రివర్గము, హితగణము, భ్రాతృ సోదరగణములతోను, భోగైశ్వర్యములతోను కళకళ లాడుచున్న లంకను వ్యర్థముగ సర్వనాశనమొనర్చకుము. నాయీ హితవాక్యములను యథార్థములనియే విశ్వసింపుము. నీ వొక వేళ రాముని గెలుతునని తలచుచుంటివేని అది యసాధ్యము. మహా పరాక్రమ వంతుడు, విష్ణు సమానమగు బలశాలియగు శ్రీ రాముని యెదుట నీవు నిలుచుటయే కష్టము''.

సత్యము, నిర్భీతమునగు మహావీరుని పలుకులను విని రావణుడతి క్రుద్ధుడై యాతని జంపుట కాజ్ఞ నిచ్చినాడు. మహాత్ముడగు విభీషణుడది గాంచి రాక్షసేంద్రునితో నిట్లనినాడు. ''మహారాజా! ఈ వానరుని జంపుట వల్ల లాభము లేదు. వీని బంపిన వానిపై ఈ శిక్షను ప్రయోగించుము.

**సాధుర్వా యదివా ఽ సాధుః పరైరేష సమర్పితః।**
**బ్రువాన్పరార్థం పరవాన నదూతో వధమర్హతి ॥ వా.రా. ౫౨-౨౧॥**

ఈతడు సాధువుగాని, అసాధువుగాని యితరులు బంపగ వచ్చిన వాడు. ఈతని వాక్యములన్నియును పరాధీన వశమైనవే. కావున నీతడు వధార్హుడు గాడు. ఈ దూతను జంపినచో ఇకముందెవ్వరును దౌత్య కార్యమునకు ముందుకు రారు. ఈ కార్యము నీతి భంగమునకు హేతువై యుండుట వల్ల సర్వథా అయుక్తమైయున్నది''. అను విభీషణుని శాస్త్ర విహిత వాక్యములకు వశుడై రావణుడిట్లనినాడు, ''సోదరా! దూతలను వధించుట నిందాయోగ్యమగు కర్మయే. మరణ దండన గాక దూతకు యోగ్యమగు దండనను నీవే నిర్ణయించు'' మని యనినాడు.

## ౨౭. లాంగూల దహనము, లంకా దహనము

**కపీనాం కిల లాంగూల మిష్టం భవతి భూషణమ్ ॥**
**తదస్య దీప్యతాం శీఘ్రం తేన దగ్ధేన గచ్ఛతు ॥ వారా. సుం. ౫౩-3॥**

వానర జాతికి అతి ప్రియమైనది. పవిత్రమైనది. 'లాంగూల'మను

భూషణము, దాని నవమాన పరచినచో నీతడు స్వయముగ నవమానితుడగును. ఇతడు స్వదేశమునకేగిన పిదప నీతని బంధు మిత్రులు, మరియు స్వజాతీయు లెల్లరును లాంగూల భూషణములేని యీతని నవమానపరచెదరు ★. అని విభీషణుడు దెలుపగా రావణునాజ్ఞచే హనుమంతుని లాంగూలము నూడదీసి దానికి దూతలు నిప్పంటించినారు. సభ నుండి బయటకు దీసికొని పోయి ఈ విషయము నగర మందంతటను చాటింపు వేయించినారు. ఈ సంగతిని విని కొందరు ధర్మాత్ములును, సీతయును బాధపడినారు. వానర జాతి గౌరవ చిహ్నాము నగు లాంగూల భూషణమును దహించుట వల్ల హనుమంతుడు మిగుల యవమానితుడై లాంగూలమును రావణుడు నష్ట పరచినట్లే లంకానగర గర్భ స్థానము నుండి నగరమున కొక చక్కని విశేష భూషణముగ నెంచబడు చున్న అశోకవనమును నష్టపరచుటయే దీనికి ప్రతీకారముగునని యెంచి ఈ యవకాశమును జూచుకొని ఆంజనేయుడు లంకకు నిప్పంటించినాడు. అది కాలి భస్మమై పోవుచుండగ హనుమంతుని క్రోధావేశము కొంత శాంతింప సాగినది. హనుమంతునకప్పుడు సీత జ్ఞాపకము రాగా అతి భయభీతుడై ''అయ్యో ! నే నెంతపని జేసితిని ? మొకా ముందాలోచింపక నేను చేసిన కార్యము గర్హించ దగినదే'' అని యిట్లు వితర్కించినాడు.

**ధన్యాఃఖలు మహాత్మానో యే బుద్ధ్యా కోపము త్థితమ ।**
**నిరున్ధన్తి మహాత్మానో దీప్తమగ్ని మివాంభ సా ॥ ఆ.రా. ౫౫-౩॥**
**క్రుద్ధః పాపం నకః కుర్యా తత్క్రుద్ధో హన్యాద్గురూనపి ॥**
**క్రుద్ధః పురుషయావాచా నరః సాధూ నధిక్షిపేత ॥ ఆ.రా. ౫౫-౪॥**

---

★ లాంగూలమనునది వానర జాతికొక జాతీయ భూషణమై యుండెను. పరులచే నది హరింపబడుట, కించ పరచుట యనునది కేవలము వ్యక్తిగతమేగాకుండ జాత్యావమానముగ నెంచబడుచుండెడిది. ఈ కాలమునందార్యులు యజ్ఞోపవీతమును, సిక్కులు పగిడి మరియు కేశములను, ఆంగ్లేయులు టోపిని, ముస్లిములు కురానును, రాజపుత్రులు ఖడ్గమును గౌరవించినట్లే వానర జాతి లాంగూలమును అతి గౌరవముగా నెంచు చుండెడిది. ఈ యుద్దేశముతోనే రావణుడు హనుమంతున కిట్టి దండనము విధించినారు. లాంగూలమను భూషణము వల్ల హనుమంతునొక పశువుగనెంచినారు. 'లాంగూల' మునగ 'తోక' యను నర్థము గూడ నగును. 'లాంగూల' మను కేవలము తోకయో, లేక ఖడ్గ విశేషమో యగునో వాల్మీకి రామాయణ సుందరకాండ ౫3-3 వ శ్లోకమందు'' ఇష్టం భవతి భూషణమ

**వాచ్యావాచ్యంప్రకుపితో న విజానాతి కర్హిచిత్ ।**

**నాకార్యమస్తి క్రుద్ధస్య నావాచ్యం విద్యతే క్వచిత్ ॥ ఆ.రా. ౫౫-౫॥**

**యః సముత్పతితం క్రోధం క్షమయైవ నిరస్యతి ।**

**యథోరగస్త్వచం జీర్ణం స వైపురుష ఉచ్యతే ॥ .రా. ౫౫-౬॥**

**ధిగస్తు మాం సుదుర్బుద్ధిం నిర్లజ్జం పాపకృత్తమమ్ ॥**

**అచింత యిత్వాతాం సీతామగ్నిదం స్వామి ఘాతకమ్ ॥ ఆ.రా. ౫-౫౫-౭॥**

**యదిదగ్ధా త్వియం సర్వాం నూను మార్యా పి జానకి ।**

**దగ్ధాతేన మయా భర్తుర్హతం కార్యమజానతా ॥ ఆ.రా. ౫-౫౫-౮॥**

జలము నుండి యుత్పన్నమైన యగ్ని స్వయముగా శాంతించినట్లే తమ యందుత్పన్నమైన క్రోధాగ్నిని అదే బుద్ధితో నాపుకొను మహాత్ములు ధన్యులు. క్రోధము నాపుకొనలేనివారు క్రోధవశమున ఎన్నెన్ని పాపములనైనను జేయగలరు. క్రోధ వశీభూతుడై గురు జనమును సైతము జంపి వేయగలడు. చేయగూడని పనులను జేసి, ఆడరాని భాషణముల నాడగలడు. ''**ఉత్తమం క్షణకోపస్య**'' క్రోధముత్పన్నమైన తోడనే సర్పము కుబుసమును వదలివేయునట్లు వదలి వేయు వారే వాస్తవముగ ధన్యులు. నే జేసిన కార్యము ధిఃకారయోగ్యము. క్రోధ వశము నలంక నగ్నికాహుతి యొనర్చి నపుడు సీత యున్నదను జ్ఞాపకముంచుకొన లేనై తిని. ఒక వేళ నామెకేదైనా హాని గలిగినచో నే నింత శ్రమ పడిజేసిన ప్రయత్న మంతయును వ్యర్థమే యగును. మరియు నా జీవితాంతము స్వామి దృష్టిలో అజ్ఞాని, అన్యాయ కారిగానే యుండి పోవుదు'' నని హనుమంతుడు చింతించి నాడు.

---

అని యనుటు కన్న ''**ఖడ్గం భవతి హ్యుత్తమమ్**'' అని యుండును గదా ! ఒక జైన పండితుడు ''దశర థుని జాతకమున'' ''లాంగూలః'' అనునది కరకంకణ'' మని అది వీరత్వ చిహ్నమని తెలిపినాడు.

లంకా దహనమనునది ఒక అలంకారిక పదము గూడనగును. రాజనీతి విశారదుడగు హనుమంతుడు తన రాజనీతి కౌశలమున విభీషణుడు, మరి యాతని అనుయాయులు కొందరను తన పక్షమునకు త్రిప్పుకొని లంక యందు స్పర్థలు, విప్లవాగ్నిని రగుల జేసినాడు. కొందరి మతానుసా రము మహావీరుడగు హనుమంతుడు తన శౌర్య ప్రదర్శన ద్వార లంకా వాసుల హృదయములందు భయము, భీతి, దుఃఖము అనే యగ్నిని రగుల్కొల్పినాడు. ఇదియే లంకాదహనమని యందురు.

## ౨౮. హనుమంతుని తిరుగు ముఖము

హనుమంతుడు వెంటనే సీత యున్న స్థలమునకు వచ్చి ఆమె క్షేమముగ, సురక్షితముగ నుండుటను గాంచి సంతృప్తుడై తిరిగి వెళ్ళుట కనుజ్ఞను అడిగినాడు. అప్పుడు సీతాదేవి " ఓ యాంజనేయా ! నిన్ను జూచి నా దుఃఖము కొంత మరచిపోయితిని. ఇప్పుడు నీవు గూడ వెళ్లిపోవ నుంటివి. ఇక నేను శ్రీరాముని కథను వినకుండ నెట్లుండగలను ? అని దుఃఖ స్వరముతో ననినది. అందులకు హనుమంతుడు.

**యద్యవందేవి మేస్కంధ మారోహ క్షణమాత్రతః ।**
**రామేణయోజయష్యామి మన్యసేయది జానకి ॥**

మాతా ! మీ మనస్సింత చింతాకులమై యున్నది. మీ కభ్యంతరము లేనిచో నా భుజస్కంధముపై నధిరోహింపుము. ఒక్క క్షణమున శ్రీరాముని సన్నిధిని జేర్చగల" నని యనినాడు.

వాల్మీకి రామాయణమునందింత కన్న విస్తృత వర్ణన గలదు. హనుమంతుని యీ ప్రస్తావనను విని జనక నందిని "పావనీ ! స్వేచ్ఛగా ఇతర పురుషుల నేనెట్లు స్పృశింతును ? వానర సైన్య సమేతముగా శ్రీరాముడిచ్చటికి వచ్చి రావణుని యుద్ధమున సంహరించి నన్ను దీసికొని పోవుటయందే యాతని కీర్తి గలదు. కావున నీవు వెళ్ళి సకల వానర బలముతో శ్రీరాముని సత్వరమే గొని తెమ్ము. నే నెట్లో కొన్ని దినములు గడుపుకొనెద" ననినది. తరువాత తన "చూడామణి"ని ఆంజనేయునకందించి రాముని కీయమని తెలిపినది. దాని నందుకొని హనుమంతుడెంతయో సంతసించి సెలవుగొని మరలినాడు. ఈ విధముగ లంక యందు కృతకృత్యుడైన హనమంతుడు వచ్చిన మార్గముననే సముద్రము నందీదుచు సాగర మధ్యమున గలన సునాభ (మైనాక) పర్వతమున నాగి అన్నపానాదులను దీసికొని సేద దీరి ముందునకు సాగిపోయినాడు.

**స జగామ మహాతేజాః పునర్మధ్యేన సాగరమ్ ।**
**పర్వతేంద్రం సునాభంచ సముపస్పృశ్య వీర్యవాన్ ॥ వా. రా. సుం. ౬౭-౧౩॥**

మైనాక నుండి బయలుదేరిన హనుమంతుడు సముద్రపు టావలి తీరమును జేరి హర్షధ్వని నొనర్చినాడు. ఆ ధ్వనిని విని అంగద జాంబవంతాది కపి వీరులు "అదిగో హనుమంతుడు కృతకార్యుడై వచ్చు చున్నాడు. కార్య సాఫల్యముగాకున్న ఆతడిట్టి హర్షధ్వని యొనర్చడు గదా !" యని తలచినారు.

సముద్ర తీరమున జేరిన హనుమంతుడు తన వానర బలగము తన్రై నిరీక్షించుచు గూర్చున్న మహేంద్ర గిరిని జేరిన వెంటనే యచ్చటి వానర వీరు లెల్లరును పెద్ద హర్షనాదములతో నాతనికి జయము పలికినారు. పరస్పరాదర సమ్మానములు, కుశల వార్తలు నడిగికొని పిదప వానర ముఖ్యులు సీత వృత్తాంతము నడిగినారు. హనుమంతు డత్యాదర శబ్దములతో " ఔను, నేను సీతా మాతను జూచి వచ్చినాను. ఆమె అశోక వనమున ఘోర రాక్షస స్త్రీల మధ్యన నుండి శ్రీరామ వియోగము వలన ఎప్పుడో యొక పూట కొంత యాహారమును దీసికొని భూమిపై శయనించు చుండు" నని తెలిపినాడు.

సీత సమాచారమును వినగానే ఎల్లరును అత్యంతానందమును బ్రకటించుచు హనుమంతుని గీర్తించినారు. ఆ సమావేశమున యువరాజు అంగదుడు "కపి వర్యా ! వీర్యమున, సత్వమున నీకు దీటైనవాడు లేడు. సముద్రమును దాటిపోయి, కార్య సాఫల్యమును జేసికొని వచ్చినావు. నిజముగా నీవు మాకెల్లరకును జీవన దాతవు. నీ దయవల్ల మే మెల్లరమును సిద్దార్థులమై శ్రీరాముని దర్శనము జేసికొన యోగ్యులమైనాము. నీ ధైర్య సాహసములకు, రామ భక్తికి మా జోహారులు. యశస్వినియగు శ్రీరామపత్ని దర్శనము జేసికొని వచ్చినావు. ఇక నిప్పుడు శ్రీరామచంద్రుడు సీతా వియోగ దుఃఖమును త్యజించగలడు. ఆంజనేయా !మే మిప్పుడు నీ సముద్ర లంఘనము, సీతదర్శనము, రావణుని వృత్తాంతమును వినదలచినాము. వినిపించవలసినదిగా కోరుచున్నాము.

జాంబవంతుడును ఈ ప్రతిపాదనను బలపరచినాడు. అంగద జాంబవంతాదుల యాజ్ఞతో యాత్రా వృత్తాంతమును చెలుపుచు సముద్రమున నీది

**కొన్ని చూడదగినవి మరికొన్ని వినదగినవి కొన్ని జీర్ణం చేసుకో గల్గినవి వుంటాయి.**

దాటుట, మహాత్ముడగు మైనాకుని ఆతిథ్యమును గొనుట, లంకనుజేరుట, లంకిణి యను రాక్షసిని పరాజయ మొనర్చుట, లంకయందు సీతనన్వేషించుట, అతికష్టము పై సీతాదేవిని గాంచుట, రావణుని క్రూరత్వము, రాక్షసుల దుర్వ్యవహారము, సీత యొక్క దృఢమైన రామభక్తి, విభీషణుని పుత్రికలగు 'కళ' మరియు 'త్రిజట'ల సద్వ్యవహారము, సీతకు తన రామ దౌత్యమును ప్రకటించుట, శ్రీరాముని అంగుళీయమును సీతకు సమర్పించుట, సీత నుండి శ్రీరాముని కొరకు 'చూడామణి' ని గొనుట, అశోకవన విధ్వంసము, రాక్షసులచే బంధింపబడి రావణుని సమక్షమున జేరుట, రావణుడు తనకు మరణ దండనమును విధించుట, విభీషణుని ద్వారా మరణ దండనము నిషేధింపబడుట, దాని స్థానే 'లాంగూల దహన' శిక్ష లంకా దహనము, పునః సీతాదర్శనము, తిరిగి సముద్రము నీది వచ్చుట మున్నగు విషయములను సవిస్తారముగా దెలిపి సీత యొక్క అపూర్వ శీల సంపత్తిని వినిపించి రావణుని జయించుటకు తగిన సన్నాహముల నొనర్చుటకై అచ్చటి వారెల్లరును ప్రభావ పూరిత వాక్యములతో ప్రేరితుల నొనర్చినాడు.

సమస్త వానరులను గలిసికొని హనుమంతుడు కిష్కింధకు చేరినాడు. సుగ్రీవుని మధు వనమున ప్రవేశించి అంగదుని యాజ్ఞచే వారెల్లరును ఫలహారము నొనర్చి నారు. వనరక్షకులు వచ్చి సుగ్రీవ మహారాజున కీ విషయము నివేదించినారు. సుగ్రీవుడీ విషయమును విని ''హనుమంతుడవశ్యముగ సీతాభగవతి దర్శనమును జేసికొని వచ్చినాడు. వానర శ్రేష్ఠుడగు హనుమంతునిలో కార్య సాధనాశక్తి, బుద్ధి, ఉద్యోగ నిర్వహణ పరాక్రమము, శాస్త్రీయ జ్ఞానము మున్నగు గుణములు గలవు. ఇంతేగాక పావని గొప్ప ప్రతిభాశాలి, ప్రభావంతుడు, సత్య సంధుడనియు తెలిపినాడు.

సుగ్రీవుడు వానరులెల్లరతో గూడ హమంతుని బిలిచికొని నాడు. ఆతడు కుశలుడుగా నుండుట గాంచి, సంతసించి, తరువాత యందరును గలిసి శ్రీరాముని సన్నిధికేగినారు. హనుమంతుడు శ్రీరాముని చరణములపై వాలి నమస్కరించగా శ్రీరాముడాతని లేవనెత్తి గాఢ పరిష్వంగమొనర్చికొనినాడు.

తరువాత హనుమంతుడు సీతను గూర్చి యిట్లు దెలిపినాడు.

శ్రీరామ ప్రభూ ! సీతాదేవి కఠిన పతివ్రత. నియమములను బాలించుచు శారీరికముగ కుశలముగా నున్నది. నేనా తల్లి దర్శనము జేసికొంటినని'', నని తెలిపినాడు. అమృత సోనల వంటి హనుమంతుని వాక్యములను వినగానే రామలక్ష్మణులు అమితా నందము నొందినారు. వారి కుతూహలమును గాంచి హనుమంతుడు తాను బయలు దేరినది మొదలు ఇప్పటివరకు జరిగిన యావద్వృత్తాంతమును సవిస్తరముగ దెలిపినాడు. ప్రసన్న వదనముతో హనుమంతుడు ''మహారాజా ! అతి విశాలమగు సముద్రమును దాటి సీతామహాదేవిని వెదకుచూ సముద్రమునకు దక్షిణ తీరమందున్న లంకా మహానగరమును జేరినాను. అచ్చటి రాజు రావణుడు. నే నచ్చట సీతామాత దర్శనము జేసికొనినాను. మాటి మాటికి రాక్షసాంగనల బెదిరింపులను సహించుచు సీతాదేవి తన మనోరథములన్నియును తమ పైననే పెట్టుకొనినది. తమ వియోగము వల్ల ఆమె దశ అతి దీనముగ నున్నది. శరీరము కృశించి మలిన వస్త్రముల దాల్చి కేశ సంస్కారమును వీడి రావణుని దుర్వ్యవహారముల చే దుఃఖితురాలై ప్రాణ త్యాగమున కుద్యుక్తురాలై యున్నది.

నా విషయమున సీతాదేవికి విశ్వాసము గలిగించుట కెంతయో శ్రమ పడవలసి వచ్చినది. మీ సుగ్రీవుని మైత్రి మొదలగు విషయములను తమ యంగుళీయమును సమర్పించిన పిదప సంతృప్తి పడి తన వియోగముచే మీకు గలిగిన దుఃఖమును గూర్చి సంతాప పడినది. తాము సముద్రమును దాటి వచ్చు విషయమును గూర్చి యడిగినది. వానికన్నిటికి సంతృప్తికర వాక్యముల బలికి సాంత్వన మొనర్చి వారికి శాంతిని, ధైర్యమును గలిగించి వచ్చినాను. తిరిగి వచ్చు సమయమున సీతాదేవి తమ కిమ్మని యీ చూడామణిని ప్రసాదించినది. ఇక నామె జీవించి యుండుటకు కేవల మొకే మాసము గడువు గలదనియు దెలిపినాడు. చూడామణిని గాంచి శ్రీరామ లక్ష్మణులెంతో ఆనందానుభూతి నొందినారు. ''సీతాదేవి ఇక కేవలమొకే మాసము జీవించి యుండగలదని దెలిసిన పిదప ఆమె యునికి, అచ్చటికి జేరు మార్గ పరిచయము గలిగిన తరువాత ఇక నొక క్షణమైన నిచ్చట

జాగు చేయరాదు. మమ్మాప్తలమునకు సత్వరమే జేర్చుము. సీతాదేవి నాకు దెలుపుమనిన విషయములన్నియును దెలుపు'' మని శ్రీరాముడడిగినాడు.

అందుకు హనుమంతుడు ''శ్రీరామచంద్రా ! నేను తిరిగి వచ్చునపుడు సీతామాత తన దుఃఖగాథను వినిపించుచు తనను విముక్తి నొనర్చుటకు శ్రీరామ భూపాలుడు ఇంతటి విశాలసాగరమును దాటి ససైన్యముగ నిచ్చటికెట్లు జేరగలడో? ఈ భయంకర రాక్షసుల చెరనుండి నాకు విముక్తి ఎట్లు గలుగగలదో? యని ఆవేదనపడినది. అందుకు నేను ''జననీ ! తమ యాజ్ఞయైన నిను ఇదేక్షణమున విముక్తి నొందించగల'' నని తెలుపగా ఆమె ఎంతయో ధైర్యాభిమానముతో ''మహావీరా ! వాస్తవమే నీవు నన్ను కుశలముగా గొనిపోగలవు కాని యిందువల్ల ఆర్య పుత్రుడు శ్రీరామచంద్రుని ప్రతిష్ఠకు హాని గలుగ గలదు. వారు తన దళ బలములతో నిచ్చటికి జేరి రావణాదులను సంహరించి నన్ను గొనిపోవుటలోనే కీర్తి గలదు. రెండవ విషయమేమన నేను పతివ్రత స్త్రీని. నాస్వామిని గాక అన్య పురుషుల శరీరమును స్వప్నమందైనను స్పృశింప జాల'' నని యనినది.

అట్లైన మంచిది తల్లీ ! శ్రీరాముడు సైన్య సమేతుడై అతి శీఘ్రముగ నిచ్చటికి వచ్చి రాక్షస నిర్మూలన మొనర్చి సమ్మాన పూర్వకముగా నిన్ను గొని పోగలడు. అనతికాలముననే అయోధ్యకు జేరి మీతో బాటు రాజ్యాభిషిక్తుడు కాగల''డని దెలిపితి'' నని విన్నవించినాడు.

## ౨౯. శ్రీరాముని కృతజ్ఞతా భావము

సీతాదేవి వృత్తాంతమును విని శ్రీరాముడు పావనీ ! మహావీరుల తలపులలోనికి గూడ రాజాలనంతటి మహా ఘనకార్యమును సాధించినావు. నీవు గాక అన్యులెవ్వరును ఇంతటి విశాల సాగరమునీదుట యసంభవము. రాక్షసులచే సురక్షితమై యున్న లంకయందు బ్రవేశించి కార్య సిద్ధి నొంది కుశలముగా దిరిగి వచ్చుట నీకే తగియున్నది.

**యోహిభృత్యోనియుక్తః సన్భర్త్రా కర్మణి దుష్కరే ।**
**కుర్యాత్తదనురాగేణ తమాహుః పురుషోత్తమమ్** ॥ వా.రా. యుద్ధ ౧-౭॥

మహావీరా! సుగ్రీవుని యాజ్ఞనొంది నీవొక ఆదర్శ సేవకుని వగిది ఈ ఘనకార్యము సాధించి స్వయముగ నీవు పురుషోత్తముడ★వైతివి. ఇంతటి మహా సంకటములకు నిలయమైన లంక యందు ప్రవేశించి నీవు కార్య సాధకుడవగుటయే గాక సుగ్రీవుని ప్రతినను గూడా నెరవేర్చినావు. మహాత్మా! నీ యీ ఘన కార్యమునకు నేను, మా రఘు వంశము మరియు లక్ష్మణుడు కృతజ్ఞులమై యున్నాము.

**హనుమన్తే కృతం కార్యం దేవైరపి సుదుష్కరమ్ ॥**
**ఉపకారం న పశ్యామి తవ ప్రత్యుపకారణః ॥**
**ఇదానీం తే ప్రయచ్ఛామి సర్వస్వం మమ మారుతే ।**
**ఇత్యాలింగయ సమాకృష్య గాఢం వానర పుఙ్గవమ్ ।**
**సార్ద్రనేత్రో రఘు శ్రేష్ఠః పరాం ప్రీతి మవాపసః ॥**

" ఓ హనుమన్తా ! నీవు సాధించిన యీ మహాకార్యము దేవతలకు గూడ సాధ్యము గానిది. ఈ యుపకారమునకు నేనేమి ప్రత్యుపకారము జేయ వలయునో తెలియకున్నది. నా సర్వస్వమును నీ కర్పించినను సరిపోదు. అని పలికి రఘు శ్రేష్ఠుడగు శ్రీరాముడు హనమంతుని గాడ పరిష్వంగన మొనర్చి కొనినాడు. ఆతని నేత్రములు ప్రేమాశ్రువులతో నిండి, ఆతడు ప్రేమాంబుధిలో మునిగి పోయినాడు. హనుమంతుడప్పుడు తన జననీ జనకులగు అంజనా పవనుల ఘోర తపస్సు మరియు గురు దేవుల మహా సాధనముల ఫలములను సంస్మరించుకొని శ్రద్ధా భావమున జలదరించి పోయినాడు. ★★

---

★ యుద్ధమున విజయము లభించిన పిదప ఓడిన శత్రు సైన్యముపై విరుచుకుపడి తరుముట, బంధించుట యనునది కఠిన కార్యమేమిగాదు. కాని యుద్ధము తిరుగబడి శత్రు సైన్యముపై విజయము నొందుటకు మారుగ తమ సైన్యమే ఓడిపోయి శత్రు వ్యూహమున జిక్కుపడిపోవు సమయమున తన సైన్యము శత్రువులకు బందీగా జిక్కకుండ గాపాడుకొనుటయందే సేనానాయకుని యుద్ధ కుశలత్వము నందు గల సామర్థ్యము. ఇట్టి కౌశల్యము హనుమంతునియందు సంపూర్ణముగ నుండెను. ఈ విషయము మనము పూర్వోక్త శ్లోకములందు జదివి యున్నాము.

★★ పురుష శ్రేష్ఠుడగు రఘువీరుడు హనుమంతుని బలశౌర్య పరాక్రమములను, కార్య కౌశల్యమును, మరియు పవిత్ర ప్రేమ యొక్క వర్ణనమును మనమిదే ప్రకరణము నందు అన్ని రామాయణములలోను గాంచగలము.

# ౩౦. శ్రీరాముని సంశయము

మహావీరుని ద్వార సీత జీవించియున్న విషయము, లంకా నగర విశేషములు, ఇంకా అనేక ఇతర విషయములు తెలిసిన తరువాత ''లంక నెట్లు నిర్జించ వలె'' నను సమస్య శ్రీరాముని కొన్ని క్షణములు చింతా తురునిగ చేసి వేసినది. ఆతడొక నిశ్చితమైన ప్రణాళికను సిద్ధ పరచుటకై మహావీరుడగు హనుమంతుని, సుగ్రీవుని, జాంబవంతుని, అంగదుని, నలుడు, నీలుడు మున్నగు ప్రముఖ వీరులను పిలచుకొని లక్ష్మణుని సహితముగా వారితో నాలోచనలు సలిపినాడు. సీతాన్వేషణమున సకల వానర శ్రేష్ఠులకు, ప్రత్యేకించి హనుమంతునికి మళ్ళీ యొకసారి ధన్య వాదము లర్పించి ''వీరులారా! సామాన్య శత్రువును సైతము అల్పునిగా భావించరాదు. ఇక మన శత్రువో సామాన్యుడు గాదు. మన మధ్య అతి గంభీరమైన సముద్రమున్నది. మీ బల సహాయములకు నేను పూర్ణ కృతజ్ఞుడను. మీరొక వేళ ఉచితమనియు, ఆవశ్యకమనియు దలచితిరేని ప్రియ సోదరుడు భరతునికి సూచించినచో ఆర్య రాష్ట్రమగు అయోధ్య నుండి సంపూర్ణ సైన్య బలము మనకు ప్రాప్తి గాగలదు. ఐనను స్వయముగా నేను అయోధ్య నుండి సైన్య సహాయమును బొందుట యందుచితమని భావించుట లేదు. నా యీ సంశయమును దొలగించు'' డని కోరినాడు.

శ్రీరాముని యీ శబ్దములతో మహావీరుని నిద్రించుచున్న స్వాభిమానము మేల్కొని బుసకొట్టినది. తన క్రాంతి సేన (వానర యువక దళము) సదృష్టియందుంచుకొని ఆతడతి నిశ్చయమున వినమ్ర వాక్యములలో నిట్లనినాడు.

''మహారాజా! మీరిట్లు చింతించు నవసరము ఇసుమంతయు లేదు. సుగ్రీవ మహారాజు సైన్యముతో బాటు వానర రాష్ట్రమందలి యువశక్తి యంతయును శత్రువును సర్వనాశనమొనర్పగలదు. ఈ శక్తి యొక్క విరాట్ (అతివిశాల) స్వరూపమును నేటికి మూడవ నాటి నుండియే మీరు గాంచ గలరు. మీకే మాత్రమును సంశయము తగదు. శత్రు దర్పము నణచుటకు మేము సకల విధ

ముల సమర్థులమే. అత్యంత శీఘ్రముగనే లంక పై విజయము సాధించి మన మధ్య సీతామాత యుండుటను జూడ గలము. మనకు ఈశ్వర సహాయము సంపూర్ణముగ నుండును. అయోధ్య నుండి సైన్య సహాయమును బొందు నవసరము మన కావంతయును లే" దని యాంజనేయుడు శ్రీరాముని సంశయ నివారణ మొనర్చి ఈ విదముగ ప్రోత్సహించినాడు.

**సంతాపస్య చ తే స్థానం నహిపశ్యామి రాఘవ ।**
**ప్రవృత్తా వుపలబ్దాయాం జ్ఞాతే చ నిలయేరిపో ॥ వా.రా. యుద్ధ ౨-3॥**
**మతిమాన్శాస్త్రవిత్ప్రాజ్ఞః పణ్డితశ్చాసి రాఘవ ।**
**త్యజేమాం ప్రాకృతాంబుద్ధిం కృతాత్మే వార్థదూషిణీమ్ ॥ వా. రా.యు. ౨-౪॥**
**సముద్రం లంఘయిత్వాతు మహానక్రసమాకులమ్।**
**లంకా మారోహయిష్యామో నిష్యామశ్చతేరిపుమ్ ॥ వా.రా.యు. ౨-౫॥**
**నిరుత్సాహస్య దీనస్య శోక పర్యాకులాత్మనః ।**
**సర్వార్థా వ్యవసీదన్తి వ్యసనం చాధిగచ్ఛతి ॥ వా.రా.యు. ౨-౬॥**

ఓ రామచంద్రా ! సాధారణ పురుషుల వలె మీరేల చింతించుచున్నారు? శత్రువు, వాని నగరము, అందు ప్రవేశించు మార్గము మనకు దెలిసిన తరువాత ఇక సంతాపమునకు స్థానమేది ? విచార శీలురు బుద్ధిమంతులు, సకల శాస్త్ర పారంగతులు, మహా పండితులగు మీరిపుడు యీ ప్రాకృత సంశయ బుద్ధిని వదలుడు. మే మెల్లరమును సముద్రమును దాటి శత్రువగు రావణుని వాని రాక్షస మూకను నిశ్శేషముగ సంహరింతుమని నమ్ముడు. మీరు నిరుత్సాహ పడిన సమస్తమును వ్యర్థమై పోవును. మరియు ననేక విపత్తులు ఆక్రమించగలవు.

పాప కర్ముడగు రావణుని హతమార్చి సీతామాతను లంకనుండి గొని తెచ్చు యత్నమొనర్చవలెను. " ఓ రాఘవా ! మనము సముద్రమునకు వారధి నెట్లు నిర్మింప వలయునో, లంక నెట్లు ప్రవేశింపవలయునో, యాలోచించవలయును. సర్వ విధములగు దుఃఖములను విసర్జించుడు. ఏలన, మా వీర వానర సైన్యము సముద్రమును ఈదుచు నైనను దాటి రాక్షసుల నాశమొనర్చగలదు. మనము సీతాదేవి దర్శన మనతికాలమున నే జేసికొనగలము. నే నింత కన్న

నధికమేమి తెలుపుదును? లక్షణములన్నియు మన కనుకూలముగనే యున్నవి. నిశ్చయముగ మనకు విజయము సిద్ధించగలదు. తాము ధైర్యమును చిక్కబట్టు కొని ఉత్సాహముగ నుండుడు'' అని ఆంజనేయుడు దెలుపగనే సుగ్రీవుడు ''ఓ రామచంద్రా'' అగస్త్య మహర్షి ప్రేరితుడగు హనుమంతుడొక్కడే కృషి జేసి వానర రాష్ట్రము నొక మహాశక్తి రూపమున నిలిపినాడు. అసుర రాష్ట్రము. తోఢీకొను టకు వానర రాష్ట్రము సర్వ శక్తి మంతముగ నున్నది. ఇక తాము నిశ్చింతగ నుండు'' డని సవినయముగ బలికినాడు.

## ౩౧. హనుమంతుని విరాడ్రూపము

ఆనాటి నుండియే యువక వానర దళ వీర సైనికులెల్లరును సుగ్రీవుని సైనిక శిబిరములందు జేర సాగినారు. నలు దిశలందును మహావీర హనుమంతుని జయ జయ నాదములు వినరాసాగినవి. సరిగా మూడవ దినముననే ఏకత్రితమై యున్న సమస్త వానర సైన్య సమక్షమున మహాత్ముడగు శ్రీరాముని వంశ పరిచ యము, మహర్షి విశ్వామిత్ర యజ్ఞ సంరక్షణ సందర్భమున తాటక సుబాహుల వధ, సీతా స్వయంవరమున అపూర్వ కౌశలము, పితృ వాక్పరిపాలనార్థము అరణ్య ప్రవేశము, ఋషిమునుల కష్ట నివారణార్థము శ్రీరాముని ప్రతిన ఖర దూష ణాదులగు పదునాల్గువేల రాక్షస వీరుల సంహరణము, సీతాహరణము, సీతా న్వేషణము మున్నగు విషయములను మార్మికముగ, రోమాంచకార శైలిలో దెలు పుచు వానర సైనికులను క్రాంతి దూత వజ్రాంగ బలి ఇట్లుద్రిక్తుల నొనర్చి నాడు. ''మహావీరులారా! ఈ సంపూర్ణ చరితమును వినిన తరువాత స్వతః శ్రీరామలక్ష్మణులే సకల రాక్షస సంహారమునకు సమర్థులని మీకు దెలసినది. వారి జననము, జీవనము అసుర సంహారార్థమనియే యెంచుడు. ఇంతేగాక వీరి సంకేత మాత్రమున, శ్రీ భరతుని నేతృత్వమున ఆర్య రాష్ట్ర సంపూర్ణ సైన్య బలమిచ్చటికి చేరగలదు. కాని మన మాతృ భూమియగు వానర రాష్ట్రముననే సీతామాత హరింప బడినది. ఇంతటి ఘోర సంఘటనమున మనము భీరువు లమై, పౌరుష హీనులమై యుండుట ఉచితమా ? రాబోవు తరము వారు వానర జాతికి ధిఃకారమును దెలుపుచుండుటను మీరు సహించగలరా ? అని యనగా

నే నల్దిశలనుండి ''లేదు లేదు'' అను ఉద్రేక పూర్ణమగు ధ్వనులు మార్మోగినవి.

ఐనచో ''సోదరులారా ! యుద్ధ సన్నద్ధులు గండు. అస్త్ర శస్త్రములను ధరించుడు. పాపాత్ములగు లంకా రాక్షసులపై బడుడు. దుర్మార్గుడగు రావణుని స్వర్ణలంకను గూల్చి సముద్రమున గలిపివేయుడు. లంకా ద్వీపముపై పవిత్రవైదిక సంస్కృతీ ధ్వజము నెగురవేయుడు. వీర వరులారా ! సీతామాత సంపూర్ణ మాతృ శక్తికి ప్రతినిధి రూపమని జ్ఞాపక ముంచుకొనుడు. ఇంత వరకు వేలాది పతివ్రతామ తల్లుల సతీత్వము హరింపబడినది. వారి ఛీత్కారములు, హాహా కారములచే వేల కొలది ఋషిమునుల రక్తపాతములచే పాపాత్ముడగు రావణుని యహంకారము తృప్తి నొందుచు వచ్చినది. వారెల్లరి ఆత్మాంశముల కలయికయే సీతారూపమున పాపియగు రావణుని పాలిటి కాల పాశమై యవతరించినదని విశ్వసించుడు.

''వీరాగ్రేసరులారా ! మనము నిరీక్షించుచున్న సమయము పొంగులు వారుచున్న మీ యవ్వనమును రాష్ట్ర వేదికపై బలినొనర్చుటకు మీ రొనర్చిన ప్రతిజ్ఞలను నెరవేర్చుకొను అవకాశమిప్పుడు మీ యెదుటకు వచ్చినది. సోదరులారా ! మన దళము యొక్క ఆవిర్భావము అసుర వినాశనమునకే యనియు, ఆసురీ సభ్యతపై వైదిక సంస్కృతీ పావన పతాకము నెగురవేయుటకే యని మీరు విస్మరించలేదని యనుకొందును. రాష్ట్రోద్ధారము మాతృదేశ, ఆర్య సంస్కృతీ సంరక్షణ కార్యము మన స్వంత కార్యమై యున్నది. ఇది పరమేశ్వర కృప, మరియు పవిత్రాత్ములగు ఋషిమునుల తపః ఫల పరిణామమై యున్నది. ఏలన, ప్రథమమున సుగ్రీవ మహారాజు తరువాత ఆర్య కుల భూషణుడు మర్యాదా పురుషోత్తముడగు శ్రీరాముని సబల సఫల నేతృత్వము మనకు లభించినది. ఇది యొక ఈశ్వర ప్రదత్తమగు ''సుయోగ'' మని విశ్వసించి మనము కర్తవ్య పథమున పయనింతములెండు'' అని యుద్బోధించినాడు.

అదే సమయమున నచ్చటికి పద్మరాగ నాయకత్వమున మహిళా దళము, ప్రేరణాత్మక గీతము నాలపించుచు వచ్చినది. ఆ క్రాంతి దళము ఆహ్వాన గీతము తరువాత ప్రతిజ్ఞా గీతము నాలపించినది. మహావీరుని సంకేతమును వినిన

తోడనే సంక్రాంతి దళ సైనిక వీరులు భుజములను పైకెత్తుచు మళ్లీ వీర గీత మును పాడినారు. ''రాజా రామచంద్రునకు జయము, సుగ్రీవ మహారాజునకుజై, యువక నేత వజ్రాంగ హనుమానునకు జై, వైదిక సంస్కృతి అమరమైనది. ప్రపంచ శ్రేష్ఠ పురుషులు ఏకమవ్వాలి, సంక్రాంతి చిరంజీవి యగుగాక'' అని నినాదము లొనర్చినారు.

పద్మరాగముందుకు వచ్చి సోదరుడగు హనుమంతునుని అభిషేకించి నది. చూచుచుండగనే వీరవరు లెల్లరును పంక్తి బద్ధులైనారు. అప్పటికి జేరిన సోదరీమణులెల్లరును వీరు లెల్లర లను అభిషేకించినారు. ప్రాణము లొడ్డియై నను సీతాదేవిని బంధవిముక్త నొనర్చుటకు ప్రతిన మొనర్చినారు. ఆ యపూర్వ దృశ్యమును గాంచి శ్రీరాముని హృదయము పొంగిపోయినది. అంజనా కు మారుని యీ విరాట్రూపమును గాంచి ఆనందము పొంగిపోయి శ్రీరాముడు లేచి ఆంజనేయుని గాఢముగా కౌగలించుకొని నాడు. ఆతని ధర్మ సోదరియగు పద్మరాగను, ఆమె వీరాంగనా దళమును, సమస్త వానర వీరుల పరిచయమును వడసి వారి యుత్సాహము మరియు కృతనిశ్చయమునకు తన హార్దిక కృతజ్ఞత లను ప్రకటించినాడు.

## ౩౨. హనుమంతుని నీతి

శ్రీరాముడు సంపూర్ణ నిశ్చిత చిత్తుడై లంకపై దండెత్తుటకు బయలు దేర వలసినదిగా సుగ్రీవున కనుమతి నిచ్చినాడు. సర్వ సైన్య దళములు జయ ఘోషణములతో ఆకాశమును ప్రతిధ్వనింపజేయుచు సముద్ర తీరమునకు జేరి నవి. రామ లక్ష్మణులు సుగ్రీవాంజనేయాది ప్రముఖులతో సముద్ర తరణోపా యమును గూర్చి ఆలోచించు చుండునంతలో రావణుని సోదరుడగు విభీష ణుడు శ్రీరామ శరణమునకు వచ్చినట్లు సందేశమందినది. ఈ విషయమును సుగ్రీవుడు కొందరు వానరప్రముఖులతో నాలోచించి విభీషణుని విషయము నందనేక సందేహములను ప్రకటించుచు 'శత్రుసోదరు' డగు విభీషణుని నమ్మరా'

చను తీర్మానమును ప్రవేశ పెట్టినాడు. శ్రీరాముని యాజ్ఞతో నీతిధురీణుడు, సంస్కార సంపన్నుడగు హనుమంతుడు (సీతాన్వేషణ కాలముననే లంక యందు పరస్పర స్పర్థలు, మరియు విప్లవాగ్నిని రగుల్కొలిపి వచ్చి యుండెను) ఇట్లని నాడు. ''రాఘవేంద్రా! తమ సమక్షమున నాయభిప్రాయమును ప్రవేశ పెట్టగల యోగ్యత నాకు లేకున్నను తమ యాజ్ఞతో మంత్రివర్గము ప్రకటించిన ఈ విష యమున కొంతమనవి చేయుదును. అదేమన శత్రు దళము నుండి వచ్చిన పురు షునికి వ్యతిరేకముగ ఏకమొత్తముగ మనము దోషమును ఆరోపించుట సరి గాదు. ఈతని విషయమున ఉత్తమాభిప్రాయము లెన్నియో గలవు. విభీషణుడు శ్రీరామ శరణమునకు వచ్చుటకు దేశ కాల పరిస్థితి కనుకూలముగ లేదను నది ఒక ముఖ్య శంక. కాని దుఃఖితుడగు పురుషునికి దేశకాలపరిస్థితి నాలో చించు నవసరము లేదు గదా!

**దౌరాత్మ్యం రావణో దృష్ట్వా విక్రమంచ తథాత్వయి।**
**యుక్తమాగమనం హ్యత్ర సదృశం తస్య బుద్ధితః ॥ ౧౭-౫౮॥**
**అజ్ఞాతరూపైః పురుషైః సరాజన్ పృచ్ఛ్యతామితి ॥ ౧౭-౫౯॥**
**అశక్యం సహసారాజన్ భావో బోద్ధుం పరస్యవై ।**
**అంతరేణ స్వరైభిన్నై ర్నైపుణ్యం పశ్యతాం భృశమ్ ॥ ౧౭-౬౧॥**
**నత్వస్య బ్రువతోజాతు లక్ష్యతే దుష్ట భావతా ।**
**ప్రసన్నం వదనం చాపి తస్మాన్మే నాస్తి సంశయః ॥ ౧౭-౬౨॥**
**ఉద్యోగం తవ సంప్రేక్ష్య మిథ్యావృత్త చరావణమ్ ।**
**వాలినంచ హతం శ్రుత్వా సుగ్రీవం చాభిషేకితమ్ ॥ ౧౭-౬౬॥**
**రాజ్యం ప్రార్థయ మానస్తు బుద్ధి పూర్వ మిహా గతః ॥ ౧౭-౬౭॥**

'' అటు రావణుని సీతాహరణ రూపమగు దుర్మార్గమును, ఇటు వాలి వధ వంటి పరాక్రమమును గాంచి ఈతడు తమ శరణమునకు వచ్చినాడు. ఇది యాతని సద్బుద్ధికి నిదర్శనము. సంభాషణమున మనోగత భావనను దెలిసికొ నవచ్చును. ఎంతటి విద్వాంసుడైనను బుద్ధి మంతుల యెదుట సంభాషించున పుడు తన మనస్సు నందుండు విషయములను ప్రకటించకుండ దాచి యుంచుట

యనునది యాతని శక్తికి మించిన పనియే యగును. మహారాజా ! ఆతడు సంభాషించు నపుడాతని వాణి నుండి ఎట్టి దుష్టత్వమును గానరాదు. సదా యాతని ముఖము ప్రసన్నమై యుండును. కావున నాతనిపై నాకెట్టి సందేహమును లేదు. ఈతని యాచార వ్యవహారములు సరళము మరియు స్పష్టమునై యున్నవి. తమ ధర్మ ప్రయత్నము, రావణుని పాపాచారము, వాలి వధ, సుగ్రీవుని రాజ్యాభిషేకము మున్నగు విషయములను విని రాజ్య ప్రాప్తి యాలోచనతో నీతడు తమ శరణమునకు వచ్చినాడని నాయభిప్రాయము''.

హనుమంతుని యీ సదభిప్రాయమును విని శ్రీరాముడు తన యభిప్రాయమును గూడా సభికులెల్లర కిట్లు వినిపించినాడు.

**మిత్ర భావేన సంప్రాప్తం నత్యజేయం కథంచన ।**
**దోషో యద్యపి తస్మిన్ స్యాత్సతామేతద్విగర్హితమ్ ॥ ౧౭-౮౧॥**

మిత్ర భావముతో వచ్చిన వారిని నే నెప్పుడును త్యజించ జాలను. వచ్చిన వారి యందు నైతిక దోషమున్నను శరణు జొచ్చిన వారికి అభయమీ యని సత్పురుషులైనను నింద నీయులే యగుదు'' రనినాడు.

## 33. యుద్ధ రంగమున

నల, నీలుల వంటి నిపుణులగు వాస్తు శాస్త్రజ్ఞు (ఇంజనీరు)ల, మరియు వానర వీరుల సహాయ సహకారములతో సాగర నామధారి, అనుభవ శాలి యగు వృద్ధ మహాపురుషుని మార్గదర్శకత్వమున సముద్రముపై సేతువు నిర్మించి రామదళము 'లంక' యందు ప్రవేశించినది. మళ్లీ యొకసారి రావణునికి కర్తవ్యమును బోధించుటకు గాను యువరాజగు అంగదుడు రాయబారిగా బంపబడినాడు. మహా వీరుడగు హనుమంతుని పరాక్రమమును పూర్వము చవిచూచిన పౌరులెల్లరును అంగదుని గాంచి హనుమంతుని గా నెంచి'' హనుమంతుడు మళ్ళీ వచ్చినాడు. మహావీరుడు మళ్ళీ వచ్చినా'' డని పెద్దగా నరచుచు భయార్తులై నలువైపులకు బారిపోసాగినారు.

భౌతికైశ్వర్యమదమున మునిగి యున్న రావణునికి అంగదుని హిత

భోఘలు రుచించగలవా ? చివరికి వారు మార్గ భేద, రాక్షస సభ్యులకు సర్వ నాశన కారియగు మహా యుద్ధము జరుగనే జరిగినది.

వాల్మీకి రామాయణ యుద్ధకాండమున హనుమంతుని శౌర్య వీర్య పరాక్రమము దాని ప్రభావము అతి సుందరముగ వర్ణించబడి యున్నది. ఇచ్చ టనది సంక్షిప్తముగ మాత్రము దెలుపబడుచున్నది.

యుద్ధమున రావణుని ముఖ్యసేనాధిపతులు, సోదరులు, పుత్రులనే కుల మరణముతో రావణునకెంతో దుఃఖము గలిగినది. ఇది గాంచిన ఇంద్ర జిత్తు (మేఘ నాధు)న కధిక క్రోధము జనించి తండ్రియగు రావణుని జేరి యాతనికి ధైర్యమును గలిగించి 'రామబలమును రూపు మాపెదనని' ప్రతిన యొనర్చి వానరులనేకులను భూమిపై బడగొట్ట సాగినాడు. ఆతని బ్రహ్మాస్త్ర ప్రభావముచే రామలక్ష్మణు లిరువురును మూర్ఛితులై పడిపోయినారు. మిగిలిన ప్రధానులగు వానర భల్లూక వీరులు భయ భీతులై పారిపో సాగినారు. ఇది గాంచిన విభీషణుడు ధైర్య వచనములచే నెల్లరను సాంత్వన పరచి హనుమంతుని వెంట నిడుకొని జాంబవంతుడు పడియున్న స్థలమునకు వెళ్లి యాతని స్థితిని దెలిసికొనినాడు. జాంబవంతుడు తన బాధలను వర్ణించుచు నేను మిమ్ము కేవ లము మీ ధ్వనిని బట్టియే గుర్తించ గలుగు చున్నాను. ఇప్పుడు చూడగల శక్తి నా యందెంత మాత్రమును లేకుండ పోయినది. వానర శ్రేష్ఠుడగు హనుమం తుడు బ్రతికి యున్నాడా ? లేడా ? ముందుగ దెలుపుడు అని యడిగి నాడు. అది విని విభీషణుడు ఆశ్చర్యముతో ''ఋక్షరాజా ! రామలక్ష్మణులు, సుగ్రీవ మహారాజు, అంగద యువరాజు మున్నగు వారి క్షేమమునడుగుట కన్న హను మంతుని క్షేమమును గూర్చియే యడిగితి రేల ? హనుమంతునిపై నీకున్న ప్రేమ వీరిపై గానవచ్చుట లేదేమి కారణ'' మని ప్రశ్నించినాడు. అందుకు జాంబవంతుడు

**శృణునైరృత శార్దూల యస్మాత్ పృచ్ఛామి మారుతిమ్ ॥ యుద్ధ ౭౪-౧౧॥**
**అస్మిన్జీవతి వీరేతు హతమప్య హతంబలమ్ ।**
**హనుమత్యుజ్ఝిత ప్రాణే జీవన్తోఽపి మృతావయమ్ ॥ యుద్ధ ౭౪-౨౨॥**

"రాక్షస రాజా ! హనుమంతుని జీవనమును గూర్చి యడుగుటకు కారణమేమన, హనుమంతుడిప్పుడు జీవించియున్నచో ఈ మరణించిన, మూర్ఛ యందున్న వారెల్లరును పునరుజ్జీవితులు గాగలుగుదురు. ఇక నాతని ప్రాణములిది వరకే పోయి యున్నచో మే మెల్లరము జీవించియున్నను మృతప్రాయుల మనియే యెంచు" మని తెలిపి నాడు.

ఆ పలుకులు విని హనుమంతుడు హర్షపులకితాంగుడై "ఋక్షరాజా! మీ యాశీస్సులవల్ల నేను జీవించియే యున్నాను. ఆజ్ఞాపించు" డని ప్రణామ మొనర్చి నాడు. ఆ ధ్వనిని వినిన జాంబవంతుని యందు నవ్యజీవనము గలిగినది.

## ౩౪. హనుమంతుడు సంజీవిని దెచ్చుట

జాంబవంతుడు, విభీషణుడు, హనుమంతుడు మొదలగు ముఖ్య వానరులు తమ సైన్యములతో గూడ శ్రీరామ లక్ష్మణులను మూర్ఛా విముక్తుల నొనర్చు విషయమున చర్చించినారు. వారు తమ తమ యభిప్రాయములను దెలిపిన పిదప విభీషణుడు

**విశల్యకురు చాప్యేతౌ సాధితౌ రామలక్ష్మణౌ ! యుద్ధ ౭౪ - ౨౮॥**
**హిమవంతం నగశ్రేష్ఠం హనుమన్ గన్తుమర్హసి ॥ ౭౪ - ౨౯॥**
**సర్వౌషధి యుతం వీర ద్రక్ష్యస్యోషధి పర్వతమ్ ॥ ౭౪ - 30॥**
**మృత సంజీవనీం చైవ విశల్య కరణీమపి।**
**సువర్ణ కరణీం చైవ సంధానీంచ మహౌషధీమ్ ॥ యుద్ధ-౭౪ - 33॥**
**"తాః సర్వాన్ హనుమన్ । గృహ్యా క్షిప్రమాగన్తు మర్హసి ।**
**ఆశ్వాసయ హరీన్ప్రాణై ర్యోజ్య గంధవహాత్మజ ॥ ౭౪ - ౩౪॥**

ఋషభ, మరియు హిమవత్పర్వతములపై ఉపయోగకరములగు అనేక ఓషధులు గలవు. వాని యందు మృత సంజీవని (మూర్ఛితులను చైతన్య మొనర్చు నది), విశల్యకరణి (అస్త్ర శస్త్రాదుల విషయములను దొలగించునది), సువర్ణ కరణి, (రోగి శరీరమును స్వర్ణవంతము, ఉజ్వలము నొర్చునది), సంధాని

(తెగిపోయిన, విరిగిన యంగముల సతుక జేయునది) మున్నగునవి. ★ ఆ యోషధులన్నిటిని హనుమంతుడెరిగియే యుండెను. వాని నెత్తి కొనుట గాని తేగల వాడతడొక్కడే. కావున నీ యోషధులను దెచ్చుటకు హనుమంతుని ప్రార్థింపవలెను. ఆ యోషధులు వచ్చిన పిమ్మట వానర వీరుల మూర్ఛ, శస్త్ర విషము, అస్థి భంగము మున్నగు వానిని తక్షణమే దూరమగునని విభీషణుని యభిప్రాయముతో జాంబవంతాదులు హనుమంతుని ప్రార్థింపగా ఆజ్ఞగా నెంచి హనుమంతుడు విమానము ద్వార పర్వతములను జేరి అన్వేషించి యోషధులను గొని తెచ్చినాడు. వానిని జూచిన తోడనే యెల్లరును ఆనంద పడినారు. హనుమంతుడు యథాయోగ్యముగ నందరకు నమస్కరించి యాశీస్సుల నొందినాడు. తరువాత ఔషధములను శ్రీరామ లక్ష్మణులకు, సమస్త వానర వీరులకు ఆఘ్రాణింప జేయుట, ప్రయోగింప జేయుట జరిగినది. వెంటనే వారెల్లరును ఆరోగ్య వంతులుగ నున్నట్లే లేచి నిలచినారు. అనేక వానర వీరులు వెంటనే యుద్ధమునకు గూడ సిద్ధమై నిలిచినారు.

## 39. హనుమంతుడు ఇంద్రజిత్తును ధిక్కరించుట

ఈ యుద్ధమున సైన్యమందలి మహాయోధులెందరో మరణించినారు. శత్రు దళములను నిరుత్సాహ పరచుటకు ఇంద్రజిత్తు రాక్షస మాయ నొకటి రచించినాడు. "మాయసీత నొకదానిని నిర్మించుకొని యుద్ధ రంగమునకు గొని తెచ్చి హనుమంతుని యెదుట దానిని సంహరించినచో రామలక్ష్మణులు నిరుత్సాహ పడి వానర సైన్య సమేతముగ తిరిగి పోగలరు. ఏలన; ఎవరికొరకు ఈ యుద్ధము చేయవలసి వచ్చినదో అట్టి సీతయే నష్టమై పోయినప్పుడిక యుద్ధము జేయ జాలరని తలచినాడు. అంతేయైనది. మాయ సీతను కేశములు పట్టి రణభూమికి ఈడ్చుకొని వచ్చుటను జూచి హనుమంతుడు మహా క్రుద్ధుడై ...

★ ఈ విషయమును నిరాధారముగ ఒక కథ ప్రచారితమైయున్నది. అది యిట్లున్నది. "హనుమంతుడు వన మూలికలున్న పర్వతమునే దీసికొని అయోధ్యా నగరముపై నుండి వచ్చు చుండగా భరతుడు బాణముతో గొట్టినాడు. తరువాత రాముని గూర్చి వచ్చి జరిగినదని" ఇట్టి యసమంజసమైన విషయమేమనగ రామ లక్ష్మణుల మూర్ఛ మున్నగు విషయములను విని భరతుడు మౌనముగ యుండెనా?

మర్కార్తి గల అనార్యుడా ! నిరపరాధిని, విపద్గ్రస్తురాలు, గృహము, రాజ్యము, తల్లిదండ్రులు, బంధు జనము నెడ బాపి తేబడిన దేవిని నిర్దయుడవై సంపుత్తించు చున్న నీకు ధిఃకారము. ఓరీ నీచుడా ! జుగుప్సా కరమగు కర్మ జేయుటకు నీకు అవమానముగ దోచుటలేదా ! పాపకర్ముడా ! నీవీ యసహ్యా కరమగు కృత్యమును విరమించుకొననిచో నీవతి శీఘ్రముగ సర్వనాశన మొంద గలవు.

**ధిక్త్వాం పాపసమాచారం యస్యతే మతిరీదృశో ।**
**నృశంస సానార్య దుర్వృత్త క్షుద్ర పాప పరాక్రమ ।**
**అనార్య స్యే దృశంకర్మ ఘృణాస్తే నాస్తే నిర్ఘృతి ॥౮౧-౧౮॥**
**చ్యుతాగృహాచ్చ రాజ్యాచ్చ రామహస్తాచ్చమైథిలీ।**
**కింతవైషా పరాద్ధాహి యదనాంహంసి నిర్దయః ॥౮౧-౨౦॥**

ఈ ధిఃకారమును లక్ష్యపెట్టకనే రాక్షసుడు '' ఓరీ వానరా ! రామలక్ష్మణులు, సుగ్రీవుడు, మరియు నీవు ఏ సీత కొరకింతటి ప్రయాసము నొనర్చుచున్నారో యా సీతను ఇదిగో మీ యెదుటనే వధించి వేయుచున్నాను'' అని యనుచునే పదునైన ఖడ్గముతో విజ్ఞాన కౌశలమున సిద్ధ పరచబడిన మాయ సీతను హృదయమున బొడిచి నరికి వేసినాడు. ఈ ఘోర దృశ్యమును గాంచి రాక్షస దళమున హర్షనాదములు వానర దళమున హాహాకారములు నిండిపోయినవి. కాని విభీషణుడు నిజమును దెలుపగ అతిశీఘ్రముగనే శ్రీరామ సైన్యమున మరల యానందము వ్యాపించినది.

## ౩౬. హనుమంతుని రణ కౌశలము

ఇంద్రజిత్తు యొక్క యీ జిత్తుల ప్రయోగము వల్ల వానర వీరులందు తగ్గిన శౌర్యము, నిరుత్సాహము సంపూర్ణముగా దొలగిపోలేదు. ఈ యదను జిక్కగనే ఇంద్రజిత్తు యొక్క శక్తి, ఉత్సాహము పెరిగినది. ఆతని వ్యూహమున హనుమంతుని సైన్యము జిక్కి పోసాగినది. ఈ విధముగ యుద్ధము నడువ నిచ్చి వృధా సైన్యమును నాశనమొనర్చుకొనుట యుచితము గాదని యెంచి మహావీరులను గొందరను వెంట నిడుకొని హనుమంతుడు రాక్షస సైన్యము ముందుకు రాకుండ ఆపివేసినాడు. తమ వెనుక నున్న వారిని ఒక వ్యక్తియైన నష్టపడకుండ

యుద్ధ స్థలి నుండి వెనుకకు బంపి వేసి రక్షించుకొనినాడు. మహర్షి వాల్మీకి ఈ విషయము నిట్లు వర్ణించి యున్నాడు.

**సస్కన్ధ విటపైః శైలైః శిలాభిశ్చ మహాబలః ।**
**హనుమాన్ కదనం చక్రే రక్షసాం భీమకర్మణామ్ ॥ వా.రా.యు. ౮౨-౧౮॥**
**సన్నివార్య పరానీకం అబ్రవీత్ తాన్వనౌకసః।**
**హనుమాన్ సన్నివర్తధ్వం నవః సాధ్యం ఇదు బలమ్ ॥ వా.రా.యు. ౮౨-౧౯।**
**యన్నిమిత్తంహి యుద్ధామోహతసా జనకాత్మజా ।**
**ఇమం అర్థం హి విజ్ఞాప్యం రామం సుగ్రీవమే వచః ॥**
**తాయత్ప్రతి విధామ్యేతే తత్కరిషామ్య హేవయమ్ ॥ వా.రా.యు. సర్గ౮౨-౨౧॥**
**ఇత్యుక్త్వా వానర శ్రేష్ఠో వారయన్ సర్వవానరాన్ ।**
**శనః శనైః అసన్త్రస్తః సబలః సన్న్యవర్తయ ॥ వా.రా.యుద్ధ సర్గ ౮౨-౨౨॥**

మహాశిల ఖండములను, వృక్షములను విసరుచు హనుమంతుడు రాక్షస సంహార మొనర్చ సాగినాడు. ఐనను, రాక్షస బలము పెరుగుచు, తన సైన్యము రాక్షసులకు చిక్కిపోసాగినది. ఇట్టి విషమావస్థయందు అభిమానపడి అనవసర శౌర్యమును ప్రదర్శించి సైన్యమును వృధా నాశపరచుకొనుట ఉచితముగాదని తలచి హనుమంతుడు కొందరు మేటి వీరులను వెంట నిడుకొని ఇంద్రజిత్తును నెదుర్కొనినారు. శత్రువులను గెలుచుట అసాధ్యముగ నున్నదని తలచి హనుమంతుడు తన సైన్యమును 'సన్నివర్తధ్వం' వెనుకకు మరల్చుచు (ఇట్టి యాజ్ఞనే order.for retreat అని యందురు) మళ్లీ యెలుగెత్తి ''వీరులారా! ఏ సీత విషయము మనము మన ప్రాణములను సైతము లక్ష్యపెట్టక యుద్ధ మొనర్చుచుంటిమో అట్టి సీతాదేవి యిదివరకే వధింప బడినది. మన మీ వార్త శ్రీరామ, సుగ్రీవులకు తెలియ పరచి వారి యాజ్ఞ ప్రకారము నడచుకొనవలసి యున్నది''. అని తెలపి వానర సైన్యమును వెనుకకు మరలుట కాజ్ఞ నొసగినాడు. ★ తరువాత తిన్నగా ''అసంత్రస్తః undisturbed అనగా, శాం

---

★ యుద్ధమున విజయము లభించిన పిదప ఓడిన శత్రు సైన్యముపై విరుచుకుపడి తరుముట, బంధించుట యనునది కఠిన కార్యమేమి గాదు. కాని యుద్ధము జరుగుటడి శత్రు సైన్యముపై విజయమునొందుటకు మారుగ తమ సైన్యమే ఓడిపోయి శత్రు వ్యూహమున చిక్కుపడిపోవు సమయమున త

చిత్తముతో తన యీ కార్యమును శత్రువులు పసికట్టకుండ, అవ్యవస్థ జరుగ కుండ ''సబలః with the army సైన్యమును వెంట దీసికొని 'సంన్యవర్తత retreated వెనుదిరిగి పోయినారు. ఈ విధమగు సైన్య సంచాలమును ''సం నివర్తనమని' orderly retread యందురు. ఈ విషయము నందొక శ్లోకోక్తి యును గలదు. అనగా :

**''మంత్రినాం భిన్న సంధానే భిషజాం సన్నిపాతకే ।**
**కర్మణి వ్యజ్యతేప్రజ్ఞా స్వస్థే కోవా న పణ్డితః॥**

సమస్త కార్యములు నిర్విఘ్నముగా నడచుచు వాని యందేలాంటి యాటంకములు గలుగనంతవరకు అందరును చతురులే. కాని యట్టి పని చెడి పోయి బెడిసి కొట్టినపుడు సవరించుకొనువాడే బుద్ధిమంతుడు. రాచకార్యము చెడిపోయినపుడు దానిని చక్కబరచు కొనుట యందు మంత్రి చతురత, వ్యాధి ప్రకోపించినపుడు దాని నరికట్టి రోగి ప్రాణములు గాపాడుట యందు వైద్యుని చాతుర్యము గానవచ్చును. హనుమంతుడు సమయముపై ''ప్రసంగావధానము presence of mind ఎప్పటికెయ్యది ప్రస్తుతము'' అను న్యాయముగ ఇంద్ర జిత్తు బారినుండి తన సైన్యమును గాపాడుకొని సురక్షితముగ దీసికొని పోయి నాడు. దీనియందే యాతని సేనా నాయకత్వ కౌశల్యము ప్రస్ఫుటమగుచున్నది. ఆనాటి యుద్ధము ముగిసినది.

## ౩౭. రావణ వధ, శ్రీరాముని భ్రాతృ ప్రేమ

మరునాడు రావణుడు సర్వ సన్నద్ధుడై యుద్ధరంగమును ప్రవేశించి శత్రు పక్షమున నున్న విభీషణుని జూచి మహా క్రోధమున నాతనిపైకొక మహాశక్తిని ప్రయోగించినాడు. లక్ష్మణుడది గాంచి తక్షణమే విభీషణుని తన వెనుకకు త్రోసి ఆ యమోఘాస్త్రమును తనపై దీసికొని మూర్ఛితుడైనాడు. వెంటనే రావణుడు లక్ష్మణుని దీసికొనిపోవుట కాతని లేవనెత్తుచుండెను. దీని వర్ణన అధ్యాత్మ రామాయణమునందిట్లున్నది.

సైన్యము శత్రువులకు బందీగా జిక్కకుండ గాపాడుకొనుటయందే సేనానాయకుని యుద్ధ కుశలత్వము నందు గల సామర్థ్యము. ఇట్టి కౌశల్యము హనుమంతునియందు సంపూర్ణముగ నుండెను. ఈ విష యము మనము పూర్వోక్త శ్లోకములందు జదివి యున్నాము.

**గ్రహీతు కామం సౌమిత్రం రావణం వీక్ష్యమారుతిః ॥ ఆ.రా.యు. ౬-౧౨॥**
**ఆజగానో రస్మిక్రుద్ధో వజ్రకల్పేన ముష్టినా ।**
**తేన ముష్టి ప్రహారేణ జానుభ్యా మపతద్భువి ॥ ఆ.రా.యు. ౬-౧౩॥**

''లక్ష్మణుని రావణుడు లేవనెత్తుకొని పోవుటను గాంచిన హనుమంతుడు కుపితుడై రావణుని వక్షమున వజ్ర సమానమగు ముష్టిదెబ్బ నంటించినాడు. ఆ ముష్టి ప్రహారము వల్ల కండ్లు చీకటులు గ్రమ్మగ రావణుడు నేలకొరిగినాడు. వెంటనే హనుమంతుడు లక్ష్మణునెత్తుకొని శ్రీరాముని సన్నిధికి గొనిపోయినాడు.

లక్ష్మణుని మూర్చావస్థ స్థితిని గాంచి శ్రీరామ చంద్రుడనేక విధములుగ విలపించ సాగినాడు. ''నేను పూర్వజన్మమునందెట్టి దుష్కర్మలొనర్చియుంటినో దాని ఫల స్వరూపముగ నాధార్మిక సోదరుడు నా యెదుటనే మరణించుచున్నాడు,★ అని తలపోయుచు దుఃఖింప సాగినాడు. హనుమంతుడాలస్యము చేయక తత్క్షణమే బయలుదేరి సముద్ర మద్యనగల ద్రోణ పర్వతముపై నున్నయోషధులను దెచ్చినాడు. అన్ని రామాయణములందును హనుమంతుని ఈ యద్భుత బలము, పౌరుషము, బుద్ధి కౌశలము, ప్రభావము, సమయోచిత జ్ఞానము చక్కగ వర్ణింపబడి యున్నది.

హనుమంతుడు దెచ్చిన సంజీవనిని సుషేణుడు వెంటనే లక్ష్మణునిచే ఆఘ్రాణింపజేసి 'విశల్యకరణి'తో గాయములను బాగుచేసి వీరవ్రతుడు, యతివరుడు నగు లక్ష్మణుని ఆరోగ్యవంతునిగ నొనర్చినాడు. తన భ్రాతృస్నేహ రక్షణ నొనర్చిన హనుమంతునికి శ్రీరాముడు తానెంతో ఋణపడి యున్నట్లు అనేక సార్లు కృతజ్ఞతను ప్రకటించినాడు. తరువాత యుద్ధమున రావణాదు లెల్లరును సంహరించబడినారు.

---

★ **కింమయా దుష్కృతంకర్మ కృతమన్యత్ర జన్మని।**
**యేనమే ధార్మికోభ్రాతా నిహతశ్చాగ్రతః స్థితః॥ వా.రా.యు. ౧౦౧-౧౯॥**

ఇట శ్రీరాముడు తనపునర్జన్మ విషయమునొప్పుకొనుచు కర్మఫలబంధనమును అంగీకరించుచున్నాడు. వాల్మీకి రామాయణమందలి ఈ శ్లోకము అవతారవాదముపై వజ్రాఘాతమే.

## ౩౮. సీతారాముల సంయోగము

రావణుడు మున్నగు వారి యంత్యేష్టి కార్యముల అనంతరము శ్రీ రాముడు తన కార్యము నందత్యంత సహాయకారి, రాష్ట్రోద్ధారవ్రతుడగు ఆంజ నేయుని బిలుచుకొని ''సౌమ్యుడా! కాదగిన పనులన్నియు నైనవి. ఎవరి నిమిత్త మింతటి గాధజరిగినదో అట్టి సీతాదేవి సమాచారము దెలిసికొనవలసి యున్నది. కావున,

**అనుజ్ఞాప్య మహారాజ మిమంసౌమ్య విభీషణమ్ ।**

**ప్రవిశ్య నగరీంలంకా కౌశలం బ్రూహి మైథిలీమ్ ॥ వా.యు. ౧౧౨-౨౪**

**వైదేహ్యామాంచకుశలం సుగ్రీవంచ సలక్ష్మణమ్।**

**అచక్ష్వవదనాం శ్రేష్ఠ !రావణంచ హతం రణే ॥వా.యు. ౧౧౨-౨౫॥**

విభీషణ మహారాజు యాజ్ఞనుగొని లంక కేగి సీతకు మా కుశల సమా చారమును దెలిపి జానకి క్షేమము నరసిరమ్ము. రావణుడు రణమున నిహతుడైన వార్తను గూడ సీతాదేవికి వినిపించు'' మని పంపించినాడు. హనుమంతుడు లంకా నగరము జేరి విభీషణ మహారాజు నాజ్ఞతో సీతాదేవిని దర్శించుకొని

**విభీషణ సహాయేన రామేణ హరిబిః సహ ।**

**నిహతో రావణోదేవి లక్ష్మణేనచ వీర్యవాన్ ॥ వా.యు. ౧౧౩-౮॥**

**ప్రియమాఖ్యామితే దేవి భూయశ్చత్వాం సభాజయే ।**

**తవ ప్రభావాద్ధర్మజ్ఞే మహాన్రామేణ సంయుగే ॥ వా.యు. ౧౧౩-౯॥**

**లబ్ధోఽయం విజయః సీతే స్వస్థాభవగత జ్వరా !**

**రావణశ్చ హతః శ్శత్రుర్లంకాచైవ వశీకృతా ॥ వా.యు. ౧౧౩-౧౦॥**

''వైదేహి ! శ్రీరాముడు లక్ష్మణ సుగ్రీవులతో సహా క్షేమముగ నున్నాడు. ఇప్పుడాతడు శత్రు సంహారమొనర్చి కృతకార్యుడైనాడు. లక్ష్మణ, విభీషణ, సుగ్రీవ, వానర, భల్లూక సైన్య సహాయముతో రావణుని సంహరించినాడు. ధర్మజ్ఞే ! శ్రీ రామునకీ విజయము నీ ప్రభావము వల్లనే కలిగినది. నీ విపుడు నిశ్చింతురాలవై పూర్వము వలెనే ఆనందితురాలవై యుం డుము. ఏలన, రావణుడు వధింపబడినాడు. లంకా నగరము మనవశమందే యున్న'' దని తెలిపినాడు.

హనుమంతుని ముఖతః ఈ పరమానంద దాయకములగు వాక్యములను విని సీతాదేవి సంతోషమును బట్టలేక కొంతకాలము నోట మాట రాకుండా యుండి పోయినది. ఆ పిదప, " ఆంజనేయా ! అతిప్రియమైన యీ సందేశము వినిపించి నందులకు నీ కెట్టి బహుమతినిచ్చి ఋణవిముక్తి నొందగలనో తెలియుట లేదు. అపార ధన కనకములు, బహువిధ రత్నరాసులు, ముల్లోక రాజ్యములను సమర్పించి నను అతిస్వల్పమేయగును." అని హనుమంతుని విద్య బుద్ధి బలము మరియు ధర్మ గుణముల ననేక విధముల ప్రశంసించినది. హనుమంతుడు మిగుల యానందించి జననీ ! మీ వంటి పతివ్రతామతల్లుల కన్నీరూరకే పోదు. అదియే గదా ! లంకను నాశనమొనర్చినది? ఇచ్చట రాక్షసాంగనలు నీ కనేక విదములగు క్లేశములును గలిగించినారు. వారి విషయమున నేమి యాజ్ఞ ? అని యనినాడు.

అది విని సీతాదేవి "నాయనా ! బలాత్కారముగా రాజాజ్ఞచే నియోగించ బడిన యీ దాసీ జనముపై కోపమెందులకు ? పరాధీనులై చేసిన వీరి కృత్యములకు ప్రతి క్రియ నొనర్చుట భావ్యము గాదు. ఇక నా దుఃఖముల విషయమందు వేమో ?

**భాగ్యవైషమ్య దోషేణ పురస్తాద్దుష్కృతే న చ ।**
**మయై తత్ప్రాప్తే సర్వం స్వకృతంహ్యేవ భుజ్యతే ॥ వా. యు. ౩౯.౪౦॥**

ఇది యంతయు నా పూర్వ జన్మ కృతఫలమే. నే నే జన్మమున నెట్టి దుష్కర్మల నొనర్చి యుంటినో దాని ఫలమును ఆవశ్యముగ ననుభవించ వలయును గదా !" అని యనినది.

సీత పలుకులకు హనుమంతుడు తన్మయుడై "జననీ ! నీవు మహాత్ముడగు శ్రీరాముని ధర్మ పత్నివి గదా ! నీ భావములు గూడ నట్లే యుండును. ఇక దయ దలచి శ్రీరామునకు మీరే సందేశము నీయగలరో సెల వీయు" డని పలికినాడు.

అందులకు సీతాదేవి "భక్త వత్సలుడగు శ్రీరాముని దర్శనముకన్న

నాకు అన్యమేమిగావలయును'' అని యనినది. ఈ సీతా సందేశమును హను మంతుడు శ్రీరాముని చెంత కేగి వినిపించినాడు. అది విని శ్రీరాముడు విభీషణునితో సీతాదేవిని వస్త్ర భూషణాలంకృత నొనర్చి తీసికొని రమ్మని ఆజ్ఞా పించినాడు. తరువాత సుగ్రీవాంగద హనుమజ్జాంబవంతాది వానర వీరులను, విభీషణుని తదితర మిత్రుల పరాక్రమములను వర్ణన యుక్తముగ ప్రశంసించి తన కృతజ్ఞతల నర్పించినాడు.

## ౩౯. అయోధ్య యందాంజనేయుడు

విభీషణునిచే నొసగబడిన 'పుష్పక' మను విమానముపై సీతారామ లక్ష్మణులాసీనులైనారు. అచ్చటి వారందరితో శ్రీరాముడు ''మహాశయులారా! నే నిపుడయోధ్యకు వెళ్లుచున్నాను. మీ యెడల నే నెంతో ప్రసన్నుడను, కృతజ్ఞ డను నై యున్నాను. వానర, రాక్షస వీరులెల్లరును యథేచ్ఛగా మీ మీ స్థానము లకు వెళ్లుడు. నా యాత్మ స్వరూపుడవగు ఆంజనేయా ! నీ ఋణము నుండి నే నెన్నడును విముక్తుడను గాజాలను. నీవు పరమ ధన్యుడవు. సుగ్రీవ మహా రాజా ! మీ మైత్రి ధర్మ భావము నాకెంతో ప్రియమును హితమును గలిగించి నవి. మీ రిపుడు కిష్కింధా నగరమునకు వెళ్లుడు. ప్రియమగు విభీషణా ! నీవు లంకయందు సుఖముగ నుండుము. ఇక నీకు భయమును గలిగించు వారెవ్వరు నుండరు''. అని చెప్పి బయలుదేరనున్న శ్రీరాముని గాంచి అచ్చటి వారెల్ల రును హనుమంతుని ముందుంచుకొని

**దృష్ట్వాత్వామభిషేకార్ద్రం కౌసల్యా మభివాద్యచ ।**
**అచిరాదాగ మిష్యామః స్వగృహాన్నృపసత్తమ ॥ వా. యు. ౧౨౨-౨౦॥**

మహారాజా ! మా యెల్లరకు అయోధ్యను దర్శించుకొను కాంక్ష గలదు. మీకు జన్మను ప్రసాదించిన కౌసల్య మాతకు నమస్కరించి మీ రాజ్యాభిషేక మహోత్సవమును గాంచి మా మా స్థలములకు వెళ్ళిపోవుదు''మని పలికిన హను మంతుడు మున్నగు వారి వచనములను విని శ్రీరాముడతి ప్రసన్నుడై ''మహాను భావులారా ! మీ కుతూహలము నాకెంతయో ఆనంద దాయకమైన విషయము.

మీ యెల్లరతో నేను అయోధ్యానగర ప్రవేశానందానుభూతిని పొందుదు'' నని తెలిపి యెల్లరతో విమానము పై బయలు దేరినాడు. సీతాదేవికి సాగరము, సేతువు మున్నగు వాని పరిచయ మొనర్చుచు కిష్కింధా నగరమును జేరినాడు. అచ్చట విదుషీ రత్నములగు తార, రుమ, మరియు తపః పరాయణురాలగు పద్మరాగ మున్నగు వారిని దీసికొని మహర్షి భరద్వాజాశ్రమము చేరినాడు.

మరునాడు శ్రీరాముడు మహర్షి భరద్వాజుని సెలవొంది అయోధ్యా పరిసరములకు జేరి సంపూర్ణానందమును పొందినాడు. అపుడాంజనేయుని బిలిచి ''ప్రియ మిత్రమా ! నీవు ముందుగా అయోధ్యా నగరమునకు వెళ్లుము. మార్గమధ్య మున్న శృంగవేరి పురమున నిషాద పతియగు గుహరాజుకు నా కుశలమును దెలుపుము. ఆతడును నా పరమ మిత్రుడే. ఆతడు నా క్షేమ సమాచారమును విని అతి సంతుష్టుడగును. ఇంతయే గాక నీ కాతడు అయోధ్య మార్గమును, భరతుని సమాచారము గూడ తెలుప గలడు.

అయోధ్యా నగరము జేరి నా ప్రియ సోదరుడగు భరతునికి సీతా లక్ష్మణ సహితముగ నా యాగమనము, క్షేమమును గూర్చి తెలియపరచుము. తరువాత సీతాహరణము, రాక్షసులతో యుద్ధము మున్నగు విషయములను గూడ తెలుపుము. నీవు విషయములను దెలుపు నప్పుడాతని ముఖ కళవరపాటును, రూపు, మరియు చేష్టలు ఎట్లుండునో గమనించి నాకు దెలుపు'' మని యనినాడు. (దీనివల్ల హనుమంతుడింతవరకు భరతుని జూడలేదనియే స్పష్టపడుచున్నది గదా !)

శ్రీరాముని సందేశమును విని హనుమంతుడు గుహుని గలిసికొని శ్రీ రాముని ఆగమన సందేశమును తెలిపినాడు. ఆ వార్తను విని గుహుడు అమిత సంతోషమున వారి స్వాగతమునకై తన ప్రజా వర్గముతో శ్రీరాముని రాక కొరకై నిరీక్షించు చుండెను.

అటనుండి బయలుదేర హనుమంతుడు భరతుని దర్శించుకొనినాడు. అప్పుడాతడు తాపసుల వలె జటా వల్కలమును దాల్చి కేవలము కంద మూల

ఫలములను భుజించుచు వ్రత పూర్ణమొనర్చు చుండెను. రాజ్యాధికారమున నుండి యును శ్రీరామాగమనమును నిరీక్షించుచు ఎంతో చింతాయుక్తుడై యున్నట్లు దోచుచుండెను.

విరహ వ్యాకులముతో బాధ పడుచున్న భరతునికి ఆంజనేయుడు శ్రీరామాగమన సూచన నందించి యాతని ప్రాణములను గాపాడి ఆతనియందు నవ్య జీవనమును ప్రవేశింపజేసినాడు. హనుమంతుడు తన పరిచయమున ''వానర ప్రభువగు పవనుని పుత్రుడను, హనుమంతుడను వాడను, దీన జన బంధువగు శ్రీరామ ప్రభువుల పాద సేవకుడ'' నని తెలిపినాడు. అత్యంత వినయ భావ ముతో నున్న యా పలుకులను విని భరతుడధికానందముతో హనుమంతుని గాఢ పరిష్వంగమొనర్చుకొని '' ఆంజనేయా ! శ్రీ సీతారామ లక్ష్మణుల కుశ లాగమన వార్తను దెలిపి నాకెంతయో ముదము గలిగించితివి. నీ ఋణమును నే నెట్లు దీర్చుకొనగలుగుదు'' నని పలికినాడు.

## ౪౦. శ్రీరామ పట్టాభిషేకము

భరత శత్రుఘ్నుల, మరియు ప్రజల కోరికపై శ్రీరాముడు రాజ్య భార మును వహించుటకు సమ్మతించినాడు. ఈ వార్త దెలియగనే ప్రజలయందధిక ఆనందోత్సాహములు నిండిపోయినవి. మంగళ వాద్యములతో, నాట్య గాన ములతో నగర మంతయు కోలాహలముగ నుండెను. అనతి కాలముననే రాజ్యా భిషేకము జరుగుటకు ముహూర్తము గూడ నిర్ణయింపబడినది.

అవసరమగు సంభారములు, సామగ్రి సమకూర్చబడినది. నిశ్చిత ముహూర్తమున నవరత్న ఖచిత సింహాసనముపై శ్రీరామునిని ఆసీనునిని జేసి వశిష్ఠ వాల్మీకి, వామదేవ, విశ్వామిత్ర, విజయ, అగస్త్య, కశ్యప, కాత్యాయన, గౌతమ, జాబాలి మొదలగు అనేక ఋషులు, మహర్షులు సకల ప్రజా సమ్మతితో శ్రీరాముని రాజ్యాభిషేక మహోత్సవమును పూర్తి జేసినారు.

రాజ్యాభిషేక విధులు పూర్తియైన పిదప రాష్ట్ర ప్రజలు, సామంత, మాండ లిక ప్రభువులెల్లరును తమ హృదయ సామ్రాట్టగు శ్రీరామ చంద్ర ప్రభువులను

యథోచితముగ భూరి కానుకలతో సత్కరించినారు. ఉదార స్వభావుడగు శ్రీరాముడు వారెల్లరను యథార్హముగ ఉపాయనములతో సత్కరించి ఋషి మండలికి మాతాత్రయమునకు పాదాభివందన పూర్వకముగ అర్చనాదులనొసర్చి మధుర, వినయ వాక్యముల నిట్లనినాడు.

ఇంత గొప్పదగు ఈ లోక సంగ్రాహక ( సకల ప్రజలకు సుఖము గలిగించు) రాష్ట్ర కార్యము పూర్తియైనది. దేవరాష్ట్రము, ఆర్య రాష్ట్రము, వానర రాష్ట్రము, మరియు అసుర రాష్ట్రములు ఏకమైనవి. ఏకాంత భోగవాద, భౌతిక వాదములపై నిలిచి వామ మార్గమున నడచుచు వైదిక సంస్కృతికి శత్రువుగ నిలిచియున్న అసురీసభ్యత సంపూర్ణముగ దొలగి దాని స్థానమున అన్ని రాష్ట్రములందును ఒకే యొక పవిత్ర వైదిక సంస్కృతియొక్క పవిత్ర ధ్వజ మెగురుచున్నది. పూజ్యులగు మన ఋషి, మహర్షులు మరియు సద్విప్రులే ఈ శ్రేయస్సునకు మూల పురుషులు. మానవావిర్భావమునుండి నేటివరకు మన సంపూర్ణ కర్తవ్య విధానముల మూల సూత్రధారులు మన దేవ గణమే యై యున్నది. ఇదియే మన సఫలతయందు గల రహస్యము.

ఏ రాష్ట్రమందలి 'బ్రాహ్మణ' శక్తి చైతన్యముగ నుండి వేదమాత శబ్దములలో **''వయంరాష్ట్రే జాగృయామ పురోహితః''** అని యుద్ఘోషించుచుండునో ఏ రాష్ట్రము యొక్క ఇంద్ర ( క్షాత్ర) శక్తి, బ్రాహ్మణశక్తి యాజ్ఞలను పాటించుచుండునో ఆ రాష్ట్రము విజయోల్లాసముతో, సకల సంపదలతో దులదూగుచుండును. ఆనందోల్లాసములతో నిండియున్న నీ మహోత్సవ సమయమున మన ఋషి మండలిని, విద్వన్మండలిని మనః పూర్వకముగ నభినందించుచున్నాను. ఇప్పుడు నన్నింతటి గురుతర బాధ్యతా భారము గల పీఠముపై గూర్చుండ బెట్టి మహాభారము నెత్తు చున్నారు. ఈ వైదిక స్వరాజ్యము సాంస్కృతిక సామ్రాజ్యమునకు నిజమగు పాలకులు, శాసకులు ఈ ఋషి ముని బృందమే. నేను కేవలము వారి ప్రతినిధిని మరియు నిమిత్త మాత్రుడనే. వీరి వరద హస్తము, కరుణా దృష్టులు సదా నాపై యుండి నాకు కర్తవ్య పాలనా శక్తిని ప్రసాదించు గాక. ''అని పలికి శ్రీరాముడు విభీషణ మహారాజు,

సుగ్రీవ మహారాజు, అంగద యువరాజు, వీర వరులగు నలుడు, నీలుడు, మహా మతియగు జాంబవంతుడు, మరియు గజ, గవయ, శరభ, గంధ మాదనులు మున్నగు వానర సమూహము యొక్క ఉపకారములను అనేక రీతుల బొగడుచు అందునకు కృతజ్ఞతలు దెలిపినాడు.

తరువాత హనుమంతునిని ఆలింగన మొనర్చుకొనుచు '' ఈతడు అంజనా పవనుల పుత్రుడు. అఖండ బ్రహ్మచర్యవ్రతధారి, తపః శాలి, పరమ వైదిక విద్వాంసుడు, గదాధారి, వజ్రాంగుడు, మహావీరుడగు హనుమంతుడు, వానర రాష్ట్రమునకు మకుటము లేని మహారాజు, యువ వానర వీర, మరియు సంక్రాంతి దళ నాయక రత్నము - మహా నిర్మాత, సేవా ధర్మమునకు మూర్తి వంతమైన చిహ్నము. మహర్షి అగస్త్యుల యావజ్జీవన మహానిధి. మరియు వారి అమర శిష్యుడీ హనుమంతుడు. యథార్థమునకీ విశాల సాంస్కృతిక సామ్రాజ్య సంస్థాపన కీతడే మూలమని యనవచ్చును. నే నేవిధముగ నీతని నభినందించగ లనో, ఎట్టి శబ్దములతో నీతని గీర్తించ గలనో, ఎట్లీతని ఋణము నుండి విముక్తి నొందగలనో దెలియకున్నది. ఒక నేనేయేమి? నిజమునకీ యార్యావర్తము నందలి ప్రతినాగరికుడును ఈ మహావీరుని ఋణము నుండి విముక్తి నొంద జాలరని న సత్య దూరము గాజాలదు.

ఈ విధముగ హనుమంతుని యుపకారములను, సేవా సాధన పూర్ణ మగు తపో త్యాగముల వర్ణించుచు చెప్పుచుండు నపుడాతని కన్నులు అశ్రువు లతో నిండి పోయినవి. ఈ ప్రసంగమున శ్రీరాముడు అంజనామాత, మహారాజ పవనుల తపస్సును, మహర్షి అగస్త్యుల సాధనలను గూర్చి సంక్షేపముగ దెలిపినాడు.

శ్రీరాముడా పిదప వానర వీరాంగనా దళము వైపు సంకేతము నొన ర్చుచు దాని వ్యవస్థాపకురాలగు 'పద్మరాగ' యవిచ్ఛిన్న తపశ్చర్యకు శత సహస్ర రీతుల వందన సమర్పణ మొనర్చి '' ఈమెయే మహావీరాంజనేయుని ధర్మ సహో దరియగు పద్మ రాగ సేనాధ్యక్షుడగు నలుని ఏకైక పుత్రిక ఈమె తన ధర్మ సహో దరుడగు హనుమంతుని పథమున నడుచుచు ఆజన్మ బ్రహ్మచర్య దీక్షాధారియై వీరాంగనా దళమును సిద్ధ పరచి సంపూర్ణ వానర రాష్ట్రము నందింటింట దేశ

సేవాదృష్టిని ప్రేరేపించినది. ఇక నా సోదరులు భరత, లక్ష్మణ, శత్రుఘ్నుల, మా మాతృ దేవతల, మరియు సీత యొక్క తపము వర్ణనాతీతము. ఇట్టి శుభా వసరమున వీరందరకు నా యభినందల నర్పించుచున్నాను. ఈ నా ప్రియమైన ప్రజలు ఈ సేవక మాత్రుని ఇంతటి దీర్ఘ కాలము (పదునాల్గు వత్సరములు) మరవకున్నందులకు వారి కెంతయో ఋణ పడియున్నాను.

చివరికి సమస్త విఘ్న నాశకుడు పరమ పిత పరమేశ్వరునకు శ్రద్ధా పూర్వక ధన్యవాదములర్పించి వేద మంత్రములతో స్తుతి ప్రార్థనో పాసనముల యనంతరము శ్రీరాముడు సింహాసనము నధిష్ఠించినాడు. పురుషోత్తముడగు శ్రీ రాముని నేత్రములిపుడు కృతజ్ఞతాభావముతో ధరణీ మాతను జూచు చుండెను. వైదిక, సాంస్కృతిక సామ్రాజ్య (రామరాజ్య) స్థాపనను గూర్చి మహర్షుల జీవన సాధన నేడు సఫలము నొందినది. ఈ ప్రసంగము నందంతటను ఋషి మండలి యొక్క పూర్ణ మౌన భావము అత్యంత దర్శనీయముగ నుండెను.

## ౪౧. అనన్య నిష్ఠ మరియు హృదయ దర్శనము

రాజ్యాభిషేకానంతరము విప్రులను, ఋషులను, మునులను, విశేష దాన దక్షిణలతో గౌరవించిన యనంతరము వశిష్ఠ మహర్షి యనుమతితో శ్రీ రాముడు లంకేశుడగు విభీషణునకు, వానరరాష్ట్రాధిపతియగు సుగ్రీవునకు యువ రాజు అంగదునకు, నిషాధ రాజగు గుహునకు, మాండలిక సామంతరాజులకు, జాంబ వంతుడు, నలుడు, నీలుడు, మరియు ఇతర వానర వీరు లెల్లరకును పుష్కలముగ రత్నాభూషణములు, మరియు వస్త్రాభూషణములను కానుకలుగా నిచ్చినాడు. తరువాత తనయాత్మ స్వరూపుడగు హనుమంతునకెట్టి బహుమతి నీయవలెనో తోచక శ్రీరాముడాలోచించు కొనుచుండగనే సీతామాత అంజ నాకుమారునకు హృదయ పూర్వక కృతజ్ఞతలు నర్పించి స్వయముగా తన యమూల్య రత్న ఘటిత కంఠ హారమును దీసి హనుమంతుని మెడ యందు లంకరింప జేసినది. అదిగాంచిన సభాస్థలియంతయును హర్ష ధ్వనులతో, జయ ఘోషణములతో మార్మోగినది. కాని యాశ్చర్యకర విషయమేమన, హను మంతుడా కంఠహారము నుండి ఒక్కొక్క రత్నమునే దీసి పగులగొట్టుచు

వానియందు దేనినో వెదకుచు వెంటనే సభా మంటపము వైపు భారమైన చుండెను.

పవనకుమారుని యీ విచిత్ర వ్యవహారముచే సీతామాతకు వర్ణింపసల విగాని బాధయనిపించినది. వ్యథాభరిత హృదయముతో సీతాదేవి ''కుమారా! ఇదేమి? అని యడిగినది.

**''మాతా!** మీరాశ్చర్యమున మునుగుట, బాధ పడుట స్వభావ సిద్ధమే. **మీ లోపల నిండియున్న** బాధను నేను కాంచుచునే యున్నాను. కాని నే నేమి **చేయుదును ? మాతా !** నాకీ యమూల్య బహుమానము నిరర్థక వస్తువు కన్న **నధికమేమి గాదు.** ఇది నా కంఠము నకు భూషణము గాక దూషణమే యగును''. అని హనుమంతుడు నిరాపేక్ష, మార్మిక వాక్యములలో ననినాడు.

అట్లైన దీని నెవరికైన నివ్వ వచ్చును గదా ! కాని వానిని నీవు ఒక్కొ క్కటే పగుల గొట్టుచు వానియందేమి పరీక్షించుచు పారవైచు చున్నావు? అని సీతాదేవి బాధా మిళిత శబ్దములలో మళ్లీ యడిగినది.

''మాతా ! వీనిలో దేనియందైనను 'రామ' యను శబ్దమున్నదేమో'' యని పరీక్షించుచున్నాను. నా విషయమున 'రామ' యను శబ్దార్థము 'రాష్ట్రము, మానవత్వము పవిత్రమైన వైదిక సంస్కృతియే **''రామో విగ్రహవాన్ ధర్మః''** ఇపుడు రాష్ట్రము మరియు సంస్కృతి యంతయును రామ మయమే'' యని దెలియ వా తల్లీ! నాకు మహాత్ముడగు రాముడు సంపూర్ణ రాష్ట్ర రూపముననే గానవచ్చును.

తల్లీ ! నా కిప్పుడు పవిత్ర వేదమంత్ర మొకటి తలపునకు వచ్చుచున్నది. **''త్వంయజ్ఞేషు ఈడ్యః''** ఈశ్వరా యజ్ఞములందు పూజనీయుడవు నీవే. యజ్ఞముల ద్వార మీ పూజనే యొనర్చెదము. మా ప్రత్యేక సత్కార్మ నీ పూజయే యైయున్నది. 'Work is worship' మన ఆచార వ్యవహారములు, రీతి నీతి, ఉనికి మనిషికి, ఆహార విహారము లన్నియును జన సేవార్థమైనప్పుడే యిది సఫల మగును. కేవలము భౌతిక వస్తు సంపదగాక మనస్సు, మేధ, పూజ, ఉపాసన మరియు జీవిత మందలి ప్రతి నిమిషమును రాష్ట్రీయాకరణమైనప్పుడే సఫల

మగును. ఎట్టి కార్యమున రాష్ట్ర గౌరవముగలదో, ఎద్దానియందు రాష్ట్ర వాసులసేవగలదో, జన కల్యాణము గలదో అట్టి వానినే మేమాలోచింతుము. వానినే పలికెదము. అవియే భుజించెదము, ధరించెదము. అట్టి ప్రజా పద్ధతినే స్వంతమొనర్చుకొనెదము. అట్టి దానినే జీవన సాధనముగ గ్రహించెదము. జీవితము నందిదియే యజ్ఞ మయత్వము, ఈశ్వర మయత్వము, ధర్మమయత్వము, మరియు రాష్ట్ర మయత్వము, భగవానుడగు శ్రీరాముడు ఈ యాదర్శములను పాటించుట యందందరిలో ప్రథముడు, 'రామ' యను శబ్దము నేడు రాష్ట్రమునకు పర్యాయ పదమై యున్నది. కావుననే రామ భక్తి యన దాని యర్థము రాష్ట్ర భక్తి, మానవ భక్తి, మానవతా భక్తియై యున్నది.

జననీ! నాకీ రత్నములందు రాముడు గాన్పించలేదు. అనగా; రాష్ట్రము గనిపించలేదు. రాష్ట్రము యొక్క ఆత్మ గనిపించలేదు. నా ఉద్దేశమింకా మీకు స్పష్ట పడక పోవచ్చును. రాష్ట్రము యొక్క ఆత్మయన దాని ప్రజాజనమే. సమస్త రాష్ట్ర ప్రజలెంతవరకు సకల ధన ధాన్య సంపన్నులై ఈవిధమగు రత్నహారములను ధరించలేరో అంతవరకు నాకీ యమూల్య రత్నహారమును గ్రహించు నధికారము లేదు. ఎంత వరకు రామ రాజ్యము నందొక్క వ్యక్తియైనను సంతాపముతో, కన్నీటితో నుండునో, రాష్ట్రము నందేమూలయందైనను అజ్ఞానము, అన్యాయము, అభావమువలన నుత్పన్నమగు సంకటములు, బాధలు, వేదనలెంతవరకుండునో అంతవరకు నా రామ ( రాష్ట్ర) భక్తి అసంపూర్తియే యై యుండును.

మాతా ! నీ బహూ మానమును కించ పరచు సాహసము నా కెక్కడిది? నా శరీర మందలి ప్రతిరోమము మీ పవిత్ర ఆశయమును కీర్తించుచుండును. "ఈ పారవైచిన ఒక్కొక్క రత్నపు ముక్క రామ రాజ్యము నందొక్కొక్క పంట పొలమగు గాక. ప్రతి గృహము రత్నరాసులతో నిండుగాక. ఇచ్చటి ప్రతివ్యక్తి మీచే బహూకరింప బడినట్టి రత్నహారములను ధరించు అర్హతను సంపాదించుగాక". అని యాశీర్వదించుము. మాతా ! ఆ నాడే మీ యీ తనయుడు రత్నహారమును ధరించ గలడు. ఆ నాడే యీ రత్నకణము

లందు ''రామదర్శనము'' అను దాని యర్థము, అభిప్రాయము, పూర్ణమగును. ఇక నా శేష జీవిత ధ్యేయము రామరాజ్యము సధిక సమృద్ధ వంతము, సౌఖ్యవంతము, ఆదర్శవంతము నొనర్చి తద్వార వైదిక సంస్కృతీ సామ్రాజ్యము, ఈశ్వరీయ రాజ్యము, దైవీ రాజ్యము, ఆదర్శ రాజ్యమను వానికి ప్రతి రూప మగుటకు కృషి చేయుటయే. అప్పుడే నా దయామూర్తి అంజనామాత, పూజ్య పితృదేవుల తపము ఫలవంతమైనదని, మరియు మరియు... (హనుమంతుని నేత్రములు ప్రేమాశ్రు పూర్ణములై గద్గదముతో నోటినుండి మాట రాక కొంత వడి యాగి) మరియు నా జీవన దాత, వైదిక సంస్కృతీ సామ్రాజ్య నిర్మాత గురుదేవులగు అగస్త్య మహర్షులు వారి, వశిష్ఠ, విశ్వామిత్ర మహర్షుల వారి జీవన సాధనము అప్పుడే సార్థక మగును. ఆ సమయముననే మహారాజగు శ్రీరామ ప్రభువుల అశ్వమేధ యజ్ఞ పూర్ణాహుతి కార్యమును సంపూర్ణమగును.

తల్లీ ! నన్ను, మరికొందరు యోధులను, 'రామరాజ్య నిర్మాత' అని యనినారు. కాని వాస్తవముగ రామ రాజ్య నిర్మాతలు బలిదానమైన మన శత సహస్ర నర వీరులును, యశోవంతులగు మన వీర సైనికులును, సంపూర్ణ ప్రజానీకమునై యున్నారు. మనము బాహ్యాదృశ్యమగు మందిర శిఖర కలశమును మాత్రమే గాంచ గలుగుదుము. కాని యా మందిరమును దృఢముగ నుండునట్లు గాపాడుచున్న పునాది శిలలను జూడలేము గదా ! అవి మనకు గానరావు. మన మీనాటి మహా మహోత్సవమున నట్టి అమరవీరులను స్మరించి వారి చరణములందు శ్రద్ధా పుష్పాంజలులను సమర్పింతము.

తల్లీ ! ఇంతకన్న నే నేమి మనవి జేసికొనగలను ? ఆశీర్వదించుము. ప్రతి మానవుని యందును నేను శ్రీరాముని దర్శించుకొందును గాక ! ప్రతి వ్యక్తి యందును రాష్ట్ర దేవతను సాక్షాత్కార మొనర్చుకొందును గాక ! నా పూజా యుపాసనలీ విధముగనే యుండును గాక, అని పలుకుచు హనుమంతుడు సీతా మాత పాదములకు వందన మొనర్చినాడు. సభ వారెల్లరును జూచుచుండగనే శ్రీరామ భగవానుడు తన యాజాను బాహువులతో హనుమంతుని లేవనెత్తి గాఢాలింగనముతో హృదయమునకు హత్తుకొనినాడు. అప్పుడు శ్రీరామా

ఆంజనేయులు ఏకాకారులైనట్లు రాముని విశాల వ్యక్తిత్వమునందు మహావీర హనుమంతుడు విలీనమై పోయినట్లుండెను.

పై నుదాహరించిన మాటలలో హనుమంతుడు తన హృదయము నందలి మనోభావములను పూర్తిగా గ్రుమ్మరించి తెలిపినాడు. ★ (చీల్చి చూపినాడను భావము) ఆ దివ్యాత్ముని రోమరోమము నందును కేవలము రాముడు, రాష్ట్రము, మానవత్వము మాత్రమే యున్నట్లు ఎల్లరును అనుభూతి నొందినారు. సర్వజనులు ఏక కంఠమున రాజా రామచంద్రునకు జయము, మహావీర హనుమంతునకు జయము అను నినాదము లొనర్చినారు. వెంటనే శ్రీరాముడు హస్తమును పైకెత్తి 'జయహనుమాన్, జయమహావీర, జయవజ్రాంగ యని నినదించినాడు. నేపథ్యమున "**వయంరాష్ట్రే జాగృయామ పురోహితాః**" యని ధ్వనించినది.

## ఉపసంహారము

మహావీరుడగు హనుమంతుని శుద్ధ చరిత్రను చదువుటచే 'అఖండ బ్రహ్మచర్యము, అనుపమ శౌర్యము, అప్రతిమానమగు నీతి మంతత్వము, దర్శనీయమగు రాజనీతిజ్ఞత, అలౌకిక పురుషార్థము, అకుంఠిత పాండిత్యము, అత్యుత్తమ బుద్ధి గరిమ, అద్భుత సమర్పణాభావము, అతులిత నమ్ర భావము, శాలీనత మున్నగు అనేక ఆర్యోచిత సద్గుణముల నొకే వ్యక్తి యందు గాంచవలెనన్న కేవలము పవనాంజనా మాత ముద్దులకు కుమారుడు, మహర్షి అగస్త్యుని ప్రియశిష్యుడగు మహా బలుడగు హనుమంతుని యందే గాంచగలము.

ఇంతటి మహత్వముగల చరిత్రను గూడ మన పురాణ కారులు వదలి వేయలేదు. అవతారవాదమును, అలౌకిక విషయముల నెన్నిటినో జేర్చి ఘోర

★ పౌరాణికులు హనుమంతుడు హృదయమును చీల్చి (కత్తితో కోసి) కాని రక్తము కారుచుండగా ఆహృదయములో సీతారాముల దృశ్యమును కనబడునట్లు కల్పించినారు. సాధారణజనులు అది నిజమే యని నమ్ముచున్నారు. ఇది అభూత కల్పన. హనుమంతునికి రామునిపట్ల గౌరవమును, రోమరోమమున దేశభక్తిని, మానవత్వానుభూతిని పొందిన భావము గలదు.

మగు అనర్థమొనర్చుట మహా దుఃఖకరమగు విషయము. మానవజాతికే మకుట మనదగిన ఈ మహాపురుషుని కేవలమొక పూజా వస్తువుగా చేసి మానవుడు తనలో నిక్కృష్ట స్వార్థ భావమును ప్రకటించుకొన్నాడు. ఈ యాదర్శ ఆర్య మహావీరుని 'వానర' శబ్దము నూతగాగొని భ్రాంతి వశమున సంపూర్ణమగు 'కోతి'గా చిత్రించునప్పుడు ఏమాత్రమైనా మానవత్వ బుద్ధి వివేకముల నుపయోగించిన ఎంతో బాగుండెడిది.

శ్రీరాముడు, మరియు నాతని సమకాలీనులగు హనుమంతుడు, సుగ్రీవుడు, రావణుడు మున్నగు వారి యథార్థ చరిత్ర మనకు కేవలము వాల్మీకి రామాయణమునందే లభించగలదు. వామ మార్గీయులు దానిని గూడ వదల లేదు. దాని యందును అనేక ప్రక్షిప్తముల జేర్చి కల్తీ చేసినారు. మనమే మాత్రము నిష్పాక్షికముగ నాలోచించినను ఈ చేర్పులు గుడ్డకు మాసిక వేసినట్లు వెంటనే పట్టుబడగలవు. వాల్మీకి రామాయణము మహా వీరుడగు హనుమంతుడు మరియు వాలి, సుగ్రీవుడు మున్నగు వారి వివరములు స్పష్ట రూపమున దెలియ గలవు. ఆ కాలమున సంపూర్ణ భారత వర్షమున నాలుగు మానవ వంశములుండె'' నని తెలియుచున్నది. అవి దేవ, ఆర్య, వానర, అసురవంశములు. వానికి తమ స్వంత రాజ్యములుండెను. ఈ విధముగ వానర రాష్ట్ర వాసులు వానరులని, అసుర రాష్ట్ర వాసులు అసురులని పిలువ బడు చుండిరి. ఇప్పటికిని భారతదేశము నందలి అనేకానేక స్థలములందు వానర, భల్లూక వంశపు క్షత్రియులున్నారు. రాజపుత్ర స్థానమునందలి యడవులందు అరణ్య ప్రాంత గ్రామములందుండు వారియు, ఉత్తరమధ్యప్రదేశ్ డేర్వా, ముణ్డా నామక జాతులు వారియు గోత్రములు 'వానర' గోత్రమే, రాజపుత్ర స్థాన 'కాంగ్డా' గ్రామారణ్య వాసులగు 'డోక్' జాతి వారిది 'భాలూ' (భల్లూక) గోత్రము.

ఒకప్పుడీ జాతిశక్తి విశ్వవిఖ్యాతమై యుండెను. మన భారత దేశము నే గాక బర్మా, శ్యామ్, మలయా, ఇండోనేషియా, కాంబోడియా, జావా, సుమత్రా, బోర్నియా, సింగాపూర్ (బర్మా) బాలీ, రూస్, గాంధార (కంధార్) ఆర్యన్ (ఈరాన్) మున్నగు దేశములందునూ ఈ జాతి వీరుల

యధికారముండెడిది. వాల్మీకి మహర్షి, హనుమంతునికి, వానర జాతికి అట్టి పరిశుద్ధ ఐతిహాసిక స్వరూపమునే ఇచ్చినారు.

## ౧. ఆదర్శ మానవుడు

హనుమంతుడు మహోనిష్ఠ గల ఆదర్శ మానవుడు. మానవత్వము గల సత్యమైన మానవుడై యుండెను. ఆతని విషయమున మహర్షి దయానందు లిట్లు వ్రాయు చున్నారు. ''మనుష్యు'' డనగా మనన శీలుడై స్వాత్మ వలె నితరుల సుఖ దుఃఖములను, లాభనష్టములను దెలిపికొని ధర్మాత్ముడగు బలహీనునికి భయపడుచు, అన్యాయ కారి బలవంతుడైనను వెరవకుండు వాడే అనగా, ''అనాథుడు, బలహీనుడు, దరిద్రు డైయున్నను ధర్మాత్ముడగు వానిని తన సర్వ శక్తులతో రక్షించుచు, ఆతని యున్నతికి పాటు పడుచు, ధర్మహీనుడు, క్రూరుడగు మహో బలవంతుడు, చక్రవర్తి యైనను అట్టి వాని సర్వ నాశనమునకు సర్వ శక్తులతో కృషి యొనర్చు వాడే మనుష్యుడు. ప్రాణములు పోయినను ఇట్టి అధర్మాత్ముల యెడ దయా దాక్షిణ్యము జూపరాద'' ని తెలిపినాడు.

మహర్షి దయానందులు నిర్ధారణ మొనర్చిన 'మానవత్వ' మను గీటు రాయిపై హనుమంతుడు సంపూర్ణముగ నిగ్గు తేలినాడు. మహోబలవంతుడై, అన్యాయ కారియగు వాలిని జేరక నిర్బలుడైన ధర్మాత్ముడగు సుగ్రీవుని పక్షమునే వహించి నాడు. అంతటి మహో విద్వాంసుడు, బలవంతుడు, నీతి మంతుడగు హనుమంతుడు వాలి పక్షమున నున్నచో అత్యున్నత స్థానమును పొంద గలిగెడివాడు. కాని భళిరా ! ఈ మానవత్వ పూజారి. అట్టి సమస్త సుఖోపభోగములను తన్నివేసి స్వేచ్ఛగా కంటకా కీర్ణమగు న్యాయ ధర్మములను వరించి చివర వరకు ధర్మాత్ముడగు సుగ్రీవుని మైత్రి యందే గడపినాడు.

## ౨. అఖండ బ్రహ్మచర్య వ్రతుడు

అఖండ బ్రహ్మచర్య సాధన. అట్టి సాధన ఫలమును ప్రజాహితము, జన హితము, జనకల్యాణము, రాష్ట్ర సేవ కొరకు సమర్పించిన కొలదిపాటి మహో పురుషులందు హనుమంతుని స్థానము అత్యంత మహత్వపూర్ణమై యున్నది.

మహాకవి నథూరాం, శంకర్ శర్మ తాను వ్రాసిన 'ప్రశస్తి పంచకము, నందు వీర వరుడగు హనుమంతుని బ్రహ్మచర్య సాధనను ఇట్లు వర్ణించి యున్నాడు.

**సుగ్రీవుకా సుమిత్రబడే కామ్ కా రహా ॥**
**ప్యారా అనన్యభక్త్ సదారాం కా రహా ॥**
**లంకా జలాయ కాలుఖలోంకో సురఝూదియా ।**
**మారే ప్రచండ్ దుష్ట్ దియాభీ బురఝూదియా ॥**
**హనుమాన్ బలీ వీరవరోంమే ప్రధాన్ హై ।**
**మహిమా అఖండ్ బ్రహ్మచర్యకీ మహాన్ హై ॥**

దీని తెలుగు అనువాద మిట్లుండును.:-

**సుగ్రీవుని కడు మిత్రుడు పవనుని సూనుడు వజ్రాంగుండూ ।**
**శ్రీరాముని అత్యంత భక్తుడు సుస్థిర కర్మరతుండూ ॥**
**కడలిని దాటి లంకజేరి జన కజను జూచి ముదమందే ।**
**మిడిసి పడిన రాక్షసుల జంపి పసిడి లంకను తెగ గాల్చే ॥**
**హనుమంతుడు వీర కోటి యందును వినుతులు బొందిన వాడు ।**
**అనుపముడఖండ బ్రహ్మచర్యమందతిస్తుతుల నొందినాడు॥**

## హనుమంతుని వీరశూరత్వము, నీతి, పాండిత్యము

హనుమంతుని నీతిమంతిత్వ ప్రథమ పరిచయము 'శ్రీరామ సుగ్రీవుల మైత్రిని సంఘటిత పరచు రూపమున మనకు ప్రత్యక్ష మగుచున్నది. తన బుద్ధి చాతుర్యము, వాక్కౌశలము, సమయస్ఫూర్తి, మరియు పాండిత్యముల వల్ల నాతడు శ్రీరాముని చక్కని ప్రభావితమొనర్చినాడు. ఈ ప్రభావమే శ్రీరాముని సుగ్రీవుని మైత్రి బంధనమున బంధించుట మనమెరిగినదే.

లంకా ప్రవేశము, మరియు సీతా సందర్శనమును కార్య సిద్ధి యందు హనుమంతుని బుద్ధి కుశలత్వము సర్వ విదితము. రావణుని వంటి చోర్భల శత్రు కోట యందు ప్రవేశించి సఫలీకృతుడై మరలి వచ్చుట వంటి ఘనకార్య

ము హనుమంతుని యసాధారణ బుద్ధి వైభవమును పరిచయము జేయుచున్నది.

సీతను గుర్తించుట, తన విషయమున నామెకు సందేహము రానీయకుండుట, అశోక వన ధ్వంసము, అసంఖ్యాక మహావీరుల నంత మొందించుట, లంకా దహనము వంటి సాహసములు, రావణ పేరోలగమున ప్రదర్శించిన బలము, శౌర్యము, బుద్ధి ప్రతిభ మున్నగునవి అద్వితీయములై యున్నవి. ఇంతటి మహా గుణములుండి యున్నను 'అభిమాన' మనునది యాతని ఛాయలకే రాకుండెను. ఆతడు నిగర్వి సేవా భావమూర్తి. కొండొక కార్య సాధనము నందెవ్వరును సాహించ లేనప్పుడు మన హనుమంతుడే యట్టి సేవా కార్యములందు తత్పరుడై యుండువాడు.

సంజీవనీ మూలికను దెచ్చి తన వారందరి ప్రాణములను రక్షించినవాడు హనుమంతుడే గదా ! దౌత్యకర్మ యందాతడు అందెవేసిన చేయి. సేవా భావ కారణమున నాతడు 'రామసేవకుడు, రామదూత' యను ఖ్యాతిని వడసి స్వామి ప్రశంసల నందికొనినాడు. శ్రీరాముడు హనుమంతుని ప్రశంసించుటయే గాక ఆతని యెడ కృతజ్ఞతా భావము గలిగి యుండెడివాడు. నిజముగ నిట్టి యాదర్శ మహా మానవుడే రాష్ట్రమునకు, సంస్కృతికి గౌరవనీయుడు.

## 3. హనుమంతుడు కోతిగాదు, మహామనీషి

### ఒక సరళ వివేచనము

వీరవ్రతుడగు హనుమంతుడు, వాలి, సుగ్రీవుడు, అంగదుడు మున్నగు వారెల్లరును కోతులు గారు, మానవులేయనుటకు వాల్మీకి రామాయణ ప్రమాణములను గాంచుడు.

౧. హనుమంతుని సంభాషణమును విని శ్రీరాముడు లక్ష్మణునితో నిట్లని నాడు.

'' ఈతడు ఋగ్యజుస్సామాథర్వ వేదములను చక్కగా నభ్యసించుటే గాక వ్యాకరణముపై చక్కని యధికారమును సంపాదించి యున్నాడు. (కిష్కింధ సర్గ - 3-౨౮).

౨. శ్రీరామ సుగ్రీవుల మైత్రి సమయమున హనుమంతుడు యాజ్ఞిక

బ్రాహ్మణుల వలె అరణుల నుండి అగ్నిని చేసి హవనకుండమును స్థాపించినాడు.
(కిష్కింధ కాండ ౫-౧౪)

౩. హనుమంతుని జననీ జనకులగు అంజనా పవనులు కోతులు గాక ధార్మిక పురుషులే యైయుండిరి. మానవుల సంతానమెప్పుడును పశు పక్ష్యాదులు గాజాలరు. (కిష్కి ౬౬-౮)

౪. వర్షాకాలానంతరము రాజ భోగములలో మునిగి శ్రీరామ కార్యమును మరచియున్న సుగ్రీవుని గాంచి సీత నన్వేషించుటకు మహా మంత్రి బాధ్యతతో హనుమంతుడు సుగ్రీవున కొనర్చిన ఉపదేశములొక వేద విద్వాంసునకు దప్పఅన్యులకు సాధ్యమా ? (కి.౨౮-౮-౨౭)

౫. సీతతో సంభాషించుటకు హనుమంతుడు లంక యందలి అశోక వనమున ప్రవే శించినాడు. హనుమంతుని రావణుడు గాదలచిన సీతాదేవి యతనితో సంభాషించుటకు సంకోచించినది. కాని హనుమంతుడు "నేను శ్రీరామ దూతనై వచ్చితిని. రాక్షసులు గుర్తించెదరను భయము వల్ల రాత్రి పూట లంక యందు ప్రవేశించితి" నని విశ్వాసము గలిగించగ సీతాదేవి సంతసముతో తన విశ్వాసమును ప్రకటించినది. (కిష్కి. ౨౮-౩౫)

(దీనివల్ల 'హనుమంతుడు కోతిగాదు. మహామనీషి' యని యెరుగ వలయును. ఒకటి హనుమంతుడు కోతియగుచో యాతని జూచిన 'రావణు' డను భ్రమ గలుగవలదు. రెండవది: హనుమంతుడు లంకయందు రాత్రిపూట ప్రవేశించడు. ఏలన; పశుపక్ష్యాదులన్నియును పగలే నెలవులకు జేరునుగదా! మరి నగర గూఢచారులు ( C.I.D. ) లు విదేశీయ పురుషులనే పరీక్షింతురు గాని పశుపక్ష్యాదులను గాదుగదా!)

౬. సీతతో హనుమంతుడు సంస్కృత భాషయందే శ్రీరాముని యశోగానమొనర్చి నాడు. ఇట్టిది కోతులకు సంభవమేనా ? (కిష్కింధాకాండ ౨౮-౩)

౭. శ్రీరాముడు హనుమంతునికి తన కృతజ్ఞతలను దెలుపగ నాతడు శ్రీరామునిని నీవు పురుషోత్తముడ" వని యనినాడు. ఈ ప్రయోగము కోతులకు సాధ్యమైనదేనా ? (కి.౧-)

౮. హనుమంతుడు ద్విజాల వలె వేద మంత్రములతో" సంస్కారము చేయుట, మేయించుట, శ్రీరాముడు వాలితో "సంభాషించుట, సుగ్రీవుని సందేశము, అంగదుని సందేశము పోవుట, మరియు ధర్మ శాస్త్రానుసారము తమ్ముని స్త్రీతో బలాత్కార సంబంధము గలిగించుట" నను యపరాధమునకు వధారూపమగు దండన, ముఖ్యముగ వానివల్ల వీరెల్లరును కోతులుగాదనయే స్పష్ట మగుచున్నది.

౯. ''రావణుడు యుద్ధమునకై వచ్చినపుడు వాలి సముద్ర తీరమున గూర్చుండి ''సంధ్య'' నొనర్చుకొనుచుండె'' నని ఉత్తర కాండమున వ్రాయ బడి యున్నది. ఇందువల్ల ''వాలి సాధారణ పురుషుడే గాక వైదిక ధర్మము నెరిగిన మహారాజై యుండెననియు తెలియుచున్నది. (ఉత్తర కాండ. సర్గ ३४)

౧౦. వానర జాతి సూర్య వంశ వృక్షమునుండి విడిపోయిన శాఖయేయై యుండెను. ఏలన, వారి వంశములో **''అంశుమంతుడు, సూర్యవంశి''** యని వాల్మీకి రామాయణమున పలుచోట్ల పేర్కొనబడి యున్నది, (వా. రా. కిష్కి. సర్గ ४-౧౬)

౧౧. సుగ్రీవుని భాస్కరాత్మజ **''సూర్యపుత్రో మహావీర్యః''** అను విశే షణములలో సంబోధించబడినది.

౧౨. వాలి మరణించినప్పుడాతని భార్య ఆతనిని '' ఆర్యపుత్ర'' అని సంబోధించుచు విలపించినది.

**సమీక్ష్యయం వ్యదితా భూమౌ సంభ్రాన్తాని పాతమా।**
**సుప్త్వేవ పునరుత్థాయ ఆర్యపుత్రేతి చోదతి ॥** వా. రా. కి. ౨౦-౧३॥

౧३. సుగ్రీవుని కోతిగా దలచువారు వాల్మీకి రామాయణమును జదివి ''కోతుల కెచ్చటనైన వేద వేత్తలగు బ్రాహ్మణులు మంత్రులుగ నుండగలరా''? యను విషయముపై కొంత తార్కిక బుద్ధితో నాలోచింపవలయును. (కిష్కి. ३ -౨౬-३४)

౧४. శ్రీరామచంద్రుని వంటి మహాయోధుడు, విద్వాంసుడు కోతు లకు శరణాగతుడై వెళ్లగలడా ? (కిష్కింధాకాండ ४-౧౮-౧౯)

౧౫. వేద మంత్రములతో అగ్ని హోత్రమొనర్చి కోతులు మైత్రిని దృఢ మొనర్చు కొనగలవా ? (కిష్కి ౫-౧౪-౧౬)

౧౬ కోతులందు శాస్త్ర విధిగ పాప పుణ్యముల మర్యాద నెచ్చట నైనను జూడ గలమా? (కిష్కిం. ౧౮-౪-౪)

౧౭. కోతుల రాజ్యాభిషేకమున "రత్నములు, దూపదీపములు, ఓషధీ మిళిత జలముతో స్నాన మొనర్చ జేయుటను, హవన యజ్ఞాదుల సహితముగ, వంశానుగతము సంస్కారములను జరిపించుకొనుట" యను నవి యుండునా? (కి.౨౬-౨౪)

౧౮. ఏ కోతినైనను 'ఆర్య' అని యనగలమా ? (కిష్కిం. ౫౫-)

౧౯. ఎచ్చటనైనను కోతులందు "తార, రుమ, అంజన, పద్మరాగ, కేతుమతి" వంటి నామములు అంతటి పతివ్రతలగు స్త్రీలుండుటను జూడగ లమా? కోతుల భార్యలు కోతులమ్మలుగా గాక మానవ స్త్రీలుగా నుండగలరా? (కిష్కి. ౩౫-౩౫)

౨౦. వాలిమహారాజు అంత్యేష్టి కర్మానంతరము అంగదునికి నూతన యజ్ఞోపవీత ధారణ "**తతోఽ ఐన్ విధివద్వాపోఽ పసవ్యంచ కారహ**" జరి గినది (కి.౨౫-౫౦)

౨౧. కోతుల నెచ్చటనైన, ఎప్పుడైన విద్వాంసుల సభలకు, రాజ సభ లకు బిలుచు కొనెదరా ? (ఉత్తరా కాండ. ౪౦)

౨౨. 'హనుమాన్ చాలీసా' ను ప్రతిదినము పారాయణ మొనర్చు విద్వాం సులు "**కాంధే మూంజ్ జనే ఊథాజై**" యని చదువుచు ఆర్య రత్నమగు మహా వీర హనుమంతుని 'కోతి' అని యనుకొనుట దుస్సాహసము గాదా ?

## ౪. తులసీదాసుగారి దృష్టిలో వజ్రాంగుడు

గోస్వామి తులసీదాసు గారు పౌరాణికుల ప్రభావమునకు లోనై ఆర్య జాతి మకుట మణియగు హనుమంతుని, వాలి సుగ్రీవాది అన్య వానర వీరు లను తోకలు గల కోతులని విశ్వసింపజేయుటకు ప్రయత్న మొనర్చినారు. కాని ఏ చారిత్రక ప్రకరణములందును వారు సత్యమును మరుగు పరచలేక పోయినారు.

ఆతని ప్రసంగము లందాతని కథనము లాయన ద్వారానే ఖండించ బడినవి, పాఠకులాలోచించుటకై కొన్ని విషయములు సంక్షేపముగా నిచ్చుటనుదాహరింపబడినవి.

౧. వానరుల రాజ్యముండెనని, దాని రాజధాని కిష్కింధయని, రాజు వాలియని, మంత్రి మండలి (పరిషత్తు) యుండెనని స్వయముగ గోస్వామి తులసీదాసు గారు ఒప్పుకొనినారు. పై విషయములు కోతుల జాతి యందు సంభవమేనా ?

౨. మానవుల వలె కోతులందు అన్నదమ్ముల, భార్యాభర్తల శ్రౌతాచార సంబంధము లుండగలవా ?

౩. **''అనుజవధూ భగినీ సుత నారీ''** యను శ్రీరామోక్తిని కోతుల విషయమున సమన్వయించ గలరా ?

౪. మానవుడగు శ్రీరామునితో, **''పావక సాఖీ రాఖికర్ కిన్హీప్రీతి దృఢాయీ''**- యజ్ఞాగ్నిని సాక్షిగ నుంచి చేసికొనిన మైత్రి 'కోతి' యనబడు సుగ్రీవునకు సంభవమా ?

౫. ఇట్టి యజ్ఞ కార్యమును బ్రహ్మగా నిర్వహించిన హనుమంతుడు ''కోతి'' యగునా?

౬. **''విప్ర రూపుధరి కపిత హఁగయ ఊ''** యను గోస్వామిగారి ఈ వచన భావమేమి? ఒక కోతి తిలకమును ధరించి, ఉత్తరీయమును దాల్చి, చంక యందు గ్రంథము నుంచుకొని బ్రాహ్మణ వేషమును వేయగలదా ? వాల్మీకి వచనాను సారము శ్రీరాముడు హనుమంతుని విషయమున ''చతుర్వేద పండితుడు, లేశమాత్ర వ్యాకరణ దోషము లేని శబ్దోచ్చారణగల బ్రాహ్మణు'డనునది కోతి (పశువు) విషయమున శోభించగలదా ?

౭. **''విప్రకహహు నిజకథాబుఝా ఊ''** వేశము దాల్చిన కోతిని శ్రీరాముడు గుర్తించలేక పోయినాడా ?

౮. కోతుల భార్యలు, తార, రుమ, అంజన వంటి విదుషీమణులుండ గలరా ? పురుషులకు తోకలు ఉన్నప్పుడు స్త్రీల కెందులకు తోకలు లేవు?

౯. ''క్షితి, జల, పావక, గగన, సమీరా'' యను శ్రీరాముని యుప దేశము ''కోతి'' యగు తారకు సంబంధించనదేనా ?

౧౦. ''మృతక కర్మ విధివతు సబకీన్హా'' వాలి యొక్క యంత్యేష్టి కర్మ వైదిక విధిగా రాముని ద్వారా సంపన్న మొనర్చబడినది. ఈ విషయము వాలిని కోతి యనియే తెలుపు చున్నదా?

౧౧. సుగ్రీవుని పట్టాభిషేకము, అంగదుని యువరాజ్యాభిషేకము దైవ జ్ఞులగు బ్రాహ్మణుల ద్వారా లక్ష్మణుడు కోతులకే చేయించినాడా ? చూడుడు:

**''లక్ష్మణ తురతబులాయే', పురజన విప్రసమాజ్**

**రాజదీన్హ సుగ్రీవకహఁ అంగద కహఁ యువరాజ్ ।**

౧౨. కోతులందు వాలి, సుగ్రీవుడు, హనుమంతుడు, అంగదుడు మున్నగు చక్కని నామములుండగలవా ?

౧౩. మహాబలశాలియగు రావణుని నిర్జించిన వాలిని ఒక 'కోతి' అని యనగలమా?

౧౪. సీతాన్వేషణ కార్యము నందంతటి చతుర సాహసమును ప్రద ర్శించిన హనుమంతుని 'కోతి' యే యందుమా ?

౧౫. పశువగు వానరము వివిధాస్త్ర శస్త్ర ప్రయోగ ప్రవీణత నొంది యుండగలదా?

౧౬. కోతుల భార్యలు కోతులమ్మలు గాక మానవ స్త్రీలై యుండగలరా?

౧౭. సాగర సేతువు నిర్మాతలు నలుడు, నీలుడు కోతులే యై యుండిరా?

## దిగువ విషయములపై నాలోచించుడు

౧. ఇంతవరకు వివరించిన విషయములపై పునః ఆలోచించుడు. ''లంకా ప్రవేశమునకు పూర్వము వానర సైనిక వాస్తు శాస్త్రజ్ఞులు (Engineers) నలుడు, నీలుడు, ఇంతటి విశాలమగు సేతువారధిని ఎంతో నైపుణ్యమున నిర్మించినారు. అట్టిది కోతుల ద్వారా సంభవమే యగునా ? వాల్మీకి రామా

యణము నందీ నిర్మాణమును గూర్చి విపులముగ వర్ణింపబడి యున్నది. దీని వల్ల "వానర జాతి వీరులు అత్యద్భుత వైజ్ఞానికోప కరణముల విశాల భారవాహక యంత్రముల నెన్నింటినో ఇట్టి నిర్మాణములందుపయోగించు చుండి" రని విదితమగుచున్నది.

**హస్తి మాత్రాన్మహాకాయాః పాషా నాన్చ మహో బలాః**

**పర్వతాం శ్చ సముత్పాట్య మన్త్రైః పరి వహన్తిచ ॥ వా.రా.యు. ౨౨-౬౦॥**

**సూత్రాణ్యన్తే ప్రగ్రహణాన్తి హ్యాయతే శత యోజనమ్॥ వా.రా.యు.౨౨.౬౨॥**

ఇచ్చట యంత్ర, సూత్ర, దణ్డము మొదలగు వాని ప్రయోగ వర్ణనము వల్ల స్పష్టమగున దేమన శిల్ప విద్యా మహా నిపుణుడగు నలుడు, నీలుడు, ఈ సేతువును నిర్మించి యుండిరి. కావుననే దీనికి "నలసేతు" వను నామము గలదు. బంధువులారా! ఆలోచింపుడు. ఈ నిర్మాతలగు నల నీలుడు వాలము గల కోతులేయై యుండిరా ?

౨. ఆధ్యాత్మ రామాయణము నందలి ఈ ప్రసంగము పైనను ఆలోచించుడు. శ్రీరాముడు తన యాగమనమును గూర్చి హనుమంతుని ద్వారా పంపిన సందేశమును వినిన భరతుడు ఈ ప్రాణ ప్రథమగు అమృత వాక్యలకు హర్షితుడై,

**" ఆలింగయ భరత శీఘ్ర మారుతి ప్రియవాదినమ్।**

**ఆనందాశ్రుజలైః... సిశేచ భరతః కపిమ్ ॥ ఆ.రా. ౧౪-౧౯॥**

**దేవోవామానుషోవాత్వా మను క్రోశాది హాగతః।**

**ప్రత్యాఖ్యా నస్యతే సౌమ్య దదామి బ్రువతః ప్రియమ్ ॥ ౧౪ -౬౦॥**

**గవాంశత సహస్రన్చ గ్రామాణంచ శతంవరమ్ ।**

**సర్వాభరణ సంపన్నా ముగ్ధా కన్యాస్తు శోడషా "॥ ౧౪ -౬౧॥**

హనుమంతుని ద్వార భరతుడు శ్రీరామచంద్రుని యాగమన సమాచారమున వినిన వెంటనే హనుమంతుని, గట్టిగా కౌగలించుకొని ఆనందాశ్రు ప్రవాహముతో గద్గదిక స్వరమున "ప్రాణ ప్రథమగు సోదరా ! నీవు దేవుని

వంటి మనుష్యుడవు. ఎంతో దయతో నిచ్చటికి వచ్చి ఈ శుభ సందేశమును వినిపించి నందులకు నీకు నేనెట్టి ప్రతిఫల మీయగలను ? నా జీవితమున నింత కన్న శుభ సందేశము మరేదియునుండ జాలదు. దీనికి సరియగు ప్రతిఫలము నిచ్చు సమర్థత నా యొద్దలేదు. ఐనను నేను నీకు ఉత్తమ లక్షణములు గల ఒక లక్ష గోవులను, మంచివగు వంద గ్రామములను సు సజ్జితులు, సకలాభరణ భూషితులు, అత్యంత సుశీలురు, సుకుమారులు, సౌందర్య వంతులు, దేవ కన్యల వంటి పదహారుగురు కన్యలను పురస్కార రూపమున సమర్పించుకొందును. శ్రీరామ ప్రభువు కుశల పూర్వకముగ నిచ్చటకు విజయము చేయుచున్న విష యమును సవిస్తరముగ దెలుపుము'' అని పలికినాడు.

మన మాలోచించ వలసిన విషయమేమన, భరతుడు మొట్టమొదట హనుమంతుని 'నీవు దేవుడు వంటి మానవుడు, వని యనినాడు. కాని కోతి, లేక పశువని యనలేదు. (హనుమంతుడు కోతి యగుచో నాతని కొరక లక్ష గోవుల నిచ్చుట వలన ప్రయోజనమేమి ? కోతులు గోవులను పోషించ గలవా? హనుమంతునికి భరతుడీయదలచిన చక్కని వగు వందగ్రామములు మాటయేమి? వానిని పెరికి పాడొనర్చుటకా ? ఇక చక్కగ నలంకరించబడియున్న దేవకన్యల వంటి పదహారు గురు కన్యలను ఈ తోక గల కోతికిచ్చిన లాభమేమిటి ? భర తునికి మతిభ్రమణము వంటి వికారమేదైన గలదా ? కాకున్న మహా సౌందర్య వతులను కోతికి సమర్పించి వారిని దుర్గతి పాలొనర్చగలడా ? కోతియగు హను మంతుడు ఆ కన్యల పరికిణీలు, వస్త్రములు మున్నగు వానిని చింపి పీలికలు జేసి వేయడా ? నేటి వరకు ఈ ప్రపంచము నందెవ్వరైన కోతుల కిట్టి దానముల నొసర్చి యుండిరా ? కావున హనుమంతుడు కోతి యెట్లగునో యాలోచిం చుడు) ★

వాల్మీకి రామాయణమునందలి యీ దిగువ విషయములపై పునః ఆలో చించుడు. యుద్ధారంభమున సైన్యమంతటికి శ్రీరాముని పక్షమున ఈ క్రింది

★ మా అభిప్రాయమున నిది ప్రక్షిప్తమే యై యున్నది. కాని పౌరాణిక బంధువులు దీనిని యథార్థమనియే నమ్ముచున్నారు.

సుస్థిరమగు నాజ్ఞలు ఈయబడినవి.

"యుద్ధానంతము వరకును మన వానర సైన్యమునకు స్వజాతివేషమే (Dress) యుండవలయును, కాని మానవ వేషములనెప్పుడును వేయరాదు. నేను, లక్ష్మణుడు, మరియు నలుగురు మంత్రులు, మరియు విభీషణుడు ఈ యేడుగురము మాత్రమే మనుష్య వేషమున యుద్ధమొనర్చెదము". ఇది స్థిర మైన యాజ్ఞ. కావున యుద్ధాంతము వరకును ఈ యాజ్ఞ పాటించబడినది. దీనితో మనకు మనుష్యులు, వానరులు, రాక్షసులు కేవలము వేష భూషణము లలోనే భిన్నమై యుండిరి. కాని శారీరకముగ వీరెల్లరును మానవులుగనే యుండి రని స్పష్టమగు చున్నది గదా!

ఈ విధముగ మనము ఆద్యంతములు వివేచనాత్మకముగా, గంభీర ముగ నాలోచించినచో మహావీరుడగు హనుమంతుడు మానవకుల భూషణుడు, పురుషపుంగవుడే యైయుండెననియును, కోతి, లేక పశువు గాదనియు విశద మగును.

హనుమంతుని తోక గల కోతిగ చిత్రించి మనవారు స్వయముగ మోస పోవుటయే గాక ప్రపంచమును సైతము మోసపుచ్చినారు. ఇట్లొక మహాపురు షుని పట్ల ఘోరాపచారము, మరియు అన్యాయమే చేయబడినది.

పౌరాణిక గణము, పూజారి వర్గము, భక్త సమూహము హనుమంతుని దేవతగా నమ్మెదురు. పూజించునపుడు హనుమంతుని విగ్రహమునకు మకు టమును ధరింపజేసి 'రామనామ' మను తిలకమును బెట్టుదురు. మెడలో హారము, పుస్తకము, భుజములందు తాయెత్తులు, లంగోటి, ధోవతి, ఉప వస్త్రము, యజ్ఞోపవీతము, నడుమునకు పట్కా, పాదములకు అందెలు, భుజ ముపై పెద్ద గదను ధరింపజేసి మనము తరచుగ శిలామూర్తులందు జూచు చున్నట్లే యలంకరింప జేయుదురు. ఈ శృంగారములన్నియు నేలజేసెదరో, దీనివల్ల కోతి శోభయేమైన వృద్ధి యగునా? మీరే యాలోచించుడు. బంధువులారా! వివేకముతో కార్యమొనర్చుడు. మన మహాత్ములగు పూర్వ పురుషుల నవమా నము, అనాదరణ జేయునట్టి పాపములొనర్చకుడు.

## ఒక శంక దాని సమాధానము

**శంక : హనుమంతుడు కోతిగాకున్నచో సహజముగా కోతుల నామము లే యగు వానర, కపి, ప్లవరుడని యేల యందురు ?**

**సమాధానము :** హనుమంతుడు మొదలగు వారి యీ పేర్లన్నియు గుణకర్మల ననుసరించి యున్నవి. మనమీ సందేహములను ''శబ్ద కల్పద్రుమము, శబ్దార్థ చింతామణి, పద్మ చంద్ర, శబ్దస్తోమ మహానిధి, వాచస్పత్య బృహద్వి ధానము, మున్నగు ప్రఖ్యాత సంస్కృత నిఘంటువులందలి యర్థములను జూచి, సందేహములు తీర్చు కొనవచ్చును.

౧. **ప్లవగ :** 'ప్లవగ' యనగ నౌక, లేక నీటి యందీదు సాధనము. 'ప్లవ' యనగా దాని యర్థము జలతరణ సాదనము. ముణ్డకోపనిషత్తు (౧.౨-౭)

౨. **వానరము :** అనగా, వనము నందలి ఫలపుష్పములు మున్నగు వానిని దిను వారు నిరామిషులు, శాకాహారులు, ఆర్యులు అనునర్థములగును.

**''వనేభవం వానం, వానంరాతి గృహణాతేతి వానరా''.**

౩. **కపి :** అనగా, **''కంజలం పిబతీతి, కాత్ ఆత్మానం పాతి, రక్షతీతి పాతి, కం పతే పాపాత్ సదావాం కపి''.**

మద్యము మున్నగు వస్తువులను ద్రాగక జలపాన మొనర్చునట్టివారు. సముద్ర జలమందును స్వాత్మరక్షణ మొనర్చుకొనువారు. సదాపాపములకు భయ పడు నట్టివారు. 'కపి' యనబడుదురు. ఈ గుణములన్నియును హనుమం తుని యందు గలవు. సంస్కృత సాహిత్యమున 'కపి' యను పదమునకు సూర్యుడు, శిలారసము మున్నగు నర్థములు లభించుచున్నవి. 'హనుమంతు' డను పేరు ఆతని 'హను' అనగా పెదిమలు ( ఓష్టములు) గడ్డము (గదువ, దౌడ) ను బట్టి యుంచబడినదని మనము పాఠాంతరమున జూచి యున్నాము. ఆతని 'హనువు' కొంత పొడవుగను, మరియు విచిత్రముగ నుండెను.

అనేకుల యభిప్రాయము ననుసరించి 'ప్లవగ' యను దానికి పెద్దగా గంతులు వేయుచు నడచు వారని యర్థము. ఏలన, ఈ జాతి వీరులనేకులు కోతుల వలె పెద్ద పెద్ద యంగలతో గెంతుచు పరుగెత్త గలుగుచుండిరి. కావునే

వీరిని 'ప్లవగు' లని యనినారు. ఇప్పటికిని యనేకులు వీరులను గాంచి సింహము, పిరికి వారిని జూచి 'నక్క' యను బిరుదములతో బిలుచు చుండుటను జూచు చున్నాము. ఇట్లే చంచలమగు స్వభావము గలవారిని 'కోతి' యని సంబోధించుటయును మనము జూచు చున్నాము.

## ౬. పురాణ కర్తల నికృష్ట కృత్యము

పురాణములందు ఉపయోగమైన దేదియును లేదని మేమనుట లేదు. అందు శిక్షా ప్రదములు, నీతి దాయకములగు ననేక కథలు, కథానికలు, ఆఖ్యానములు గలవు. కాని పురాణముల మూల దృక్కోణము ఎంతయో వికృతముగ నున్నది. విషముచే కలుషితమైన అన్నమును, మిఠాయిని వదలి వేయునట్లు నిశ్చయముగ వానిని వదలి వేయవలయును.

పురాణములందనేక ఋషులు, మహర్షులు, మునుల, మహాపురుషుల యెడ విశేషించి మన మహా యోగేశ్వరుడగు శ్రీకృష్ణుని పట్ల అవమానకరము, నింద నీయములగు కల్పనలను ప్రవేశ పెట్టి మహాపాపము నొనర్చి నట్లే మన ఆర్యజాతి మహా పురుషుడు, మహావీరుడగు హనుమంతుని యుత్పత్తి కథను గూడ ఎంతయో అసహ్య, నికృష్ట రూపమున చిత్రణ మొనర్చబడినది. మేమీ పవిత్ర గ్రంథమున ఆ ఘోర, అసహ్య, మహా అశ్లీల, జుగుప్సాకరములగు విషయములను ప్రవేశ పెట్ట దలచ లేదు. కాని కేవలము సంకేత మాత్రముగ భవిష్య పురాణ అతి సర్గమున నాల్గవ పర్వము, ప్రథమాధ్యాయము నందలి ౩౨ నుండి ౪౧ వరకు గల శ్లోకముల భావము నిట వ్రాయుచున్నాము.

" ఒకనాడు శివుడు మానస సరోవర ప్రాంతము నందలి పర్వతముల వైపునకు వెళ్లినాడు. ఆ ప్రాంతముననే "కేసరి" యను వీరుని భార్య 'అంజన' నివసించు చుండెను. శివుని తేజము (వీర్యము) కేసరి నోటియందు ప్రవేశించినది. దాని ప్రభావమున కేసరి కామాతురుడై అంజనాదేవితో సంభోగ క్రియలు సలుప సాగినాడు. ఇదే యదనుగ వాయువు గూడ కేసరి శరీరమున ప్రవేశించినాడు. దాని ప్రభావమున నాతడు పండ్రెండు సంవత్సరముల వరకు

అంజనాదేవితో సంభోగ మొనర్చ సాగినాడు. ఇంతటి దీర్ఘకాలమైథునము వల్ల అంజనాదేవి గర్భము ధరించినది. ఒక సంవత్సరము గడచిన పిదప అంజనాదేవి వానరుని వంటి అత్యంత కురూపియగు బాలుని ప్రసవించినది. అంజనామాత వాని నుంచుకొన సహించక పారవైచినది. బాలుడైన హనుమంతుడు బల పూర్వ కముగ సూర్యుని బట్టుకొని మ్రింగి వేసినాడు. దేవేంద్రుడచ్చటికి దేవగణముతో వచ్చి తన వజ్రాయుధముతో హనుమంతుని గొట్టినాడు. వజ్రాఘాతము నొంది యును ఆతడు సూర్యుని వదలి వేయ లేదు. అపుడు సూర్యుడు భయకంపి తుడై ''త్రాహి, త్రాహి, కాపాడుడు, కాపాడు'' డని మొర పెట్ట సాగినాడు. ఐనను హనుమంతుడాతని దీన దశను వినిపించుకొనలేదు. సూర్యుని విడువ లేదు. సూర్యుని రోదనము, త్రాహి వచనములను విని రావణుడు వచ్చి హను మంతుని తోకను బట్టి లాగినాడు. దానిపై హనుమంతుడు సూర్యుని వదలివేసి మహాక్రుద్ధుడై రావణునితో యుద్ధ మొనర్చ సాగినాడు. ఒక సంవత్సరము వరకు యుద్ధము సాగుచునే యుండినది. చివరకు రావణుడోడి పారిపోయినాడు''.

ఇక శివ పురాణము నందలి రుద్ర సంహితలోని ఇరువదవ యధ్యా యమునకు సంబంధించిన 3 నుండి 6 శ్లోకములందు వర్ణింపబడియున్న హను మంతుని ఉత్పత్తి గాథను చదువుడు. '' ఒకనాడు శివుడు విష్ణు భగవానుని మోహినీ రూపమును గాంచి, కామదేవునికి లోబడి నిగ్రహించుకొనలేక మోహినీ రూప విష్ణువుతో సంభోగించ సాగినాడు. చివరకు మోహినిని గాంచక వివశుడై తన వీర్యమును పతనమొనర్చినాడు. అప్పుడు శివుడాలోచించి శ్రీరామ కార్య మును హేతువుగ గొని సప్తఋషుల కాజ్ఞనీయగ వారా వీర్యము నొక యాకుపై స్థాపన మొనర్చి దానిని గౌతముని కూతురగు అంజనాదేవి చెవిలో వేసినారు. ఆమె చెవియందుంచిన వీర్య ప్రభావము వల్ల మహాబలశాలి, పరాక్రమ శాలి యగు హనుమంతుడు జన్మించి నాడు. ''ఇది శివ పురాణము నందలి హను మంతుని జనన గాథ.

భవిష్య మరియు శివపురాణ రచయితలారా ! మీరు ధన్యులు. పాఠక సోదరులారా ! దయతో మీరీ సారాయి రాయుళ్ల మహా నిర్వాకము పై నాలో చించుడు.

ఓ భగవంతుడా ! ఇది యెంతటి యభూత కల్పనా వైచిత్ర్యము ? వీనిని వ్రాసిన రచయితలు ధన్యులు! వ్రాయునపుడు వారికే మాత్రమైన సంకోచ మేల గలుగ లేదో ! ఈ భూగోళము కన్న సూర్యగోళము 13 లక్షల రెట్లు పెద్దది. అంత పెద్ద సూర్యగోళమును ఈ భూమిపై అప్పుడే జన్మించిన శిశు వొకడు ఈ భూగోళము నుండి దాదాపు తొమ్మిది కోట్ల మైళ్ల దూరమునం దుండి 10 ఖర్బుదముల మైళ్ల వరకు తపనము గలిగించు చున్నట్టి సూర్యుని మ్రింగ గలడా? ఆ శిశువు సూర్యుని తన పొట్ట యందెట్లిముడ్చుకొనగలిగినాడు? భళీ రచయితా ! ఆలోచన లేకుండా ఈ యభూత కల్పనలను విశ్వసించుచు న్నట్టి ఆంజనేయ భక్తులారా ! భళా భళి!!

బంధువులారా ! ఈ విషయముపై విస్తృతముగ సమీక్షించు నవసరము లేదు. మహా దౌర్భాగ్యమేమన విజ్ఞాన వేత్తలు, మహా పండితులని యనిపించు కొన బడుచున్న నేటి విశ్వ విద్యాలయ విద్వాంసులు తమ విద్యార్థులకు ''సూర్యుడు పృథివి కన్న 13 లక్షల రెట్లు పెద్దగా నుండి తొమ్మిది కోట్ల మైళ్ల దూరమున నుండి 10 ఖర్బుదముల (వేయి అర్బుదముల కొక ఖర్బుదము) మైళ్ల వరకు తన తపనమును గలిగించుచు అనేకానేక బ్రహ్మాండములను ధరించి, సకల ప్రాణులకు ప్రాణ దాతయై యున్నాడని బోధించుచున్నట్టి వారే తమ గృహ ములందు స్నానము లాచరించి ఎంతో శ్రద్ధా భక్తులతో హనుమంతుని స్తుతి యొనర్చుచు **''బాల సమయరవి భక్షతి యేత బలీన హు. లోక బయోఅంధి యారో''** అని భజన మొనర్చు చుండెదరు. ఇంతవరకు రాగానే వారి విద్వత్తు సంపూర్ణముగ సమాప్తమై పోవుచున్నది. ఇట్టి మూర్ఖపు పాఠముల నొనర్చుటకు లేశమైనను శంకించరు. ఇంతటి విద్వాంసులే ఇట్టి యజ్ఞాన మును ప్రచారమొనర్చు చుండిన నిక భగవంతుడే దయ దలచవలెను.

విదుషీ రత్నములగు మాతృ దేవతలారా ! మీరైనను ఆలోచించ రెందులకు? జాతి నిర్మాణమున బాధ్యత మీ పైననే గలదను విషయమును విస్మ రించినారా ? ప్రపంచమున సత్యప్రచారమొనర్చుటకు ఈశ్వరుడు మన యందరకు సద్బుద్ధిని ప్రసాదించు గాక.

**''ధియోయోనః ప్రచోదయాత్''**

ఓమ్ శమ్

## వైదిక సిద్ధాంత పరిచయము

సంకలనకర్త : మాలే నాగభూషణము

మూల్యము : 10=00

ఇందులో మానవుడు, మానవుని ఉత్కృష్టత, మానవుని జీవనోద్దేశ్యము, సత్యాసత్యముల నిర్ణయము, ఆర్షశాస్త్రముల మహత్వము, ఋషులని ఎవరి నంటారు, వర్ణాశ్రమ వ్యవస్థ, ధర్మము, దాని స్వరూపము, కర్మలు కర్మభేదములు, పూర్వ జన్మ, పునర్జన్మ, కర్మానుసారముగ యోని ప్రాప్తి, కార్య కారణ సంబంధము, అనాది తత్త్వములు, ఈశ్వరుడు, జీవుడు, ప్రకృతి, విద్యా అవిద్యా, బంధనము, ముక్తి, ముక్తి యందు జీవుని స్థితి, పునరావర్తము, ఈశ్వరుని సాక్షాత్కారమునకు అర్హత, స్తుతి ప్రార్థన, ఉపాసనల స్వరూపము, ఆస్తిక నాస్తిక వాదము, 33 దేవతలు, భగవంతుడు, తీర్థములు మొదలగు వర్ణన గలదు. తప్పక చదువగలరు.

ప్రాప్తిస్థానము : **కోటికె లక్ష్మయ్య, శ్రీ విద్యాబుక్ డిపో, హైద్రాబాద్ - 195.**

